# భారతి

మాసపత్రిక
*
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)
*
**సంపుటము : 66** **మే 1989** **సంచిక : 5**
విడిపత్రిక వెల ఐదురూపాయలు

---

## విషయానుక్రమణిక

**మే 1989**

# స్వవిషయం

వాసవి కన్యక అగ్నిప్రవేశానికి కారణభూతుడైన విష్ణువర్ధనుడు ఎవరో ఇప్పటికీ వివాదాస్పదంగానే ఉంది. ఈ అంశంపై మరొక్క సారి "చరిత్ర విద్యాధర" శ్రీ తురగా కృష్ణమూర్తి వ్యాఖ్యానిస్తూ— "కన్యక కథ యదార్థముగా జరిగినదని, అందలి విష్ణువర్ధనుడు విజయార్కుని కుమారుడని" - అభిప్రాయపడుతున్నారు. ఈ అభిప్రాయం వాదప్రతివాదాలకు దారితీయగలదు. చారిత్రక విమర్శకుల ధోరణి ఎలా ఉంటుందో మరి!

కవిత్వానికి తపస్సు జోడించి, సాహితీలోకంలో ధన్యజీవులైన వారిలో కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఒకరు. ఆయన కవితా తపస్సును గురించి శ్రీ జి. వి. సుబ్బారావు చర్చించిన తీరు సంప్రదాయ సాహిత్యకారులకు తృప్తిగా తోచగలదు.

ఈ సంచికలో కీ.శే. కొమర్రాజు లక్ష్మణరావుపంతులు వెలార్చిన విజ్ఞాన చంద్రికలను "భారతి" చదువరులకు శ్రీ సోమసుందర్ అందించే ప్రయత్నాన్ని చేసారు. కథక చక్రవర్తి కీ.శే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి అన్నట్లు ప్రపంచంలోనే అపురూపమైన వ్యక్తిత్వం, సృష్టిలోనే అపూర్వమైన అవతారం కొమర్రాజుగారిది. నభూతో నభవిష్యతి అన్న మూర్తిమంతనం వారిది.

ఈ సంచికలో అందిస్తున్న మరో వ్యాసం డా॥ శరావతిగారి బాదమ్మ. కవిసమ్రాట్ చారిత్రక నవల బద్దన్న సేనానిలోనిదీ పాత్ర. ఈ పాత్ర ఔచిత్యాన్ని గురించి, వైశిష్ట్యాన్ని గురించి - అన్ని కోణాల నుంచీ దర్శించే ప్రయత్నం ఈ రచనలో జరగడం ముదావహం. బద్దన్న, బాదమ్మల తత్త్వం శివలింగతత్త్వంగా చెప్పబూనడం సరి కొత్త ఆలోచనలకు పాదు పోస్తుంది.

భిన్నరూపాలతో, భిన్నభావాలతో వెలికివచ్చే అనంత అంతః సీమాక్షర కవితామృతధారలకు భారతి ఎప్పుడూ దోసిలిపట్టే ఉంటుంది. పాతకొత్తల మేలుకలయికతో తెలుగునారి సంస్కృతికి ప్రతిబింబంలా నిరంతరం మసలుకోవడమే భారతి సాహిత్య మాసపత్రిక ఆశయం అన్న విషయం చదువరులందరూ మరొక్కమారు గమనించవలసిందిగా మనవి.



# 'స్త్రీ స్వాతంత్ర్య పర్వతి'

పుట్టింట్లో....
రక్తం పంచిన చల్లని ఆత్మీయుల మధ్య
అల్లీ బిల్లిగ ఆడీపాడిన ఆ ప్రాంగణంలో
తలవంచుకు కూర్చున్నది
కలలేమౌతాయో తెలియని
కన్నెపిల్ల - కళ్ళనిండ నల్లని కాటుక పెట్టి
కాటుక చాటున రేపును గూర్చిన ఊహలు నెట్టి
బరువుగ సాగే కాలానికి పలుమ్రొక్కులు పెట్టి
పోటూ పాటూ తెలియని ఏటికన్నెలా
పెళ్ళిచూపు లాటలో పెనుపావుగ మారి.

అత్తింట్లో....
అనురాగం ఆప్యాయతల కర్థం చెప్పే భర్తతో
అమ్మానాన్నలు గారాంగా కొనియిచ్చిన స్కూటరెక్కి
ఆరుబయటి కరిగే చిరుకోరికతో
అత్తామామల దృష్టిని తప్పుకోవటానికై
తలనిండా ముసుగుపెట్టి నేలచూపు చూచుకొంటు
తడబడే అడుగులతో దడదడలాడే గుండెతో
ఇంటిబయటికి వస్తోందొక ఇంటి క్రొత్తకోడలు.

వీరిద్దరినీ గమనిస్తూ
వియత్పథం ఘూర్ణిల్లేలా
ముక్కుతాడు వేసి ముట్టె పొగరణచబడ్డ
పోట్లగిత్త వేసిందొక రంకె
'వంచిన తలలెత్తండో వనితలార! ఇకమీదట
కించపరచుకోకండి మిము మీరే తలలువంచి
తప్పుడు పని చేస్తేనే తలలు వంచుకోవాలి
ఇప్పుడమిని స్త్రీలంతా నిప్పుల్లా మెరవాలి'
ఆ రంకెకు ఆ అతివలు తలలెత్తారు
అందులోని అంతర్యం గ్రహియించారు
పశువుకున్న స్వాతంత్ర్యం పడుచుల కెందరికున్నది?
పరుల అభిప్రాయాలకే పడతి తలను వంచుతోంది
ఈ స్థితి మారే సమయం ఇపుడిపుడే వస్తోంది
ఇంతికి స్వాతంత్ర్యార్హత ఈ కాలం ఇస్తున్నది.

# అన్నదాత ఆత్మఘోష

నాగేటి కఱ్ఱుమీద నారికేళాన్ని కొట్టి
నారుమడిలో విత్తనాలు చల్లుతున్న రోజు
నమస్కరించాను మేఘమాలకు
నా గుండెలలో ఉరమవద్దని
నా కన్నులలో కురవవద్దని
నారు పీకి నాటేసేనాడు మళ్ళీ మ్రొక్కాను
ఏరూ ఊరూ ఒకటిగ చేసి ఏడిపించవద్దంటూ
శ్రావణ భాద్రపదాలను చల్లగా దాటేయమంటూ
సమవృష్టితో సస్యాలను సంరక్షించాలంటూ
వెన్ను చేసి కంకి ముదిరి ఒరిగి కోతకున్న నాడు
బంగారపు పంటచూచి నేలతల్లి కులుకునాడు
ఆరుగాలం కష్టాలకు ఫలితం కనిపించునాడు
చుక్కలతో శరద్రాత్రి చక్కగ శోభిల్లునాడు
నా ప్రార్థన వమ్ము కాగ
నా మ్రొక్కును లెక్కగొనక
ముసురుకొంది మొయిలుగుంపు
తళతళతళ మెరుపులు నా తలపులకే పోకివ్వగ
ఫెళఫెళఫెళ ఉరుములు నా పేదగుండె కదలుగొల్ప
ఎడాపెడా గాలులు పై రెన్నులన్ని మట్టిగొట్ట
మెరిసే నా రేపులన్ని విరిసే తుఫాను తాకి
రూపుమాసిపోగా
గుండెల్లో గుబగుబలు చిత్తంలో లబలబలు
కన్నుల్లో నీటిపొరలు వెన్నులోన వణుకు తెరలు
అయినా ఎవరికి జాలి? నా నోటే దుమ్ముధూళి.
ఉంటేనేమో అతివృష్టి లేకుంటే అనావృష్టి
పెరిగిన సేద్యపు ఖర్చు తరిగిన నికరాదాయం
చీడా పీడ పురుగుపుట్రు చీకూచింతల బ్రతుకు.
ప్రపంచాన్ని బ్రతికించే వాడివంటూ నాచుట్టూ
తిరిగిందట ఈ లోకం ఏనాడో ఒకనాడు
ప్రతిపనికీ ఇల్లు విడిచి ప్రపంచాన్ని పట్టుకొని
తిరుగుతున్నాను నేను
రైతును
రాహుగ్రస్త సవిత్రుడను.

శ్రీ సూర్యదేవర రవికుమార్

### "చరిత్ర విద్యాధర" తురగా కృష్ణమూర్తి

# వాసవికన్యక - విష్ణువర్ధనుడు

దిగ్దంతులవంటి ఆర్యవైశ్య పండితులు, కవులు, ఉభయ భాషా ప్రవీణులు, భాషా ప్రవీణులు, శతావధానులు, విద్వాంసులు, న్యాయవాదులు, రాజకీయవేత్తలనేగాక ఇతర విద్యావంతుల, పరిశోధనా ప్రకాండులకు విడివడని చిక్కుసమస్యగానున్న వాసవి కన్యక అగ్నిప్రవేశమునకు కారణభూతుడగు విష్ణువర్ధనుడెవరా? యన్నదింతవరకు పరిష్కృతము కాలేదు. పలువురు పలు విధములనీ విష్ణువర్ధనుని గుర్తింపుచు వ్యాసములు వ్రాయుచుండ ఈ తెగని సమస్య నానాటికి త్రివిక్రమ స్వరూపమును సంతరించు కొనుచున్నది.

ఈ కథకు మూలము స్కందపురాణాంతర్గతమని కొందఱు చెప్పుచుండ మరికొందరు మార్కండేయ పురాణమని యనుచున్నారు. యదార్థమునకు స్కాందమున నీకథలేదు. మార్కండేయ పురాణమున నిది ఉత్తర భారతమునకు చెంది, పేర్ల మార్పుతోనున్నది. ఆ కారణమున నాగ్రంథములు మన కుపకరింపవు.

కన్యక చరిత్రను తెలుపు గ్రంథములు సంస్కృతమున, తెనుగునగూడ కలవు. సనత్సుజాతసంహితలోని శ్రీమత్కన్యకా పురాణము, శ్రీ వాసవీ కన్యకాపురాణము, వైశ్యపురాణము, సనత్కుమారప్రోక్త ఊరుజోపాఖ్యానములు సంస్కృతములోను భాస్కరాచార్యకృత వైశ్యపురాణము తెనుగులోను యున్నవి. శ్రీమత్కన్యకాపురాణమ్ అరువది అధ్యాయములు కలిగి స్కాంద పురాణాంతర్గత సనత్సుజాత సంహితనా వన్నెకెక్కినది. దీనిని పెనుగొండ ఆర్యవైశ్య సంఘమువారు ప్రచురించిరి. ఇదిగాక మరొక శ్రీమత్కన్యకాపురాణమ్ అను పేరున చిత్తూరు వాటంబాటి వేంకట నరసింహం శ్రేష్ఠిగారిచే ప్రచురింపబడిన సంస్కృత గ్రంథములో ముప్పదిరెండు అధ్యాయములుండి పైన జెప్పిన గ్రంథముతో పలుచోట్ల పారబేధములు కలిగియున్నది. శ్రీ వాసవీ కన్యకాపురాణమ్ అను పేరున 8 ఆశ్వాసములతో నొక చిన్న గ్రంథము ప్రచురింపబడియున్నది. దీని ప్రచురణకర్తలు పెనుగొండ క్షేత్రమందలి ఆర్యవైశ్య కార్తీక సమారాధన సంఘమువారు. ఆదిగురు భాస్కరాచార్యకృత సంస్కృతవైశ్య పురాణమ్ ఒకటున్నదని చెప్పబడుచున్నది. గాని దాని ప్రతి యింతవరకు లభ్యము గాలేదు. ఇదిగాక సనత్కుమారప్రోక్తమగు కన్యకాపురాణ మొకటున్నది. ఇవన్నియు గీర్వాణభాషలో విరచింపబడిన గ్రంథములు. ఇక తెనుగున ఒకేఒక గ్రంథము వైశ్యపురాణము అను పేరున బమ్మెర పోతన అనంతరుడు భాస్కరాచార్య కవివిరచితమై యున్నది కలదు. దీనిని మద్రాసు లోని వావిళ్ల రామస్వామిశాస్త్రిలు అండ్ సన్స్‌వారు ప్రచురించిరి.

పైన చెప్పిన గ్రంధములలో కథాకథనము వేరు వేరు విధములుగా యుండి పరస్పర భిన్న పాఠములతో కథాంశమును గజిబిజి యొనర్చి గందరగోళ పరిస్థితిని కల్పించి, అసలు సంఘటన కల్పితమా? అన్న అనుమానమును కల్గించుచున్నవి. వివిధ గ్రంధములలో ప్రస్తావింపబడిన విషయముల సమన్వయము చేయు యత్నము "ఏ ఛేజ్ ఆఫ్టర్ ఎవైల్డుగూస్" వతుగా నుండును. గాన ముఖ్యవిషయముల నెంచుకొని మూలగ్రంథ వక్కాణములతో సమన్వయ మొనరించుకొనుచు పోవుట సంభావ్యము.

అట్లు చేయుటకుముందు మనమొక ముఖ్య నియమమును పాటింపవలెను. అదేదన-కన్యకను గూర్చిన కథాసంవిధానములో గీర్వాణ భాషలోనున్న గ్రంథముల వ్రాతలాధారముగ మూల గ్రంథానుసారము సమన్వయించుట. అందలి పరస్పర అసంబద్ధ విరుద్ధ వ్రాతల ప్రామాణికతను నిర్ణయించుట ముఖ్య లక్ష్యముగ నుంచుకొని రచన సాగించుట. అంతియేగాక సంస్కృతభాషలో రచింపబడియున్న గ్రంథములు పరస్పర భిన్నమార్గములలో నున్న మూలగ్రంథ మాధారముగ నా వ్రాతను సవరించి స్వీకరించుట సరియగు మార్గము. సంస్కృతములోనున్న విషయములకు భిన్నముగ అనువదింపబడిన లేక స్వకపోల కల్పితముల

జొన్పి రచన సాగించిన తెనుగు గ్రంథముల వ్రాతల సరకుగొనక వర్తించుట జరిగించవలెను. లేనిచో గందరగోళ పరిస్థితి యేర్పడి విషయమునే ప్రక్కదారి పట్టించి అపసిద్ధాంతములకు దారితీయు ప్రమాదము సంభవించును.

ఇప్పటివరకు కన్యక చరిత్రయొక్క కథ చారిత్రకముగా యదార్థమా? కాదా? యను హంశముపై వివిధ కోణములలో వివిధ వ్యక్తులు దృష్టి సారించి భిన్న నిర్ణయములు ప్రకటించినారు. అట్లు చేయుటలో వారు మూలములో లేని చాళుక్య వంశజుల విషయమునకు వారి రాజధానీ నగర ప్రస్తావనకు యెక్కువ ప్రాధాన్యమిచ్చి నేల విడిచి సాము చేసినారు. సంస్కృతభాషలో రచింపబడిన "శ్రీమత్కన్యకా పురాణము"లో విష్ణువర్ధనుని పేరుగాని వాని రాజధాని రాజమహేంద్రవర విషయముగాని లేదు. ఆదిగురు భాస్కరాచార్య సంతతివారిలోని వాడగు అధునాతన భాస్కరాచార్యులు ( బమ్మెర పోతన అనంతరుడు ) రచించిన తెనుగు వైశ్య పురాణములోను, సనత్కుమారప్రోక్తమగు ఊరుజోపాఖ్యానములోను యున్నవి. వానిని లెక్కగొనక సంస్కృత మూలగ్రంథములోని యుల్లేఖనములకే ప్రాధాన్యమిచ్చి చర్చించి నిగ్గుతేల్చుట లగ్గు.

కన్యక కథ క్రీస్తుపూర్వమే జరిగినదని ఘంటాపథముగ జెప్పగల ఆధారము మూలగ్రంథములోనే యున్నది. పరిశోధనా రంగమున పేరుగన్న శ్రీ కొల్లూరువారు శ్రీ కొర్లపాటివారు ఈ విషయమును గమనింపక తొందరపాటుతో ముందు యేర్పరచుకొన్న నిర్ణయమును సమర్థించుకొను యత్నములో అకాండ తాండవమునకు దిగి తుదకు అపసిద్ధాంతము వెలువరించి తమ పని తీరినట్లు నిశ్వసించినారు. శ్రీ కొల్లూరువారు పెద్ద చెఱుకూరు శాసనాధారముగ కన్యకను పెండ్లాడగోరిన చాళుక్య విష్ణువర్ధనుడు (రెండవ విష్ణువర్ధనుడు) యైయుండవలెనని యూహచేసి ఆ నిర్ణయమును సమర్థించు మార్గమన్వేషణలో దృష్టిని కేంద్రీకరించి, ఇతర అనురోధముల జోలికిపోక, ప్రస్తావింపక "నస్మరంతి" యని స్వస్తి పలికినారు. శ్రీ కొర్లపాటివారు సమస్యను తుదికంట సాగలాగి కన్యక చరిత్ర క్రీ॥శ॥ 14-16 శతాబ్దుల మధ్యకాలమునాటిదని అన్నారు.

పెనుగొండ పురవరాధీశ్వరుడు కుసుమశ్రేష్ఠి జననకాలము శ్రీ వాసవ కన్యకాపురాణమ్ తృతీయాశ్వాసములో

కలావ్యోమాక్షి తర్క ద్విసంఖ్యే వర్షగణేగతే
ఖ్యాతో వైశ్యకులాంభోదౌ కుసుమాఖ్యావణిగ్వరః
ప్రభాత గోత్ర తిలకః క్షీరాబ్దౌ చంద్రమా యివ
సముత్పన్నోభవాలోసౌ కళాపూర్ణః ప్రతాపవాన్"

(కలియుగమున రెండువేల ఆరువందల యిరువది (2620) సంవత్సరములు గతింప వైశ్యకులమున గుసుముడను పేరుగల వైశ్యశ్రేష్ఠుడు ప్రభాత గోత్రమందు క్షీర సముద్రమునందు చంద్రునివలె కళాపూర్ణుడుగను ప్రతాపవంతుడుగను ప్రభవమందెను) అని చెప్పబడినది.

కన్యక తండ్రి కుసుమగుప్తుడు కలియుగమున 2620 సంవత్సరములు గతింప జననమందెను. కలి ప్రవేశము క్రీ॥పూ॥ 3102 సంవత్సరము కాగా అప్పటినుండి 2620 సంవత్సరములు గతించిన క్రీ॥పూ॥ 482 సంవత్సరము వచ్చును. అనగా కుసుమ శ్రేష్ఠి క్రీ॥పూ॥ 482వ సంవత్సరమున పుట్టినవాడగుచున్నాడు. అప్పటికి రాజమహేంద్రవర నగరయునికిగాని, చాళుక్య వంశోత్పత్తి వృత్తాంతముగాని వినబడదు. కుసుమశ్రేష్ఠికి సంతానప్రాప్తి 30 లేక 35వ యేట ప్రాప్తించెనని యనుకొన్న కన్యక జన్మము క్రీ॥పూ॥ 452 లేక క్రీ॥పూ॥ 447వ సంవత్సరమగును. ఆమె 7 సంవత్సరముల వయసున విష్ణువర్ధనుడు చూచి మోహించెనన్న ఆ సంఘటన క్రీ॥పూ॥ 445 లేక క్రీ॥పూ॥ 440వ సంవత్సరమున జరిగియుండవలెను. పక్షాంతరమున 18 సంవత్సరముల వయసున జరిగినదన్న అది క్రీ॥పూ॥ 434 సంవత్సరము లేక క్రీ॥పూ॥ 429 సంవత్సరమో అయియుండవలెను. ఏ విధిని జూచినను కన్యక వృత్తాంతము క్రీస్తుపూర్వము జరిగినదిగాని పరమున జరిగినది గాదని స్పష్టము.

కావున కన్యక నాశించిన విష్ణువర్ధన శబ్దవాచ్యుడు క్రీస్తుపూర్వము చంద్ర వంశోద్భవుడై భూమిని పాలించుచున్న ప్రభువై యుండవలయును. అతడెవ్వరో కనుగొనవలసియున్నది. మరల అన్వేషణా కార్యక్రమమీ ప్రాతిపదికపై జరుగవలసియుండును.

కన్యక అగ్నిప్రవేశకాలము

కల్యాద్యబ్ద గణేష్ట నేత్రరసదోస్సంఖ్యాన్వితే వత్సరే
ప్రాప్తేఽథ ప్రభవే తపస్యసితే పక్షేద్వితీయే గురౌ
వైశ్యైర్భాస్కర పండితాది ధరణీ బృందారకేభ్యస్సహ
ప్రీత్యాష్టాదశ పట్టణాధిపతిభిః దత్తంశుభం శాసనమ్॥

శాసన శ్లోకానుసారముగ గణించగా వచ్చిన క్రీ॥పూ॥ 474వ సంవత్సర మించుమించుగ పైన వివరించిన కాలమునకు సరిపోవుచున్నది. గాన కన్యక కథ క్రీస్తుపూర్వము జరిగినదే! అప్పటికి చంద్రవంశపు రాజులలో విష్ణువర్ధన శబ్దవాచ్యుడు యెవరైన ఈ ప్రాంతముల నేలుచుండిన అతడే కన్యక అగ్ని ప్రవేశమునకు కారణభూతుడని నిర్ణయించుట సమంజసముగాని ప్రసిద్ధ పరిశోధన పండితులు శ్రీ కొల్లూరి శ్రీ కొర్లపాటివారు క్రీస్తు తర్వాత కాలమునాటిదీ సంఘటనయని అభిప్రాయపడి ఆ కాలములో నున్నవారిలో నెవరినో యొకరిని నిర్దేశించి చూప కాల వ్యయము చేయుటంత సమంజసము గాదనుకొందును. శ్రీ కొల్లూరు వారు "న-ఇతి" "న-ఇతి" మంత్రజపముతో తమ పట్టును సడలించుకొనగా శ్రీ కొర్లపాటివారు సమస్యను తుదికంట సాగదీసి క్రీ॥శ॥ 7వ శతాబ్దినుండి 16వ శతాబ్దివరకు అన్వేషణ సాగించి విష్ణువర్ధన శబ్దవాచ్యులలో రెండవ కులోత్తుంగచోళుడుగాని సర్వలోకాశ్రయ విష్ణువర్ధన సాతోడాబెహరా మహాపాత్రులు శ్రీ శంకర హరిశ్చంద్ర మహారాజులుగాని యైయుండురని ద్రావిడ ప్రాణాయామపతుగా చెప్పుచు ఆత్మసంతృప్తిని ప్రకటించుకొన్నారు. అయితే కుసుమశ్రేష్ఠి జననకాలము, సంతానోత్పత్తి వృత్తాంతము వారి దృష్టికి వచ్చినట్లు లేదు. అందువలననే వారు అకాండ తాండవమునకు పాల్పడుట సంభవించినది.

వారి వ్రాతలలో నొక ఆత్మవిశ్వాసము కరడు గట్టినట్లు కన్పడుచున్నది. అదేమనగా-పెనుగొండ వైశ్యులలో కన్యకతో పాటు 102 గోత్రములవారు అగ్నిజొచ్చిన కాలము స్థూలముగ 1150వ సంవత్సరము కావచ్చునన్నది. ఇదియొక సంభావ్యమైన సమన్వయము" అని చెప్పుచు మరల దానికొక హంస పాదు పెట్టినారు.

ఈ సందర్భమున వారొక ముఖ్యమైన విషయమునే మరచినారు. వారి నిర్ణయములో కన్యక అగ్నిప్రవేశ కాలము క్రీ॥శ॥ 1150గాని అతఃపరముగాని యైయుండవలెను. క్రీస్తుపూర్వమని అంగీకరింప వారు నిరాకరింతురు. అంతేగాదు—క్రీ॥శ॥ 1150నకు పూర్వమనికూడ వారు నేమ్మతించరు. ఉపరి- "అష్టాదశ పట్టణాధిపతులైన వైశ్యుల ప్రమేయము గల వాసవి కన్యక కథ చారిత్రకమైనచో అది 12వ లేక 13వ శతాబ్దములందు జరుగుటకు అవకాశము గలదు" అని సాయించినారు. కాని వారు శా॥శ॥ 856 (క్రీ॥శ॥ 934)నాటి "కొమ్మనూతల" శాసనమును చూచియుండిన ఇట్లు వ్రాయ సాహసించియుండరు. ఆ శాసన సంక్షిప్తసారమిది:-

"స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు 856 (క్రీ॥శ॥ 934) జయ సంవత్సర వైశాఖ శుద్ధ అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకులైన కోమటి నూతల చింతల వేంకట నాధస్వామి నిత్యతళిహ దీపారాధన బ్రహ్మోత్సవములకు తూర్పు దక్షిణ పశ్చిమోత్తర 102 గోత్ర వైశ్యులిచ్చిన తామ్రశాసనము"

ఈ శాసన మిచ్చుటకు వెనుకనున్న కథతో మనకవసరము లేదు గాని క్రీ॥శ॥ 934 నాటికే 102 వైశ్యగోత్రముల ప్రశంస ప్రచారమునందున్నట్లు దానితో ముడివడిన కన్యకా పరమేశ్వరి అగ్నికుండ ప్రవేశ వృత్తాంతము బహుళవ్యాప్తి నందినట్లు స్పష్టమగుచున్నది.

ఆ సందర్భమున 102 గోత్రముల వైశ్యకుటుంబములవారు "చింతలరాయ్డు"నకొక దేవాలయము, మరొకదానిని "శ్రీ కన్యకా పరమేశ్వరి"కి నిర్మించి ప్రతిష్ఠ చేసిరి.

ఈ విషయోద్ఘాటనము వలన క్రీ॥శ॥ 934నకు పూర్వమే కన్యకా పరమేశ్వరి అగ్నికుండ ప్రవేశము జరిగి ఆర్యవైశ్యులు 102 గోత్రములవారు కూడ నామె ననుగమించి ప్రత్యేకత సంతరించుకొనిరని రూఢియగుచున్నది. ఆ ప్రకారము శ్రీ కొల్లూరివారి వ్రాతలు శ్రీ కొర్లపాటివారి వాదనలు గాలికి కొట్టుకొనిపోయిన పేలపిండివలె నిస్సారములగుచున్నవి.

కన్యక అగ్నికుండ ప్రవేశకాలమున భాస్కరులవారికి "తామరాడ" యను గ్రామము దాన మొసంగబడినట్లున్న వక్కాణము గూడ హాస్యాస్పద మనిపించుచున్నది. దానిని నిరూపించు శాసన మొకటియున్నది అది రెండవ అమ్మరాజు విజయాదిత్యుని "సిరియూరు" (కడలి) తామ్రశాసనము. క్రీ॥శ॥ 965-970 మధ్యకాలమున నీశాసనము ఈయబడినట్లు చరిత్రజ్ఞులు నిర్ణయించినారు. ఆ శాసనములో నుదహరించిన దాన గ్రామ సీమా విభాగమునుబట్టి "సిరియూరు" నేటి "తామరాడ"గా నిర్ధరించుట జరిగినది. కావున రాజమహేంద్రవర పాలకులగు చాళుక్య ప్రభువుల కాలములో క్రీ॥శ॥ 970 వరకు "తామరాడ"ను గ్రామమే లేదు. "సిరియూరు" మాత్రమున్నది. అందుచే కన్యక గుండ ప్రవేశకాలమునను "తామరవాడ" గ్రామమే లేదని స్పష్టపడుచున్నది. ఆ పేరున లేని గ్రామదాన మెట్లు జరిగినది? పక్షాంతరమున జరుగవలసియున్న "సిరియూరు" "తామరవాడ" గ్రామ నామమును సంతరించుకొన్న పిదపగాని జరుగరాదు. "సిరియూరు" "తామరవాడ"గా యెపుడు మారినదో తెలియదు. కాని పురాణములో చెప్పబడిన కాలమునాటికా పేరుననున్న గ్రామమేదియు లేదు.

ఏతావతా చెప్పవలసిన విషయమేమన కన్యకాపురాణము నందలి కథ క్రీస్తుపూర్వమే జరిగినదనీ, దాని పూర్వభాగము పురాణకథగా నెంచుకొనుట సంభావ్యమనీ ఉత్తరభాగము అర్వాచీన రచనమనీ దానికి చారిత్రక ప్రాధాన్యత నిచ్చుట కింకను తీవ్ర పరిశోధనము జరుగవలెననీ, మూలకథకు భిన్నమగు వ్రాతల నన్నింటిని పరిహరించి, తక్కిన కథ జరిగినది జరిగినటుల విశ్వసించుట ఉభయతారకమనీ, అట్లు యెంచుటలో కన్యక కథకు పురాణ ప్రాశస్త్యము లభించి, అనుమానాస్పదము లగు పట్టులు తమ పట్టులు తప్పి యదార్ధస్థితి గోచరించుననీ, అంతియేగాని "నా కవిత్వంబు కొంత నీ పైత్యము కొంత" యన్నట్లు సనత్కుమార ప్రోక్తమను పేరున వెలసిన వ్రాతలను, బమ్మెర పోతన అనంతరుడు భాస్కరాచార్యులు ప్రాంతీయ ప్రాధాన్యత గూర్చుటకు యత్నించుచు వ్రాసిన తెనుగు వైశ్య పురాణములోని చాళుక్యరాజ ప్రశంస, రాజమహేంద్రవర రాజధానీ ప్రశంస, పాగుణార విషయ ప్రశంస, తామరాడ గ్రామ దాన ప్రశంసలు వినా మిగిలిన వ్రాతలు ఆధారముగా పురాణ వచనముల నమ్మిచరించుట బహుధా శ్రేయస్కరము*

పెనుగొండ పురవరేశ్వరుడైన కుసుమశ్రేష్ఠి కుమార్తె "వాసవి కన్యక" నుద్వాహ మాడగోరిన విష్ణువర్ధను డెవరో యింతవరకు తేలలేదు. కులాచారమునకు భిన్నముగా కన్యకనిచ్చి ప్రభువు కోర్కెను దీర్చలేక ఎదిరించి నిల్వలేక 102 గోత్రముల వారితో నగ్ని జొచ్చిన "కన్యక" వృత్తాంతము "శ్రీమత్కన్యకా పురాణము"ను గీర్వాణభాషలో రచింపబడిన గ్రంథములో విపులముగా నుల్లేకింపబడియున్నది. ఇది స్కాందపురాణాంతర్గత మందురు. గాని అందునిది గాన్పింపదు. మార్కండేయ పురాణ మందున్నదందురుగాని యా కథ ఉత్తర హిందూస్థానములోని మాళవదేశ రాజునకు సంబంధించియున్నది. ఆదిభాస్కరాచార్య రచిత వైశ్యపురాణములో నేమున్నదోగాని, ఆ భాస్కరాచార్యుని వంశములోనివాడగు మరొక భాస్కరాచార్యునిచే రచింపబడిన తెనుగు వైశ్యపురాణమునందు మాత్రము మూలమునకు విరుద్ధమైన హంశములు పొందుపరుపబడినవి. దానిపై తర్జన భర్జనలు బయలుదేరి సమస్య తేలక పరిశోధకులకు తలనొప్పి ఘటించుచున్నది. ఈ తెనుగు వైశ్య పురాణములోను సనత్కుమార ప్రోక్తమనబడు "ఊరుజోపాఖ్యానము"లోను మూలగ్రంథములో లేని వక్కాణములకు భిన్నముగానున్న హంశములివి:-

(1) కన్యకను వివాహ మాడగోరిన విష్ణువర్ధనుడు రాజమహేంద్రవర రాజధానిగ నీ ప్రాంతము నేలిన ప్రభువు.

(2) కన్యక అగ్ని ప్రవేశ కాలమున 18 పట్టణాధిపతులు భాస్కరాచార్యుల ప్రీత్యర్థం శాసనము వ్రాసియిచ్చిన గ్రామము "తామరాడ".

(3) ఈ తామరాడ గోదావరి తటమున పానారసీమలో నున్నది

ఈ పై హంశములన్నియు మూలములో లేని విరుద్ధపు వ్రాతలు తప్ప అన్యములు గావు.

శ్లో॥ కల్యాద్యబ్ద గణేష్ట నేత్రరసద్వ్యస్సంఖ్యా గతేవత్సరే
ప్రాపేబ్దే ప్రభవే తపస్యసి సితేపక్షే ద్వితీయం గురౌ
ఆర్యా భాస్కర పండితాది ధరణీబృందార కేభ్యస్సదా
ప్రీత్యాష్టాదశా పట్టణాధిపతిభిః దత్తం శుభం శాసనమ్॥

---

* కన్యక అగ్నికుండ ప్రవేశకాలము పలువురు పలువిధముల నిర్ణయింపబడుచు వచ్చినది. డా॥ మారేమండ రామారావు గారు దీనిని కలి సంవత్సరము 4328 (క్రీ॥శ॥ 1226)గా భావించినారు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం శ్రీ కొమాండూరి వేంకటాచార్యులుగారు క్రీ॥శ॥ 656గా గుర్తించారు. డా॥ యశోదాదేవిగారు క్రీ॥శ॥ 1316గా పరిగణించినారు. శ్రీ కొల్లూరువారు పెద్ద చెఱుకూరు శాసనములోని ప్రథమార్థ భాగమును కన్యకా పురాణములోని అగ్నికుండ ప్రవేశ కాలమును సూచించు శ్లోకములోని ప్రథమార్థభాగమును తులనాత్మకముగా సుదీర్ఘ విమర్శ గావించి క్రీ॥శ॥ 1420వ సంవత్సరము కంటె అనంతరమను యభిప్రాయబడిరి. "సిరియూరు" శాసనమునుబట్టి క్రీ॥శ॥ 970వ సంవత్సరమునకు ముందు "తామరవాడ" యను గ్రామము లేకున్కి ఆ పేరు క్రీ॥శ॥ 970 తర్వాత క్రీ॥శ॥ 1000వ సంవత్సరమున వచ్చియుండెనని తలంచినను పురాణములో చెప్పిన గ్రామదాన విషయము భాస్కరాచార్య కల్పితమనీ అట్లనే విష్ణువర్ధన రాజమహేంద్రవర ప్రశంసలు గూడనని తెలుచున్నది.

అను శాసన శ్లోకమునుబట్టి కన్యక అగ్నిప్రవేశకాలము తెలియుచున్నది. ఆ సందర్భమున వైశ్య కులగురువు అగు ఆదిభాస్కరాచార్యునకు వృద్ధనాగరులు 18మంది పట్టణాధిపతులు "తామరాద" అను గ్రామమును దాన మొసంగిరనియు నర్థము చెప్పుచున్నారు. ఈ అర్థము శ్లోకపాఠమునకు విరుద్ధముగా నున్నది. ముఖ్యముగా గ్రామ దాన విషయమున.

ఇక కన్యక అగ్నిప్రవేశ కాలము కల్యాది వత్సరములు 2628 గడవగా ప్రభవనామ సంవత్సర మాఘశుద్ధ-గురువారం నాడని శ్లోకార్థము. కలియుగ ప్రవేశము క్రీ॥పూ॥ 3102కాగా అందు 2628 సంవత్సరములు గడవగా క్రీ॥పూ॥ 474 సంవత్సరము వచ్చును. అది ప్రభవనామ సంవత్సరమే! కావున కన్యక క్రీ॥పూ॥ 474 సంవత్సరమున అగ్నిప్రవేశ మొనరించెనని తేలుచున్నది. అనగా నీకథ కడు ప్రాచీనకాలమున జరిగెనని స్పష్టము.

కన్యకను వాంఛించి పాణిగ్రహణ మొనర్పకోరిన రాజు చంద్రవంశ్యుడు విష్ణువర్ధనుడనియు నాతడు రాజమహేంద్రవర పట్టణము నేలుచున్నవాడనియు మూలములో లేని హంశములు నుట్టంకించి ఆంధ్ర గ్రంథములు రచింపబడినవి. ఈ రెండు హంశములు బట్టికొని విమర్శింపదొరకొన్న కన్యక అగ్నిప్రవేశకాలము నాటికి చంద్రవంశ్యుడైన విష్ణువర్ధనుని వంశము(చాళుక్య వంశము) అసలే ప్రభవించి యుండలేదని, రాజమహేంద్రవర పట్టణ నిర్మాణము అసలే జరుగలేదనియు కావున నీకథ నిజముగ జరిగినదో? లేదో? యను యనుమానమొదవినవి. విమర్శకులు కొందరీ విరుద్ధ హంశముల సమన్వయింప నెంతయో శ్రమ దీసికొనిరిగాని సమంజసమైన నిర్ణయము చేయజాలకపోయిరి.

చారిత్రకముగ నీకథకు ప్రాధాన్యత ఘటించు యత్నములో స్థానిక చరిత్రలలోగల యొకానొక వృత్తాంతము నా దృష్టిలోనికి వచ్చినది. ఇది ప్రసక్త విషయమునకు తు.చ. తప్పకుండ వర్తింపకున్నను ఛాయామాత్రముగానైన నన్వయించునను యూహచే చెప్ప సాహసించుచున్నాను.

అనుమకొండ ప్రాచీనగాథ వివరించు స్థానిక చరిత్రలో నీవిధముగా వ్రాయబడినది. "ప్రాచీన కాలంబున శ్రీశైలప్రాంతారణ్య ప్రదేశంబుల మహాశూరుడై స్వేచ్ఛావిహారము సలుపుచుండిన కిరాతకుడొకడు తన యనుచరులతోగూడి యచటికి నిరువది యోజనముల దూరమున గృష్ణా గోదావరీ మధ్యప్రదేశమున హిడింబాశ్రమంబని ప్రఖ్యాతిగాంచిన ముదిగొండకు నీశాన్య భాగమున గోశ్రయ దూరంబున నుండెడి హనుమాద్రికడకు నేతెంచెను. అచట నొక గ్రామమును నిర్మించి నివసించుచుండెను. అటుపిమ్మట హనుమాద్రిపై నొక దుర్గమును నిర్మాణముచేసి గ్రామమును విస్తరింపజేసి "ఎఱుకదేవరాజు"ను పేరుతో ప్రజాపాలనము సేయుచుండెను. ఆతనికి "అనుమడు" "కొండడు" అను నిరువురు కొడుకులు జనించిరి. ఆ యిరువురిపేరిట నా రాజధానీ నగరమునకు "అనుమకొండ" యను యభిధానము గల్గినది. "అనుమకొంగ"కు దక్షిణమున నాలుగు పర్వుల దూరమున "కొండడు" తన పేరిట "కొండపర్తి" యను గ్రామమును గట్టించెనట! "ఎఱుక దేవరాజు" పిమ్మట వాని కొడుకు లిర్వురును ఆ తర్వాత "నాగడు, గార్దేయుడు" అనువారలిరువురును ఆ దేశమును 186 సంవత్సరములు పరిపాలనము చేసిరని స్థానిక చరిత్రమున జెప్పబడినది. ఈ కిరాతకుల పరిపాలనా కాలములోనే జైనులనేకులు వచ్చి నివాసముల నేర్పరచుకొనిరి. పద్మాక్షీ దేవాలయమున్న కొండపై జైన శిలా విగ్రహములు నెలకొల్పిరి. సిద్ధులకు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమైన స్థలము గాన సిద్ధాశ్రమంబను ప్రసిద్ధి గాంచిన యా శైవక్షేత్రమును జైనక్షేత్రముగ మార్చిరని చెప్పబడినది. గాని దీనిని విశ్వసింపరాదు. మొట్టమొదట నీ ప్రదేశము జైనక్షేత్రముగనే యుండి తర్వాత శైవక్షేత్రముగ మార్చబడినటుల కాకతి ప్రోలరాజు శాసనమునుబట్టి తెలియుచున్నది.

ఈ కిరాతకుల పిమ్మటను చంద్రవంశపు రాజులీ యనుమకొండ రాజ్యమును బరిపాలించినటుల జెప్పబడినది. చంద్రవంశమున పాండవులు జనించిరి. వారి వంశమున "జనమేజయుడు" జనించెను. ఆతని వంశమున విజయార్కుడు, సోమేంద్రుడునను నిరువురు భూపాలురు పుట్టిరి. వారిలో విజయార్కునకు విష్ణువర్ధనుడును, సోమేంద్రునకు ఉత్తుంగ భుజుడును పుట్టిరి. వీర లుభయులును దేశమును విభాగించుకొని పాలించిరి. విష్ణువర్ధనుడు గోదావరికి దక్షిణముననున్న "ధర్మపురి"ని రాజధానిగ జేసికొని, యనేక రాజులను జయించి "రాజరాజ" బిరుదమును బడసి కీర్తిప్రతిష్ఠలను గాంచెను.

"ధర్మపురి" తెలంగాణములో "వేములవాడ" పరిసరముల నున్నది. చంద్రవంశ్యుడైనట్టియు, విజయార్క కుమారుడైనట్టియు విష్ణువర్ధనుడు మహాబలవంతుడై, శత్రురాజులనెల్ల జయించి, అసహాయశూరుడై రాజులకురాజై ప్రఖ్యాతి కెక్కిన

వాడని చెప్పుటచే నాతడు గోదావరీ పరీవాహ తీర మిరుతటముల తన రాజ్యమును విస్తరింపజేసికొని పాలించెననుటలో విప్రతిపత్తి యేమియు కానుపింపదు.

ఆంధ్ర ప్రాంతమునకు చాల ప్రాచీన కాలములోనే వైశ్యులు వలసవచ్చి స్థావరముల నేర్పరచుకొని సాంఘికముగ ప్రముఖస్థానము లాక్రమించుకొనుటయే గాక రాజ్యతంత్రమున గూడ కీలకపాత్ర వహించి సైన్యాధ్యక్ష పదవు లలంకరించి మించిరని చరిత్ర తెలుపుచున్నది. అట్టివారిలో పెనుగొండ కేంద్రముగా వెలసిన 18 పట్టణముల పాలనము వైశ్య ప్రభువుల హస్తగతమై యుండియున్నట్లు విశ్వసింపవలసి వచ్చుచున్నది. ఆంధ్ర తెలంగాణములలో పశ్చిమ, తూర్పు చాళుక్యులు (చంద్ర వంశ్యులు) ఆక్రమించుటకు పూర్వమే చంద్రవంశపు రాజులు దాని నాక్రమించి పాలించినట్లు పైన వివరించిన విషయము వలన స్పష్టమగుచున్నది. కావున బహు పురాతన కాలము నుండియు చంద్రవంశ ప్రభువులు, వైశ్యశ్రేష్ఠులు గూడ రాజ్య పాలనా భారవహులై ప్రవర్తించిరని తేలుచున్నది.

ఆ పరిస్థితులలోనే చంద్రవంశోద్భవుడగు విష్ణువర్ధనుడు గోదావరి దక్షిణ భాగముపై నధికారము వహించి, బహు పరాక్రమవంతుడై విస్తార రాజ్యభాగమును పాలించుచుండె ననియు నది మంత్రకూటము మొదలు భద్రాచలమువరకు సాగెనని గూడ తెలియుచున్నది. అట్లగుడు - విష్ణువర్ధనుడు నేటి రాజ మహేంద్రవరము వరకు గోదావరీ తీరప్రాంతముల వరకు యేలుబడి సాగించియుండును. ఒకదానివెనుక నొక ప్రదేశమును జయించుకొనుచు విజయియై పెనుగొండ పట్టణమునేలు కుసుమశ్రేష్ఠిని జయింప పెనుగొండకడ విడిసియుండి కుసుమశ్రేష్ఠి కుమార్తె "కన్యక"ను గాంచి, మోహించి, ఆమె నుద్వాహమాడ నెంచి తన మనోరథము నా శ్రేష్ఠి కెరిగించియుండును. కులాచారమును త్యజింపలేక, బలీయుడగు రాజు నెదుర్కొనలేక కుసుమశ్రేష్ఠి కింకర్తవ్యతా మూఢుడై తనవారలనెల్ల రావించి, పట్టణమధ్యమందున్న శ్రీ నగరేశ్వర స్వామివారి ఆలయ ప్రాంగణమున సభ దీర్చి, సభాభిప్రాయమునుగోర 102 గోత్రములవారు పిల్లనిచ్చుట కంగీకరింపక ఆత్మాహుతికి సమ్మతించిరి. మిగిలిన 612 గోత్రములవారీ నిర్ణయమును వ్యతిరేకించి వెడలిపోయిరి. ఆ రీతిగ "కన్యక" అగ్నిప్రవేశ కథనము జరిగియుండును. ఇది "శ్రీమత్కన్యకాపురాణము"లోని వ్రాతలకు కొంతవరకు సంవదించుచున్నది. విష్ణువర్ధనుడు విజయియై వచ్చుచు రాజ మహేంద్రవరము (ఆనాటి పేరేదియో తెలియదు) జయించి పెనుగొండకు వచ్చియుండును. దీనికి విరుద్ధముగ వైశ్యపురాణ కర్త రాజమహేంద్రవర ప్రసక్తి, తద్రాజ్యమేలు (చాళుక్య) విష్ణువర్ధన ప్రసక్తి తెచ్చి మూలచ్ఛేది పాండిత్యము నెరపి ఇడుముల తెచ్చిపెట్టినాడు!

మనకు కలియుగారంభమునుండి భారతవర్షము నేలిన రాజ కుటుంబముల గాథలు, వారు దక్షిణాపథగాములై స్థాపించుకొని పాలించిన రాజ్యవివరములు గ్రంథస్థ మొనరించియున్నారు. అందుల కుదాహరణ "కలియుగ రాజవృత్తాంత"మను గ్రంథ మును పేర్కొనవచ్చును. అందు కలియుగ ప్రారంభమునుండి క్రీస్తుశకము 15, 16 శతాబ్దములవరకు నడచిన రాజుల, రాజ్యముల వృత్తాంతములనెల్ల సవిస్తరముగ వెల్లడించబడినవి. తత్కారణ మున క్రీ॥పూ॥ 474వ సంవత్సరమున ప్రవర్తిల్లిన "కన్యక" చరిత్రము కులసంబంధిగా యెంచబడి చరిత్ర కెక్కుటకు నోచు కొనక మరుగున పడియుండవచ్చును. అయినను వైశ్యకులా వతంసులు తమ "కులదేవత"యై పూజలందుచున్న "కన్యా కుమారి"ని గూర్చిన వృత్తాంతము పురాణపంథాలో అక్షరబద్ధము చేసి, స్మరణీయులైనారు.

క్రీ॥పూ॥ 6, 5 శతాబ్దులలో ఆంధ్రమునందు జైన, బౌద్ధ మతములు వ్యాపించి ప్రజలకు మతదీక్ష నొసగి జాగృతి కల్పించి నవి. ఆ కాలమున దక్షిణ భారతమున బలవంతులగు ప్రభువులు బయలుదేరి రాజ్యముల స్థాపించి పాలింపనారంభించిరి. అతః పూర్వము ఆయా ప్రదేశములందు నివాసమున్న ఆటవిక నాయకులు స్థానిక అనాగరిక కిరాతకాది ఆదిమజాతులవారిని తరిమివైచి రాజ్యవిస్తరణ మొనర్చుకొనిరి. అప్పటికే ఉత్తర భారతమున మగధ సామ్రాజ్యము మూడు పువ్వు లారు కాయలుగ విలసిల్లుచుండెను. దీనికి దీటుగా దక్షిణ భారతమున గూడ బలవత్తరములగు సామ్రాజ్యము లుద్భవించి ప్రజాపాలన సాగింపబడుచుండెను. ఆ విధినే అనుమకొండ రాజ్యము క్రీస్తు

పూర్వమే యేర్పడి ఆటవిక ప్రభుపాలితమై నెగడియుండును. ఉత్తర భారతమునుండి సాహసవంతులగు నృపసత్తములు విజిగీషాయత్తచిత్తులై దక్షిణమునకు వచ్చి ఆటవికజాతి ప్రభువుల పరాజితుల జేసి తమ రాజ్యమును స్థాపించుకొని యుందురు. అట్లు వచ్చినవారు చంద్రవంశ్యులై యుందురు. వారిలో విజయార్కుడు, సోమేంద్రుడు అను భూనాథులు అనుమకొండ రాజ్యము నాక్రమించి క్రమశః తమ విజయ పరంపరుల కారణమున విస్తరణ గావించుకొని పాలనము నెరపి యుందురు.

"కన్యక" అగ్నిప్రవేశ సంఘటన క్రీ॥పూ॥ 474వ సంవత్సరమున యని చెప్పబడుటచే నది ప్రాచీనకాలమున జరిగి యుండెనని యనుకొనవలసి వచ్చుచున్నది. అటులనే చంద్ర వంశ్యుడగు విజయార్కుడు దక్షిణ భారతమునకు ప్రాచీన కాలముననే వచ్చియుండవలెను. ఏలనన పాండవ వంశోద్భవులగు రాజులు దక్షిణ భారతమున క్రీ॥శ॥ 6వ శతాబ్దినిగాని వెలుగు లోనికి రాలేదు. కావున విజయార్కుడు కడు ప్రాచీన కాలముననే అనుమకొండకు వచ్చియుండును. సమకాలీనముగా "కన్యక" అగ్నిప్రవేశ ఘటన సంభవించుటచే విజయార్క సుతుడు విష్ణు వర్ధనుని ప్రశంస ఆ సందర్భమున విననగుచున్నది.

అదియునుగాక చారిత్రకముగా బరిశీలించునపుడు ఆంధ్ర దేశము రెండువేల యేనూరు సంవత్సరములనుండి నాగరికతా విజ్ఞాన వైభవముతో నొప్పుచున్నదని ఘంటాపథముగ చెప్పదగు యాధారములున్నవి. ఆ విధిని క్రీస్తుపూర్వము 2700 సంవత్సరములనుండియు ఆంధ్రుల చరిత్ర మహోజ్జ్వలమై నెగడెనని భావింపవచ్చును. అందుచే క్రీ॥పూ॥ 474వ సంవత్స రమునకు కుబేర వంశ్యులగు వైశ్యశ్రేష్ఠులు (కోమట్లు) ఆ కాలమునగూడ నుండియుండుట సంభవము. గాన "ధర్మపురి" నేలు విజయార్కసుతుడు విష్ణువర్ధనుడే కుసుమశ్రేష్ఠి కుమార్తె "కన్యక" పాణిగ్రహణమునకు బలవంతము చేయుట సంభవించె నని యూహించుట సమంజసమే! యగుచున్నది. అదియునుగాక శ్రీ వాసవ కన్యకాపురాణము 30వ అధ్యాయమందు

> మహాభారత వేదస్య శ్రోతృత్వేన జగంతియః
> అపూరయత్స ధర్మాత్మా శతానంద మహీభుజమ్॥
>
> పుత్రంలేభేసోఽ జనయత్క్షేమ నామానమాత్మజమ్
> సలేభే విజయార్కాఖ్యమాత్మజం ధర్మశాలినమ్॥
>
> విజయార్కస్య మహీపాలో లబ్ధవాన్ విష్ణువర్ధనమ్
> సహి కైలాసశిఖరే చిత్రకంఠాభిధానకః॥
>
> గంధర్వో వైశ్యవర్యాణాం శాపోద్ధోరతరాద్భువి
> విజయార్కస్య పుత్రోఽ భూద్యౌవరాజ్యంచ లబ్ధవాన్॥

(మహాభారత శ్రవణాసక్తుడగు జనమేజయునకు శతానందుడు, శతానందునకు క్షేమనాముడు, ఆ క్షేమనామునకు విజయార్కుడు, ఆ విజయార్కునకు విష్ణువర్ధనుడు పుత్రులై జన్మించిరి. ఈ విష్ణువర్ధనుడే పూర్వం కైలాస శిఖరమందుండి వైశ్యఋషులచే శపింపబడిన చిత్రకంఠుడు అను గంధర్వుడు. ఈ విష్ణువర్ధనుడు విజయార్కుని రాజ్యకాలమున యువరాజై సకల సంపదలతో తులతూగెను.

పురాణ కథనమునకు దీటుగా అనుమకొండ రాజన్యుల కథ సాగినటుల స్పష్టము. గాన "కన్యక" కథ యదార్థముగ జరిగినదని అందలి విష్ణువర్ధనుడు విజయార్కుని కుమారుడు విష్ణువర్ధనుడని అందులకు భిన్నముగ నేటి పరిశోధకులు ప్రచా రించు వివిధ విషయములెల్ల నాధారరహితములని చెప్పవలసి వచ్చుచున్నది.



# కొత్త నిఘంటువు

## శ్రీ పైల కృష్ణారావు

కోయిల మధురగానంలో స్నానం చేసిన
ఆరామ తరులత నికుంజాల సుఖపారవశ్యానికి
అద్దం పడుతున్నాయి
వాటి తడిసిన ఆకుల వలువలు,
ఎరుపెక్కిన చిగుళ్ల పెదాలు,
కైపెక్కిన మొగ్గల బుగ్గలు,
పులకించిన పూల ముఖాలు.
వీచే ప్రతి వాయుతరంగం నవోదయానికి స్వాగతిస్తోంది.
ఊగే ప్రతి ఆకూ ప్రగతి శకటానికి పచ్చజెండా
ఊపుతోంది.
లేచే ప్రతి కెరటం జనార్ణవ సందోహానికి చేయెత్తి
జై అంటోంది.
కర్షకులు లోకానికి వ్రాసి పంపిన శుభలేఖలు ఈ పచ్చని
పైరుపొలాలు.
కార్మికులు కృషియజ్ఞానికి స్థాపించిన యూపస్తంభాలు
ఈ కార్ఖానా పొగగొట్టాలు.
పొడిచిన ప్రతి గడ్డిపరక, పూచిన ప్రతి గడ్డిపువ్వు
ఈ కర్మభూమిలో క్రియాశీలతకు ఎజండాల్లా ఉన్నాయి.
ఐనా
సందెవేళ గూళ్లకు చేరుతూన్న పక్షుల కిలకిలారావాలకు;
సముద్రంవైపు పయనించే సెలయేళ్ల
మానసికాందోళనలకు;
గోపుర మూపురాలపై కులికే గువ్వల కువకువలకు;
బడిగంట మ్రోగాక బాలల అలబిల కోలాహలానికి,
చేపు జ్ఞాపకానికి వచ్చిన క్రేపుల శ్రుతితప్పిన పదలయలకు
అర్థాల కోసం కొత్త నిఘంటువు కావాలి.
ఎగిరే పక్షుల దారులను,
ఈదే చేపల జాడలను,
తెలిపే నిర్ణీత రహదారుల జాబితాతో;
ఉదయించే శిశువు తొలికేక
వికసించే పూవు తెలిరేకు
పనిచేసే రైతు పొలికేక తెలిపే నియమిత వేళలతో
సరికొత్త కాలనిర్ణయ పట్టికలు రావాలి.
పాముల ఫూత్కారాలకు పక్షుల ఆర్తారావాలకు
జీవుల నాడీ స్పందనలకు, లావా ప్రవాహ గమనానికి
గాలి ఈలపాటకు, నీటి అలల పల్లవికి
సంకేతాలైన స్వరగతులు తెరవాలి.
స్తన్యం చాలక పిల్లవాడు తల్లి స్తనాన్ని మోదే దృశ్యం,
రోగిష్టి శిశువును కావలేక రోదించే తల్లి అసహాయత్వం,
తరతరాలుగా ఆశ్రమధర్మాల్ని పేవ్‌మెంట్లపైనే
అనుభవిస్తున్న కాపురాలు.
కట్నాల రాట్నాల ఉరిత్రాళ్లలో చిక్కిన మధ్యతరగతి
మిథ్యాబింబాలు
చిత్రించే కొత్తకుంచెలు కావాలి.
నాగలి పట్టిన రైతు,
కొడవలి పట్టిన కూలి,
పలుగు పట్టిన చేయి బొమ్మ కట్టిన రాయి
కూడలిలో నిలబెట్టేందుకు—
సమాజ శ్రేయస్కాములు,
సంస్కృతీ భాగస్వాములు
స్వేదంలో అభిషేకించిన శ్రమజీవుల శిల్పభంగిమలు
ఉత్సవ విగ్రహాలుగా రూపొంది
గుడులలో వెలసేందుకు—
సరికొత్త ఉలులు కావాలి.
కళలన్నీ కొత్త ఉషస్సులో జలకాలాడి
నైగనిగ్యంతో, నైశిత్యంతో తొణికిసలాడాలి.

శ్రీ జి. వి. సుబ్బారావు

# కవిసమ్రాట్టుల కవితా తపస్సు

అష్టాదశ విద్యలలో కవిత్వమొకటి. విద్య అనగా జ్ఞానము. ఒక నేర్పు. ఇతరుల కలభ్యమైన విషయములను సంయోగపరచుటలో వివేకము భాసించెడినట్లు చేసెడి క్రియా దీప్తి. కవిత్వం ఒక శిల్పం. ఈ కవితాశిల్పం పరాకాష్ఠ పొందటానికి పైన చెప్పిన నేర్పు, వివేకం, భగవద్దత్తమైన ప్రతిభ ఉండాలని అంటారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు. చమత్కృతి కవిత్వానికొక విలక్షణత్వాన్ని ప్రసాదిస్తుంది. స్టీఫెన్ స్పెండర్ అను ఆంగ్లకవి కవితను నిర్వచిస్తూ - మళ్ళీ తిరుగులేనివిధంగా, అంతకంటె క్లుప్తంగా, భావగర్భితంగా ఇతరులు చెప్పలేనివిధంగా, అల్పమైన పదాలతో అనల్పార్థం సృష్టించడం కవిత్వం' అని అంటాడు. కవిత్వం అంటే ఊహ కొక అందమైన, చమత్కారమైన వాగ్రూపం ఇవ్వడం "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్."

కవిత్వానికి ముఖ్యంగా ప్రేరణ, ఆలంబన, ధ్యేయం ఉన్నాయని చెప్పవచ్చును. ప్రాచీనులలో ఈ ప్రేరణ ఏ రాజుల (కృతిపతుల) కోరికో లేక ఇష్టదేవతాభ్యర్థనమో, మఱేదైనా ఉండేది. తండ్రి యానతి, జీవుని వేదన కలబోసి విన్న రామ కథనే మళ్ళీ విన్పించాడు విశ్వనాథ. ఆధునికయుగంలో ప్రేరణకు, సమకాలీన జీవనసమస్యలే ఆధారాలు. ఆ స్పందనతో హృదయం ఆర్ద్రమయి, ఊహగా మారి, గుండెలో పెల్లుబికి, గొంతులో సుడులు దిరిగి గేయమో, పద్యమో, వచన కవిత్వమో వెలికి రావచ్చును. ఇక్కడ ఊహకు హద్దులు లేవనిపిస్తుంది. కాని మమ్మటుడు 'నియతికృత నియమ రహితాం' అని 'నియతిని-నియమ రహితాన్ని' రూపిస్తాడు భావనకు. ఈ భావనా ప్రపంచానికి హద్దులు ఐహికాముష్మికాలు. దృశ్యమానం, ఊహ్యమానం అయిన భావనే కవితగా రూపొందుతుంద సాధారణంగా.

ఇక కవితకు ముఖ్యాలంబనం అనుభూతి. విద్వత్తు, ప్రతిభ, ఉపజ్ఞ, సంస్కారం - ఇవన్నీ ఆలంబనలే. అనుభూతి కేవలం పాంచభౌతికం కానక్కరలేదు. అలౌకికం, అనూహ్యమైంది కూడా ఆలంబన కావచ్చును. మనుచరిత్రలో 'ఆ మంచిడి యతడరిగిన....' అన్న హిమాలయ వర్ణన అల్లసాని పెద్దన ప్రత్యక్షానుభూతి మాత్రం కాదు. అది ఆయన కవితా చక్షువులకు గోచరించిన అపూర్వ పరోక్షానుభూతి మాత్రమే! అలాగే పీటర్ రెడ్‌గ్రోవ్ అన్న ఆంగ్లకవి "ది సన్స్ ఆఫ్ మైస్కిన్' అన్న కవితలో చర్మానికి కేవలం స్పర్శగుణమే కాక, చక్షు శ్రవణాది అపురూప గుణాల్ని అంటగట్టాడు. సహస్రాక్షునిలా దర్శనమిస్తుంది త్వగింద్రియం ఆ కవికి. ఇది కూడా ఒక అతీంద్రియమైన కవితానుభూతి అనాలి.

అసలు ధ్యేయమే అక్కరలేదని ఒక వాదం. లలితకళలన్నీ సమాజానికి అంకితం కావాలని మరొక వాదం. కళ కళ కోసమేనన్న వాదం, ఆత్మాశ్రయ కవిత, భావ కవిత కొంత ఈ కోవకు చెందినవే. వీటన్నిటినీ మించి 'నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు' అన్న కృష్ణశాస్త్రిగారి విలక్షణమైన భావుకత కూడా ఒక కవితాధ్యేయమే! ఇది స్థూలంగా కవిత్వ నిర్వచనం.

ఇట్టి కవిత్వానికి తపస్సు జోడించి, సాహితీ లోకంలో ధన్యజీవులైన కవితా మూర్తులెందరో మహానుభావులున్నారు. ప్రాచీనాంధ్ర కవులలో తిక్కన, పోతన కవితా తపస్వులు. తిక్కన హరిహరాద్వైతభావం మూర్తీభవింపగా పోతన భక్తిరసభరిత కవితా తపస్సులో ధన్యుడైనాడు. పరమ సాత్త్విక కవితామూర్తి బమ్మెర పోతన. ఆధునికులలో సంప్రదాయ కవులలో కవిసమ్రాట్ విశ్వనాథ అట్టి కవితా తపస్సంపన్నులలో అగ్రగణ్యులు. కానీ వీరిది రాజసం, వైదికం, అనన్య ప్రతిభా వైదుష్యాలు కలబోసిన కవితా తపస్సు. 'కవితారూప తపస్సు చేసెదను శ్రీకంఠా!...." అని ఎలుగెత్తి చాటారు శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో ఒకచోట. ఈ కవితా తపో వైభవ విశ్లేషణమే ఈ వ్యాసం.

కవిసమ్రాట్ విశ్వనాథవారి కవితాతపస్సు రామాయణ కల్పవృక్షంలో రెండు విధాలుగా సాగింది. ఒకటి కథా కథనంలో అంతర్లీనమై పాత్రలద్వారా బహిర్గతమైంది. రెండవది ఖండాంత పద్యాలలో కవి స్వయంగా తన జీవుని వేదనను, గుండె తాపిడిని, పరమ శివునితో (కృతిభర్త) విన్నవించుకోవడంలో వెల్లడైంది.

విశ్వనాథవారి కవితా తపస్సు ప్రధాన కావ్య కథా కథనంలో అంతర్లీనమై పాత్రల ఆత్మవేదనతో మిళితమై మనకు గోచరిస్తుంది. "రాముడు నాకు స్నానమగు, రాముడు నాకు జపంబు ధ్యానమున్...." అని దశరథుడు పుత్రప్రేమాతిశయంతో, విశ్వామిత్రునితో అన్నప్పుడు, ఆ పితృవాత్సల్యభరిత గళంలో, రామభక్తి పారవశ్యంతో విశ్వనాథ కూడా తన గొంతు శృతి గలుపుతాడు పాత్రలో లీనమై. అలాగే అహల్య పాత్ర విశ్వనాథ మనోమథనానికి ప్రతీక. తన కావ్యతపస్సులో భాగంగా విశ్వనాథ పితౄణం, ఋషి ఋణం కూడా తీర్చుకుంటాడు. కల్పవృక్షమంతా ఋషిప్రశంసయే! మహర్షుల నిస్వార్థసేవ, త్యాగనిరతి, ధర్మనిష్ఠ పారలౌకిక చింతన - అడుగడుగునా తడవబడింది. విశ్వామిత్ర పాత్ర సృష్టి అసదృశమైంది. ఆయన కథాకథన శిల్పం అత్యద్భుతం. రామలక్ష్మణులు గురువుగారి ప్రతిభకు, నైపుణికి విస్తుపోతారు. కానీ ఈ విశ్వామిత్రుని కథ శతానందుడు చెప్పగా విని అన్నదమ్ములిద్దరూ ముగ్ధులౌతారు.

"ఈ ఋషులెవ్వరు చెప్పిన
సార కథా కథన మొక్క చాయనె నడచున్
వీరంతర్ద్రష్టలు బహు
థా రూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ!"

"అన్ని యంశమ్ములను జెప్పినట్టి తీరు
వేఱు, మేనక కథ తీరు వేఱుగాదె!" — అని గుసగుసలు పోతారా రామలక్ష్మణులు రసార్ద్ర హృదయులై.

విశ్వనాథవారి బహుముఖప్రజ్ఞ ఈ కథాకథనంలో పరాకాష్ఠ నెందింది. శ్రీరామచంద్రుల శస్త్రాస్త్ర గురువులకు, గాయత్రీ మంత్రద్రష్టకు కవి సమ్రాట్టుల కవితాంజలి ఇదేనేమో!

ఇక సీత పాత్ర ఒక విచిత్రపథంలో సాగింది. రామునకు ఆమె ఎందులో తీసిపోదు. ఆమె రాజనీతిజ్ఞురాలు, మాటనేర్పరి, అతి గడుసరి. ఒక మహాయోగిని సీతమ్మ విశ్వనాథవారి కవితా తపస్సులో. అసలు విశ్వనాథవారి స్త్రీపాత్రలందరు ప్రత్యేక వ్యక్తిత్వము గలవారు. తార, మండోదరి, కైక-ఈ పాత్రలలో విశ్వనాథవారి ముద్ర ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అసలు కవిసమ్రాట్టులే ఆ పాత్రలలో లీనమై అలా గడుసుగా, రాజసంగా, గంభీరంగా పలుకుతున్నారా అని అనిపిస్తుంది. ఇదంతా ఎందుకు చెప్పడమంటే యావద్రామాయణ కల్పవృక్షాన్ని - తన అనన్య ప్రతిభా వ్యుత్పత్తులు, లోకజ్ఞత శేముషి, అపూర్వ కవితాశిల్పం - అన్నీ కూడగట్టుకొని, మహా తపశ్శాలిలాగా, అపర వాల్మీకిలా సృష్టించాడు విశ్వనాథ. ఇంత నవ నవోన్మేషమైన, రమణీయమైన, మహత్తరమైన కావ్య శిల్పం, మనోజ్ఞ కథాకథనం, ఈ రసాత్మకమైన కావ్యసృష్టియే ఒక అపూర్వమైన కవితాతపస్సు. ఇంతకన్నా ఈ విషయాన్ని ప్రస్తుతం వివరించదంలేదు.

ఇక రెండవదైన ఆత్మనివేదన గురించి చెప్పుకుందాం. అసలు అనన్య రామకథా కథనశిల్పి, రామభక్తాగ్రేసరుడు అయిన విశ్వనాథ తన కల్పవృక్షాన్ని నందమూరి పరమశివునికి ఎందుకు అంకితం చేసాడు? ఖండాంత పద్యాలలో, ఆత్మకథగా తన జీవుని వేదన, తన గోడు ఎందుకు వెళ్ళబోసుకున్నాడు! 'కవితా రూప తపస్సు జేసెదను శ్రీకంఠా!' అని ఎందుకు వాపోయాడు? దీనికి సమాధానం (నాకు తోచినవిధంగా) చెప్పబోయేముందు ఒక్క విషయం చెప్పాలి. విశ్వనాథవారే అన్నట్లు - ప్రత్యక్షర జనితమైన, అక్షర సంయోజన జనితమైన ఒక శక్తియందు కవియొక్క జీవుడు మేల్కనియుండవలయును - అంటే కవి ఒక ఋషి. ఒక తపశ్శాలి కావాలి. 'నానృషిః కురుతే కావ్యమ్' అందుకని అసామాన్యుడు, బ్రాహ్మీమయమూర్తి అయిన విశ్వనాథ భక్తి సులభమార్గం ఎన్నుకోక, అతి దుర్లభమైన జ్ఞానమార్గాన్నే ఎన్నుకున్నారని ధ్వని. జ్ఞానసులభుడైన పరమశివుణ్ణి, జ్ఞాన పరమార్థమైన సత్కవిత్వం ద్వారా వశం చేసుకొందామని ఆశ కాబోలు! లేదా పెంకిఘటం, మొండిఘటం. అపరవైదీకి అయిన విశ్వనాథ కిరాతార్జునీయంలో అర్జునునిలా శివునితో జ్ఞానాస్త్ర విద్యాప్రదర్శనలో కుస్తీపట్లు పట్టాడేమో మరి. అనన్య ప్రతిభా వ్యుత్పత్తులతో మహాకవియైన తాను, అపూర్వ కవితాశిల్ప పాశుపతాస్త్ర శక్తిలో శివునికేమీ తీసిపోనన్న ధీమానేమో మరి!

అందుకే 'అలనన్నయ్యకు లేదు. తిక్కనకు లేదా భాగ్య " మన్న ప్రజ్ఞాహంకార వైభవాన్ని ప్రదర్శించారు రామాయణ కల్పవృక్షంలో. ఒకరకంగా చూస్తే కవిసమ్రాట్లకు ఈ స్వాతిశయం, ఈ అహంభావం అలంకారప్రాయమేమో ననిపిస్తుంది. కవిసార్వభౌముడు శ్రీనాధునిలా ఈస్వోత్కర్ష రాజసలక్షణమేమో! కాని అపార ప్రతిభాశాలులైన మహాకవులు

కూడా సాత్త్వికులై, వినయ సంపన్నులైనవారూ ఉన్నారు. ప్రాచీనులలో తిక్కన, పోతన, ఆధునికులలో కీ.శే. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ ఈ కోవకు చెందినవారనవచ్చును. ఏదిఏమైనా విశ్వనాథవారు అపూర్వ కవితా తపశ్శాలి. ఆ తపస్సేమిటో, ఆ జీవుని వేదనేమిటో కొంత తెలుసుకొందాం.

కల్పవృక్ష మహాకావ్య నిర్మాణమే విశ్వనాథవారి తపో ఫలసిద్ధి. 'తండ్రి యాజ్ఞయును, జీవుని వేదన రెండు నేకమై, నా సకలోహ వైభవ సనాథ కథన్ రచించెదన్' అని ప్రతిజ్ఞ చేస్తాడు. బాలకాండలో కవిసమ్రాట్. అలాగే 'నేను మనస్సన్యాసిని' అని అంటాడింకొకచోట. ఇందులో ఒక చమత్కారము. విశ్వనాథవారి 'వేయి పడగలు' నవలలో నాయకుడు ధర్మారావు. ఒక మహాదర్శవ్యక్తి. ధర్మపథావలంబి, జ్ఞాని, మహాయోగి. అయినా అంతటివాడు కూడా రోగంతో, చావుబ్రతుకులలోనున్న భార్యను అరుంధతిని, ఒకానొక విషాద సమయంలో ఓదార్పబోయి, కామం పెల్లుబికి గాఢంగా కౌగిలించు కుంటాడు. ఎముకలగూడులా ఉన్న ఆమె ఆ బిగి కౌగిలికి మిక్కిలి బాధపడుతుంది. అప్పుడు తన తప్పు తెలిసికొని, ధర్మారావు పశ్చాత్తాపపడుతాడు. తన జ్ఞానమేమిటో, తన యోగితనం, తన మనస్సన్యాసం, తన వైరాగ్యం - వీటి పరిధు లెంతో గుర్తించి సిగ్గిలుతాడు. అంటే కేవలం మనస్సును మాత్రం స్వాధీనంలో ఉంచుకోవాలని అని అనుకోవడం అంత తేలిక కాదు. మనసు నావరించిన ఈ శరీరం, దాని ఇంద్రియ ప్రభావం మనం అధిగమించటం అతికష్టం. ఇది మానవ సహజ దౌర్బల్యం. అందుకే 'మనస్సన్యాసిని నేను' అని విశ్వనాథ వారన్నప్పుడు శరీరాన్ని పూర్తిగా అదుపుతెచ్చుకోలేక, కేవలం మనస్సు మాత్రమే వైరాగ్యాన్ని, యోగజ్ఞానస్థితిని పొంద గలదా? అంటే సందేహమే! కాని ఋషికల్పుడైన కవిసమ్రాట్టుల కది సాధ్యమేమో? అందుకే ఇంకొకచోట 'నిను మదిలోన నెంచుతటి నేనొక యోగిని' అని సమర్థించుకొంటారు విశ్వనాథ!

అలాగే ఋషిప్రోక్తమయిన, గంగాస్నాన పునీతత్వాన్ని విశ్వనాథవారు అహల్యాఖండంలో-

"భిస్సా ధాత్రివటీ పితాళ్ళకును గంభీరాంబు మూర్తీ! మమై న స్వయంహారిణీ! త్వత్కృపీట నిచయాంతర్లీన నైత్రింశికా ర్చిస్సుల్ మాకును రక్షగా నిలుపవే! శ్రీవారి నీ దివ్య పా ద స్సమ్మేదిత దేహయష్టులుగ సంధానింపవే! పావనీ!"-

అని దుష్కర ప్రాసంలో వర్ణిస్తాడు. దీనికి గల ప్రేరణను గురించి విశ్వనాథవారు ఇలా అన్నారు. ఒకసారి తాను చలి కాలంలో కాశిలో గంగాస్నానం చేసినా, ఆ అతిశీతల గంగా స్నానం ఆయనకెంతో హాయిని, ఎంతో అపూర్వానుభూతిని కలిగించిందట! తన ప్రాక్తన జన్మల పాపఫలమల్లా కడిగివేయ బడి, పులుకడిగిన ముత్యంలా ప్రకాశించినట్లు భావించాడట. ఆ పవిత్ర భావనే, ఆ అనుభూతే ఈ పద్య రచనకు ప్రేరణ అయింది అని అంటారు విశ్వనాథ. అందుకే ఎత్తుగడలో నడకలో, ఈ పద్యరచన గంభీరంగా భావస్ఫోరకంగా నడిచింది. పవిత్ర గంగాస్నాన పునీతత్వంలో గాఢ విశ్వాసమున్న కవి సమ్రాట్టులకు ఈ విచిత్రానుభూతి, ఈ ప్రేరణ కలగడంలో, ఆయన కవితా తపస్సుకు దోహదం గావటంలో సందేహమేమీ లేదు.

ఇక అసలు విషయానికి వస్తే, విశ్వనాథవారు రామాయణంలో పాత్రల ముఖతః చెప్పించిన తత్త్వవిచారణ, వేదాంతచర్చ, ధార్మిక బోధన ఒక ఎత్తు. కొండాంత, ఖండాంత పద్యాలలో తన మనసు విప్పి, ఎదదలో గూడుకట్టిన తన గోడు వెళ్ళబోసుకోవడం మరొక ఎత్తు. ఇదే నేను ప్రస్తుతం వివరింప దలచింది.

కల్యాణ ఖండాంతంలో (బాలకాండ) - 'నా యెద మీతో రాచెద, నద్దానికి ఫలము జెందించు శివా!' - అని వేడుకుంటాడు. పరమాత్మయులు, గాఢప్రేమికులు ఒకరి ఎదలకొకరు హత్తుకొని తాదాత్మ్యమై, పరవశులౌతారు. ఆధ్యాత్మిక ప్రేమ, జ్ఞానయోగం కవితా తపస్సుచే పెంపొందించుకొన్న విశ్వనాథ, జ్ఞాన సులభు డైన పరమశివుని ఎదకు గాఢాతిగాఢంగా హత్తుకొనిపోగలడు భక్త్యాతిశయంతో. కాని ఇందులో ఒక చమత్కారం. శివుడు బైరాగి. స్మశాన సంచారి. విశ్వనాథ సరేసరి. మనస్సన్యాసి. ఈ ఇద్దరు జోగులు గాఢంగా ఎదలు హత్తుకొని రాసుకొంటే, మిగిలేది బూది మాత్రమే! అంటే విభూతి. ఇది స్పర్శరూపరస గంధాదుల కతీతమైన తపోవిభూతి! అందుకేనేమో 'నా తపమెల్ల బండి యుద్వేల జనూ, రుజావితతి విచ్చేదున్నట్లు లనుగ్ర హింపవే!' అని ప్రార్థిస్తాడింకొకచోట. 'ఉపాసనా సమస్త సత్ప్రభోవ జీవనాకృతీ! తపద్విషచ్ఛటాశిరోధీ!' అని కూడా ప్రశంసిస్తాడు పరమశివుణ్ణి.

సాధారణంగా పరనింద, ఆత్మస్తుతి మానవ సహజం. కాని ఇది లౌకిక వ్యాపారంలో. అలౌకికంగా పర స్తుతి(శివ స్తుతి),

ఆత్మనింద భక్తుల కుపాధేయం. ఈ కోవలోనే కవితా తపస్వి విశ్వనాథ, మునిశాపఖండంలో

"తెలిసిన మూఢులంచు జగతిం కలరే కద! వారిలోన ను
జ్జ్వల తరుడీను!...."

అని ఆత్మనింద చేసుకుంటాడు. అలాగే నందమూరి శివుడు తన సొత్తైనట్లు పితృపితామహ్యమైనట్లు భావిస్తాడు.

"....నందమూరి శివలింగముగా గనిపింతు పోదువున్
బదపద, వెండికొండకునె వచ్చెద నీవిట నిల్వలేనిచో"

అని తొందరపడుతాడు.

'శ్రీ విశ్వనాథ కుల పా
రావార శశాంక శోభనాద్రి కృత ప్రతి
ష్ఠా విభవ, నందమూరు పు
రీ విలసచ్ఛ్వేతలింగ! శ్రీ విశ్వేశా!'

అని తండ్రి గొప్పను, తత్ప్రతిష్ఠిత శివలింగం తన స్వంతమైనట్లుగా చెప్పుకొంటాడు. అలాగే—

'కైలాసము నందమూరగుట మేలై, నీవు నీవై యుమేశా!
కైలాసము కాదో, నీ యెచటనున్నాచోటు విశ్వేశ్వరా!"

అని మరొకచోట స్వామిని వేడుకొంటాడు.

ఆయన దృష్టిలో కావ్యకల్పన "మత్కృత తపస్సు." మఱింకొకచోట వివశుడై—

"దశ శత సహస్ర వర్ష సంధాయకముగ
నీ కృపావృష్టిచే గీర్తి నిలుచుగాక!"

అని పరమేశుని కృప నర్థిస్తాడు. ఈ కవితా తపస్సులోనే భాగంగా—

"....ని
ర్లింగముగా, సమార్ద్ర విమలీకృత, సంతత భావ వాహినీ
సంగత చిత్తవృత్తి గిరిశా! యుపలక్షకమయ్యె! నీకు...."

అని అంటాడు.

శివలింగాన్ని కవితా తపోఫలంగా భావిస్తూ—

అశ్రమసాధ్యమైన సులభాకృతి ధ్యేయమయ్యెన లింగమున
ధీశ్రమలేని నే ననుమతించితి, నద్దియు వేదశేఖరా
ర్థాశ్రయభూతమైనది మహాప్రభు...." అని వేడుకొంటాడు.

జటాయుఖండంలో, విశ్వనాథ వ్యంగ్యంగా పరనింద, రావణునితో, (ఉమా, వైదేహిలపై) చేయిస్తాడు. రావణుడు సీతతో పరాచికంగా—

ఏ సన్యాసియొ పెండ్లియాడు, నిక వాడేయంచు గూర్చుందు రా
హా! సంసార పయోధి భద్రతరులౌ శంభోజనేత్రల్, హిమా
నీ సంసద్గిరి కూతు జూచితినిపై, నిన్ జూచితిన్, భర్తల
న్నా! సన్యాసులు, కొండలందుమయు, గాంతారంబు
లందీవునున్!'

ఇందు పరిహాసశీలి, శివభక్తాగ్రేసరుడైన రావణుడు. పరాచిక మాడేది ప్రత్యక్షంగా సీతామాతను. పరోక్షంగా ఉమాదేవిని. ఇది పరిహాసా ప్రశంస. ఇందు విశ్వనాథ సునిశిత వ్యంగ్య హాస్యం, నిందాస్తుతి లీలగా తొంగిచూస్తున్నాయి. కవితా తపస్ఫూర్తితో, ధ్వని సంపత్తితో.

శబరి ఖండంలో, పరమ శివుడంతటివాడు కూడా తన నొక కవితా తపస్విగా తీర్చిదిద్దటానికి ఎంత శ్రమపడాలో వివరించి, చింతిస్తాడు విశ్వనాథ. ఇలా—

అమృతోక్త్యంచితమున్ గథాకథన శిల్పానేక మార్గాభిరా
మము, నద్దాని నరణ్యకాండము ప్రభూ! మన్నింపవే! దైత్య రూ
పము పెంపొందిన వేల్పులన్ మనుచుటప్పా! యెట్టిదో, మ్లేచ్ఛభా
వము పెంపొందిన విప్రులన్ మనుచుటప్పా! యట్టిదే ధూర్జటీ!"

అసలు తన కవితా తపస్సుకు, ఇతర యోగాది సాధనాలు చేతకానితనమని, ఇలా వాపోతాడు విశ్వనాథ.

"కవితారూప తపస్సు చేసెదను శ్రీకంఠా! మనస్సంయమా
ది విధానంబుల జేతకాని తనమై తిన్ మూర్త సంవిత్కళా
యువతీభోగ! హరింపజేయుటకు మారోద్ధుం జుమీ! ఇంద్రియా
ది వికారంబులు భావనావిదుల వార్త్తిర్థంబు లేపారగన్"

ఇది, మార్గాంతరం సాధ్యం కాక, ఇతర విధానములు చేతకాని తనమై, కవితా తపస్సులో, కల్పవృక్ష మహాకావ్య నిర్మాణంలో లీనమైన కవిసమ్రాట్టుల ఆవేదనా పరమావధి.

తనది కవితాతపస్సు. అందులో భాగంగా కృతిభర్త పరమశివుడు కూడా సత్కవిగానే గోచరించి తాదాత్మ్యత చెందుతాడు విశ్వనాథ!

'ఉద్యత్ప్రదీపిత భావనా తరళ క్షిప్తోత్తమ! సత్కవీ!'

అని ముద్దుగా పిలుచుకొంటాడు. కృతిభర్తయైన మామగారిని, పరమశివుణ్ణి!

కిష్కింధాకాండ, నూపుర ఖండంలో ఇంకొక విలక్షణమైన తపోభావాన్ని అంతర్దృష్టిని ప్రదర్శిస్తాడు విశ్వనాథ.

"నా యెదనుంటి లోనవయినన్ వెనుచూడను లేదు కన్ను-సా
ధీయము, మంగళంబు, భయదృష్టి యెఱుంగదు కన్ను, మిన్ను వా
గై యెసలారు నీ శిరసునందలి తుంపురుగుంపు సోకి, తం
డ్రీ! యొక చెమ్మ యింత ఘటియింపవె! కంటికి వెన్క తట్టునేన్"

ఇక్కడ కంటికి, చక్షురింద్రియానికి, సాధారణంగా ముందు చూపు, అంటే భవిష్యద్దర్శనం - అని ధ్వని కూడా కావచ్చును. అదీ భౌతికమైన పరిధిలో ఒకే ఒకవైపు ప్రసరిస్తుంది. అది కూడా ఎదురుగా కనిపించే భౌతిక విషయాలపై. అంతేగాని దానికి వెనుకచూపు లేదు. ప్రాక్తన జన్మసంస్కార దర్శనం లేదని భావం. ఇట్టి మట్టి కంటికి, కేవలం ఒకవైపే తన దృక్కులను ప్రసరింపజేసే ఈ భౌతిక చక్షురింద్రియానికి, ముందు వెనుకలా సాగే, భూత భవిష్యద్వర్తమానాతీతమైన పారలౌకిక దృష్టి. అతీంద్రియ దర్శనం లభ్యంకాదు సాధారణంగా. కానీ కవితా తపోసిద్ధి గల కవిసమ్రాట్టులు గుండె లోతుల్లో ప్రతిష్ఠితుడైన లింగమూర్తిని దర్శింపగల అంతర్దృష్టిని ప్రసాదింపమని గంగాధరుని వేడుకుంటున్నాడు కృపాతరంగ శీకరాలతో (తుంపురుగుంపు) రక్షింపుమని.

అలాగే కిష్కింధాకాండ, నియమపాలన ఖండంలో, శివ లాస్య వైభవాన్ని కోరుకుంటాడు. శివతాండవంలో సర్వకళలూ, సర్వశాస్త్రాలూ భాసిస్తాయని విశ్వసిస్తూ—

"యుష్మ దనంతలాస్య విభవోజ్జ్వల కింకిణి రావమైహి కా
ముష్మిక భావసాంధ్య నవమోహనవేళ వినంగ నెంచెదన్"

తన కవితా తపస్సుచేత కల్పవృక్షం రసార్ణవమైందని పొంగిపోతూ—

"ఉద్దిలేని రసప్రవాహోల్బణమ్మ
సుద్దిలేని సమస్త భాసుర గుణమ్మ"—

అని తన కవితా వైభవాన్ని తానే చాటుకొంటాడు.

మునిజన మానసాలు భగవత్కేళీ విలాసాలయాలుగా పూర్వకవులు వర్ణించారు. అందులో తిక్కన ఒకడు. ఋషి కల్పుడు, కవితాతపస్వి అయిన విశ్వనాథ కూడా అలానే-

"శ్రీ మౌని రాజమానస
తామ రసోపరి తనూకృత శరత్కాలా!"

అని సమీకరణ ఖండంలో శివుణ్ణి సంబోధిస్తాడు.

ఇంకొకచోట "శివా మృదూహ సంగ్రహణక్రియా దోహలాత్మ" అని శివసతీ మధురోహాలను తనవిగా చేసుకొంటాడు. మరొకసారి నిస్పృహతో, వేసారి దాసోహమని, తన అశక్తతను వెలిబుచ్చుతాడు.

"ఐహిక వాంఛలెల్ల వెనుకాడెడినట్లు సదా ప్రయత్నమై
యూహ కొలంది జేసితి, ప్రభూ! భవదాకృతియైన వెల్గహో!
యూహ కసాధ్యమై నదయియున్నది, నీ దయలేని భావమై
సోఽహమటంచు, నీ నడిమి శూన్యమునందున విహ్వలించెదన్"

ఇది కవితా తపస్సునకూ అందని భావనార్తి.

ఆళ్వారుల దాసభక్తి తత్పరత, తన్మయత కూడా విశ్వనాథవారి కవితా తపస్సులో చోటు చేసుకొంది. అందుకే-

"....నీ
పదరాజీవపు దేనె నా పెదవి నబ్బా! తాకనీవే! శివా!"

అని వాపోతాడొకచోట. మరొకచోట భక్తిరస మాధుర్యాన్ని వాంఛిస్తూ, తన కవితా తపోసామగ్రితో పరమశివుణ్ణి ఇలా లోభ పెట్టాడు.

"....స్వామి! కోమల చమత్కృత్యద్వ నిర్మాణ సం
పద సూనోజ్జ్వల రమ్యభావ రససామగ్రీ సమగ్రంబు...."

ఇంత కవితా తపస్సు, ఇంత భక్తిపారవశ్యత, భావ తన్మయత ఉన్నా, 'అడగందే అమ్మైనా పెట్ట'దన్న సామెత గుర్తు చేసికొన్నట్లు, శివుణ్ణి అహం దెబ్బతిన్నట్లుగా అర్థిస్తాడు ఇలా—

"ఓ ప్రభు! నిన్ను నేనడుగుచుండినయట్టులు దోచుముక్తికై!"

ఆత్మార్పణం చేసుకుంటున్నా, ఆత్మాభిమానం దెబ్బ తినలేదన్నట్లు ప్రవర్తిస్తాడు. కవితా తపస్వి విశ్వనాథ మరొకచోట.

'కప్రము వోని నాయునికి, కమ్మని గాలివి నీవు వీవగా
క్షిప్రముగా హరించి చను, జెందగ, దప్పక నాకు నీకునున్'

ఇక్కడ ఒక చమత్కారం. కవి కప్పురం. శివుడు గాలి. ఆత్మార్పణం చేసుకుంటూ కవితా తపోదీప్తితో వెలిగే ఈ కప్పురంపై స్వామి వీస్తాడు. దాన్ని హరిస్తాడు. ఆది గాలిలో కలిసిపోతుంది. అంటే శివైక్యమౌతుంది. అంటే పరమశివుడు లయమూర్తియై తన్ను అంతమొందించినా, తుదకు తన్ను త్యాగం చేసుకోక తప్పలేదని ధ్వని ఎందుకంటే ఈ కవితా తపస్వికి, ఆ పరమశివునికి తనకూ ఉన్న అవినాభావ సంబంధం అలాంటిదే — అన్న ధీమా! సార్థకమైన ఉపమానంతో

మహార్థం ధ్వనించడం - వాల్మీకిలా - ప్రతిభామూర్తియైన కవి సమ్రాట్టులకే చెల్లింది.

ఇలాగే సుందరకాండలో హనుమంతుడు సీతామాతను కనుగొన్నాననే సంతోష పారవశ్యంలో ఇలా అంటాడు-

"కవి మహర్షి తపోగ్నిచే క్రాగి క్రాగి
సర్వ తేజః ఫలంబు రసంబు తుదకు
చూచినట్లుగ జూచితి క్షోణిజాత,
జారితార్థంబు జన్మకు సంఘటింప!"

ఇక్కడ కేవలం మహాకపి, హనుమ, ఒక్కడే కాదు చరితార్థుడై తరించింది. కవితా తపస్వి, విశ్వనాథ మహాకవి కూడా ధన్యుడైనాడని ధ్వని.

హనుమంతుని పాత్రలో మరొకసారి ఇలాగే లీనమై పోతాడు విశ్వనాథ కవితా తపస్స్ఫూర్తితో.

"నా కేవో తెగ వచ్చుచున్నవి, నిరంతంబైన యూహల్, సుశిక్షా కల్పోప్తముల్లైన యట్టివి, స్వభృతిం గైకొన్న చందంబునన్
నాకుం దంద్రివరంబె, నేర్చినది యైనన్‌లేద, యే కొంచెమున్
లోకం బిద్ది పరంపరామతి ధురాశ్లోకంబు ధారాస్థితిన్."

ఈ భావనా ప్రపంచమంతా, ఈ ఊహా మహోదధీ తరంగ కల్లోలమంతా ఈ అంతర్మథనమంతా ముమ్మూర్తులా కవిసమ్రాట్టులకే వర్తిస్తుంది. బహుశ్రుతి, అనన్య వైదుష్యం, అప్రతిమానమైన ప్రతిభ, లోకజ్ఞులు, లబ్ధప్రతిష్ఠులైన చెళ్ళపిళ్ళవారి గురుశుశ్రూష, తండ్రి ఆశీర్వచనం, పరంపరాగతమైన వాసనా సంస్కారం, కవితా తపస్సు అన్నీ పండి, విశ్వనాథ కవితాధునిలో పరాకాష్ఠ జెందాయి. రామాయణ కల్పవృక్షంగా, ఇంతకన్నా తపఃఫలం ఏం కావాలి మఱి?

అదే సుందరాకాండంలో-

'కన్నులలోన నీరు, గళగద్గదికంబును, రమ్యకావ్య భావోన్నయ నంబులం గని, మహోనిధి నా యెదనున్నయట్లుగా
నిన్ను దలంచి భ్రాంతిఁబెద, నిర్భర యోగ సమాధి నాథ మానున్నిను నిశ్చలాత్ములు కనుంగొనజాలని నిన్ను యోగులున్"

అని యోగి పుంగవుల కలవిగాని, అలౌకికానుభూతిని 'రమ్య కావ్యభావోన్నయనంబులతో' కనుగొంటాడీ కవితా తపస్వి.

ఒక్క పరమశివుడే గాదు. కావ్యకథానాయకుడు రాముని కూడా తన కవితా తపస్సులో ధ్యేయంగా నిల్పి-

'నా గుండియ రామధూర్జటులతో రాపిళ్ళుగా బెట్టినట్టిది'

అని హరిహరాభేదతత్త్వాన్ని తిక్కనలా చాటుతాడు విశ్వనాథ!

చివరగా యుద్ధకాండలో—

'లెంక నటంచు నిన్ను గమలించెడి పాపము చేసినాను, పర్యంక కృతాంబి కోరుయుగ! రక్తపుబిందువు రక్తబిందువున్
సంకువులొచు నీ పరమ శాంభవు నామము లూదకుండ, నీ
కింకరు నేటి కిట్టు లుడికింతువు, మోసములేని దైవమా!"

అని కవితా తపోసమరంలో తానోడినట్లు, క్షతగాత్రుడైనట్లు భోళాశంకరుని (మోసము లేని దైవమా) అర్థిస్తాడు ఆర్తితో.

ఇంకొకచోట దీనుడై తన కవితా తపస్సు ఫలింపజేయుమని శివుని భక్తి భావాతిధిగా భావిస్తూ—

ఈ తను హిత శోషపడి యెంతయు నిన్ను దలంచుటందు నిష్ఠాతముగా మెలంగెడిని, నా ప్రభు! నేను తొలంచనన్నచో
నీ తలపుల్ సమృద్ధముగ నిండెను నట్లుడు జేయు భక్తి భావాతిథి! రెడ్డి వచ్చె మొదలాడుము నా బొనరింపకే ప్రభూ!"

-పునర్జన్మ లేకుండగా వేడుకొంటాడు.

మంగళవాక్యంగా, కావ్యాంతంలో, ఆత్మనివేదన, కవితా తపోసంభార నైవేద్యం సమర్పించి, నీలగళుని, నీలమేఘతనుని ఇద్దర్నీ కీర్తిస్తాడు మనసారా. ఈ రెండు పద్యాలు విశ్వనాథవారి కవితా తపస్సులో శిఖరాయమానమైన, భక్తిభావసంభరితమైన ఆణిముత్యాలు.

"సద్యో నిర్గతమైన సర్వకవితా సంభారమున్ నీకు నైవేద్యంబిచ్చితి! రామచంద్ర! ప్రభువా! విశ్వాసంబూనవే!
యాద్యంబై చను జీవలక్షణము సంహారంబు గావింపవే!
హృద్యంబై చను నీదు తేజమును సారింపం గదే! గుండియల్
నీలగళా! రఘూత్తముడు నీవును నిద్దఱు కానియట్లుగా
నోలి భజించితిన్, మఱియు నున్న దినంబులు నట్లె చేసెదన్
వ్రాఁడు మేనుదాక నభవా! బ్రదుకైన వికార భావనా
జాలము తప్పకున్న, దుదిజన్మగ జేయుము దీని ధూర్జటి!"

-అని హరిహరా భేదమైన అద్వైతవథంలో భవబంధ రాహిత్యం కవితా తపోధ్యేయంగా వేడుకుంటాడు కవిసమ్రాట్ విశ్వనాథ. శ్రీమద్రామాయణ కల్పవృక్షం వారి కవితా తపస్సుకు పరాకాష్ఠ. ఆ తపఃఫలమే సాహితీజగత్తులో నిత్యనూతనంగా, శోభాయమానంగా ఎగిరే విశ్వనాథవారి కవితా కీర్తి పతాక.

## నీ నాదం!

రక్తతీవ్రత హెచ్చినపుడు
విప్లవం పుట్టదు.
ఉక్కులా పిడికిలి బిగించినపుడు
విప్లవం విజయవంతం కాదు.
పై లక్షణాలన్నీ —
రాత్రి పక్కలో, పెళ్ళాం కౌగిట్లో చల్లారిపోతాయ్....
మళ్ళీ ఉదయాన్నే గుంపు మధ్యలో చేరగానే
లాఠీదెబ్బకు తెల్ల పెంకుమీద ఎర్రచారిక కడుతుంది.
ఇంటికొచ్చి మళ్ళీ మూల ముడుక్కుంటావ్!
నీకంతగా సహాయం చెయ్యాలనుంటే
చేతిలో సమయానికి చిల్లిగవ్వ లేక అవస్థ పడుతున్న
పక్కింటి పాపారావ్ తల్లి జబ్బు గురించో
రోజూ నీ బిడ్డని కాన్వెంట్ కు రిక్షాలో లాక్కెళ్ళే
ఎదురింటి ఎల్లయ్య కూలిపోతున్న గుడిసె గురించో
నీ ఇంటికి మూడిళ్ళవతల మునిసిపాలిటీ చెత్తకుండీ దగ్గర
చలికి ముడుచుకుపోయే ముష్టివాడి గురించో
ఆరా తియ్....
అంతేకానీ విప్లవమంటూ వెర్రికేకలు వేస్తూ
బ్యానర్ల కోసం ఎంత గుడ్డ కొనాలో బేరీజు వేస్తూ
నినాదాలు రాసే ఆర్టిస్టు దగ్గర బార్గైన్ చేస్తూ
ఆ బ్యానర్లు పట్టుకుని ప్రదర్శన చేస్తున్నపుడు
రోడ్డుమధ్య చక్రాలబండిలో కదల్లేకపోతున్న అవిటివాణ్ణి
నిర్దాక్షిణ్యంగా అవతలకీడ్చేసి సాగిపోతున్న నువ్వు-
ఆ రోజుకు నువ్వెన్ని బస్సుల్ని తగలెట్టేవో నోట్ చేసుకుంటూ
ఎన్ని షాపుల్ని దగ్ధం చేసేవో గుర్తు చేసుకుంటూ
పూటకింత గంజి దొరకని ఎండు డొక్కల్ని ఉద్ధరిస్తున్నామని ఛాతీ విరుచుకుంటూ
'పార్టీల' పేరుతో మత్తుసీసాల సీల్ ఓపెన్ చేస్తూ
ముగువ కండల్ని పిండే నువ్వా ఉద్యమకారుడివి?
ఇంకోసారి విప్లవమంటూ కూస్తే నిన్నూ, నీలాంటి వాళ్ళనీ
పిచ్చికుక్కను కొట్టినట్లు కొడతాను.

## చలిచీమల చలనంలో...

పండ్లవూచల్ని లెక్కబెడుతున్న నాలుక
ఎలుగెత్తి కేకపెడుతుంది
ఎముకలగూడు పేలిపోయేటట్టు.
కాలిపోతున్న చితికింద
వేడెక్కిన మట్టిపెళ్ళ
మాడ్చేస్తుంది మదించిన అధికారాన్ని.
నిప్పు కూడా ఆరిపోయేముందు
గుప్పుమంటుంది.
పొదుగుల్ని పిండి పీల్చే వ్యవస్థ
పొలిమేరలు దాటి పారిపోతుంది.
మెడ పైకెత్తి మేడవైపు చూసే
ప్రతివాడికీ తెలుసు
దాని పునాది తన కాళ్ళదగ్గరే వుందని.
పుర్రె గుహలోంచి బైటపడ్డ వెలుగు
చీకటికి చిచ్చుపెడుతుంది.
పుట్టలోంచి బుట్టలో పడ్డంతమాత్రాన
బుసకొట్టక మానుతుందా?
విషంలేని నాగుపాము.
అరణ్యాన్ని కాల్చడానికి
అర్కమండల మెందుకూ?
అరంగుళం అగ్గిపుల్ల చాలు.
అనుభవం పోట్లుతిన్న కడ్డీ
విరిచేస్తుంది అధికారం నడ్డి.
ఇక్కడ రాస్తున్నవి
ఇసుకలో రాతలు కావు
రాతిపై చెక్కుతున్న రక్తాక్షరాలు.
ఒక్కో ఉలి దెబ్బకు మూలిగే శిల
అక్కడ ముక్కలవుతున్న అవినీతి తల.
కరిగే కొవ్వొత్తికి తెలుసు
కాల్చే అనలం తీవ్రత.
అవినీతి అజమాయిషీలో
మాటరాని చేపపిల్ల సైతం
గొంతెత్తి గర్జిస్తుంది
తిమింగలం తల తిరిగేటట్టు.
చలిచీమ కూడా
చెమటు పుట్టిస్తుంది
చెలరేగే చీకటి మృగాలకు.

శ్రీ మణిగోపాల్

శ్రీ సోమసుందర్

# కొమర్రాజు వారు వెలార్చిన విజ్ఞాన చంద్రికలు

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో, **18, జులై 1923** నాటి సంచికలో శ్రీ వే. వి. శర్మ ఒక సంస్మరణ వ్యాసం ప్రచురించారు. **ఆయన వేమూరి** విశ్వనాథశర్మగారే! ఆ వ్యాసం శీర్షిక **కీ॥శే॥** కొమర్రాజు **లక్ష్మణరావుపంతులు.**

ఆ వ్యాసంలో వారు లక్ష్మణరావు జీవిత విశేషాలు వివరించారు. భాషా సేవకునిగా ఆయన ఎప్పటికీ సజీవుడే అని స్తుతించారు. నలభై ఆరు సంవత్సరాలకే శివసాయుజ్యం పొందినా, ఆయన వెదజల్లిన విజ్ఞాన చంద్రికలు అజరామరంగా వర్థిల్లగలవని ఆశించారు. ఆయనకు ఇరవై యేట నుంచే భాషా సేవాభిరతి కలిగిందనీ, తెలుగువారికన్న మహారాష్ట్రులే ఈయనను ఎక్కువగా అభిమానించేవారనీ వే. వి. శర్మ వివరించారు. శివాజీ చరిత్ర, హిందూ మహాయుగం, మహమ్మదీయ మహాయుగంవంటి పెక్కు గ్రంథాలు రచించారనీ శ్రీ శర్మ ప్రస్తుతించారు. గ్రంథకర్తగా, సంపాదకునిగా, విమర్శకునిగా, పరిశోధకునిగా, భాషాశాస్త్రజ్ఞునిగా లక్ష్మణరావు స్థానం అద్వితీయమైనదంటూ సత్యం తెలిపి నివాళు లర్పించారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం ఒకటే చాలు – ఆయన బహుముఖీన ప్రజ్ఞను వేనోళ్ళ చాటడానికి! లక్ష్మణరావు ఏ కాలానికైనా మార్గదర్శకులే! అంటూ తెలిపిన వేమూరివారి మాటలు అక్షర సత్యాలే!

లక్ష్మణరావు బి.ఏ. చదువుతున్న రోజులలోనే వృద్ధవివాహ ప్రహసనం అనే ఒక చిన్న రచన చేశారు. దానికి ఆధారం ఒక యథార్థ సంఘటనే! భండారు మాధవరావుగారితో మాట్లాడడానికి తరచుగా ఒక వృద్ధుడు వచ్చేవాడు. ఆయన తన బాధలు చెప్పుకొనేవాడు. అతని సంభాషణే ఈ రచనకు ప్రేరణ కలిగించింది. మారిస్ కళాశాలలో బి.ఏ. చదువుతున్నపుడే మరాఠీలో ఒక భావగీతం రచించారు. దానికి ఇతివృత్తం పత్నీవియోగం.

అయ్యదేవర కాళేశ్వరరావు తన స్వీయచరిత్రలో కొమర్రాజు గురించి ఎన్నో సంగతులు రాసుకున్నారు. 1904లో మునగాల ఎస్టేటు పెద్ద దావాలు రెండిటినీ కృష్ణాజిల్లా జడ్జి కొట్టివేయగా, అవతలి పార్టీవారు మద్రాసు హైకోర్టులో అప్పీలు దాఖలు చేశారు. మునగాల రాజుగారి దివాన్‌గానున్న కొమర్రాజుగారు మునగాల రాజాగారి పక్షాన హైకోర్టులో లాయర్లచేత పని చేయించడానికి 1905 సంవత్సరారంభంలో సకుటుంబంగా వచ్చి చెన్నపట్నంలోని కచ్చాళేశ్వరాగ్రహారంలోకి, నాకు మూడు నాలుగిండ్ల అవతల కాపుర మేర్పరచుకొన్నారు.

విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని లక్ష్మణరావుగారు 1906లో ప్రారంభించారు. వారి మిత్రులు అయ్యదేవర, ఆచంట, గాడిచర్ల ప్రభృతులు సర్వసహాయకారులుగా ఉండేవారు. చిలుకూరి వీరభద్రరావు రచించిన ఆంధ్రుల చరిత్రలో ఎన్నో స్ఖాలిత్యాలను సవరించి, పరిష్కరించి కొమర్రాజు ప్రచురించారు. అలాగే కేతవరపు వెంకటశాస్త్రి రచించిన రాయచూరు యుద్ధములోను, దుగ్గిరాల రాఘవచంద్రయ్య రచించిన విజయనగర సామ్రాజ్యము, ఏ. వి. నరసింహంపంతులు రచించిన పాతాళభైరవిలోను, భోగరాజు నారాయణమూర్తిగారి విమలాదేవిలోనూ ఎన్నో పరిష్కారాలు కొమర్రాజుగారే స్వయంగా చేశారు. ఇవన్నీ చారిత్రాత్మక నవలలే కదా అని ఉదాసీనత వహించక-చారిత్రకాంశాలలోని దోషాలను సవరించారు.

చిలుకూరి వీరభద్రరావు రచించిన ఆంధ్రుల చరిత్ర ద్వితీయ భాగంలో వెలమ దొరలు బ్రహ్మనాయని సంఘ సంస్కరణోద్యమ ప్రేరణతో చాపకూడు తిన్నారన్న ప్రసక్తి వచ్చింది. దానిపై బొబ్బిలి, పిఠాపురంవంటి సంస్థానాధిపతులకు కోపం వచ్చింది. ఈ విషయానికి అభ్యంతరం తెలుపుతూ, తమ ఆగ్రహాన్ని కూడ వ్యక్తం చేశారు. అప్పటివరకూ విజ్ఞాన

చంద్రికామండలి **పోషకులుగా, ప్రాపకులుగా, అభిమానులుగా ఉన్న** పట్టికనుంచి తమ పేర్లు తొలగించవలసిందిగా పట్టు పట్టారు. "గ్రంథ రచయిత స్వాతంత్ర్యాన్ని గాని, వారి ఆదాయాలనుగాని, అభిప్రాయాలనుగాని నేను కించపరచజాలను. మీరు కోరుతున్నందున మీ పేర్లు తొలగించగలను" అని వారికి నిస్సంశయంగా తెలియచేశారు లక్ష్మణరావుగారు, వారంతటి ఆత్మగౌరవం కల వ్యక్తి!

ఐతే చిలుకూరివారి ఆంధ్రుల చరిత్ర ద్వితీయ భాగం అచ్చుకిచ్చేటపుడు ఆయన ఆసాంతం పరిశీలించారు కొన్ని స్ఖాలిత్యాలు కంటపడ్డాయి. ప్రథమభాగం హరి సర్వోత్తమరావు గారే చూసి అచ్చుకిచ్చారు. ఈ స్ఖాలిత్యాలను బయటపెడుతూ ఆయనే మారుపేరు — 'కె. రామానుజరావు'తో ధైర్యంగా చిలుకూరివారి చారిత్రక దోషాలను ఉటంకిస్తూ వ్యాసాలు ప్రచురించారు. చర్చ సాగింది. చర్చవల్ల సత్యం బయటపడాలనే ఆయన ధైర్యంగా ఈ పనికి పూనుకొన్నారు.

తిరుపతి దేవస్థాన ప్రాంగణంలో కాంశ్య విగ్రహాలు మూడున్నాయి. చిన్నాదేవి, తిరుమలదేవిలతో కలసిఉన్న శ్రీకృష్ణదేవరాయల విగ్రహంగా ప్రతీతి. కావ్యములలోని వర్ణనలనుబట్టి చూస్తే శ్రీకృష్ణదేవరాయలు అలా వుంటారన్న మాట లక్ష్మణరావు అంగీకరించలేకపోయారు! కావ్యవర్ణనల ననుసరించి రాయల ఆకార సౌందర్యాలను కల్పిస్తూ. తిరుపతి విగ్రహంలో వలె కోణాకారపు కిరీటం కాక తలపాగా కుళ్ళాయిలు సమకూరుస్తూ, ముత్యాల తురాయి అమరుస్తూ శ్రీ వి. సూర్యనారాయణ రావుచేత రాయల మూర్తిని చిత్రింపచేశారు. అదే నేటివరకూ రాయల ప్రతిరూపంగా గణుతికెక్కి సర్వాధారమవుతోంది!

మహారాష్ట్ర జ్ఞాకోశం సంపాదకులు శ్రీ కేట్కర్ లక్ష్మణరావుకు చిరకాలమిత్రులు. ఆ గ్రంథం అధ్యయనం చేయడం వల్లనూ, కేట్కర్‌గారితో చర్చిస్తూ ఉండటంవల్లనూ, లక్ష్మణరావుగారికి తెలుగులో విజ్ఞాన సర్వస్వం ప్రచురించాలన్న చిర వాంఛ మోసులెత్తింది. ఆ వాంఛితమే తెలుగుజాతికి మరో మహోపకారం చేసింది.

'చేసిన పనిని సంపూర్ణముగా చేయవలయునన్నదే నా దృష్టి!' అని వారు తరచు చెపుతూ, ఆ సంపూర్ణత్వం సాధించే వరకూ విశ్రమించేవారు కారు. ఆ లక్షణమే వారి అంతేవాసిగా శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికిన్నీ అబ్బింది. చారిత్రక పరిశోధనపట్ల సత్ఫలితాల నందించింది. ఈ విషయం వారే స్వయంగా తెలుపుతూ 1944లో తెలుగుతల్లి కొమర్రాజు ప్రత్యేకాంకంలో తెలుపుకున్నారు.

మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారం అనే మహత్తర గ్రంథాన్ని పరిష్కరించి విపులపీఠిక సంతరించారు లక్ష్మణరావు. ఆ గ్రంథాన్ని పిఠాపురం రాజావారి ఆంధ్ర సారస్వత పరిషత్‌వారు ముద్రించారు. ఈ గ్రంథ పీఠికలో ఎన్నెన్ని చరిత్రకాంశాలు పొందుపరచబడ్డవో! ఉదాహరణకు ఒక్క అంశాన్ని ఉటంకించుకుందాము. "చిత్రభారతంలో మానభూనాధు చిత్తారుఖాను" అని వున్న ప్రయోగం కందుకూరి వీరేశలింగంగారికి అంతుపట్టలేదు. వారీ గ్రంథాన్ని పరిష్కరించి అచ్చువేస్తున్న సందర్భంలో ఈ చిత్తాపఖాను ఒక సమస్యగా నిలచింది. అప్పుడాయన సులువుగా "చిత్తాబ్జఖాను"గా సంస్కరించి బయటపడ్డారు. ముప్పయి సంవత్సరాలు పెనుగులాడితే తప్ప-చిత్తాపఖాను అసలు రహస్యం బయటపడలేదు.

మానభూపాలుని కుమారుడు చిత్రాపఖాను అనే ముస్లిం భూపాలు డొకడుండేవాడు. అంతటి మత సామరస్యం గల చక్రవర్తు లరుదు. అతడు స్వయంగా హిందూ దేవాలయాలు నిర్మించాడు. విరివిగా దానాలు చేశాడు. ఈ విషయాలు లక్ష్మణరావు వెలువరించారు. ఆయన వరంగల్ మండలానికి చెందిన ఒక శాసనం కనుగొన్నారు. పాంచలీశ్వర దేవాలయానికీ చిత్తాపఖాను భూరి దానాలెన్నో చేసిన సంగతి ఆ శాసనంలో వుంది. మరామ్మత్తులు చేయించాడు. ఈ శాసనం శాలివాహన శకం 1425 నాటిది. అంటే క్రీ॥శ॥ 1503 నాటిదన్న మాట. 1902 సం॥నాటి ఎపిగ్రాఫికల్ రిపోర్టులలో కూడ ఈ శాసన పాఠం వుంది. లోకల్ రికార్డ్సు తాలూకు 45వ వాల్యూములోనూ ఈ శాసనం వుంది.

ఈ పరిశోధనలో తనకు-ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక కార్యాలయ మేనేజరు శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారికీ, సంపాదకత్వంలో సాయపడిన కర్రి సాంబమూర్తిగారికీ లక్ష్మణరావు కృతజ్ఞత లందించారు.

కావలి వెంకట బొర్రయ్య గురించి లక్ష్మణరావు ఎంతో ఉదాత్తగౌరవం వెల్లడించారు. 1922లో జరిగిన శ్రీ ఆంధ్ర పరిశోధక మహామండలి పంచమ వార్షికోత్సవ అధ్యక్షోపన్యాసంలో కొమర్రాజువారిలా స్మరించారు - "దక్షిణ హిందూదేశమందు పుట్టిన మొదటి ఎపిగ్రఫిస్టు శ్రీ బొర్రయ్యగారవి పేర్కొనాలి. ఉత్తరదేశమందలి శాసనములు చదువుటకు ప్రథమ ప్రయత్నము చేసిన ప్రిన్‌సెప్ దొర కెట్టి గౌరవము,

ఖ్యాతీ ఉన్నవో ఈ పండితునకును అట్టి గౌరవమే ఉండి తీర వలయును. ఈతని మరణమునకు మిక్కిలి దుఃఖించి మెకంజీదొర, ఈతనిని దహనము చేసినచోట ఒక శిలాశాసనము చెక్కించెను. అది ఎక్కడ ఉన్నదో కనుగొనుటకు నేను చెన్నపట్టణంలోని కొన్ని స్మశానాలు తిరిగితిని. కాని నాకు కానరాలేదు. 1829లో కావలి వెంకట బొర్రయ్య తమ్ముడు వెంకట రామస్వామి దక్కను కవుల చరిత్ర ప్రకటించునాటికి ఈ స్మారక శాసన మున్నట్లు, ఆయన తన అన్న జీవితచరిత్ర వివరిస్తూ ప్రస్తావించెను!" అంటూ ఆయన ఉగ్గడించారు.

కొమర్రాజు లక్ష్మణరావుగారు మహామేధావి. నిశిత మనస్కులు. సంస్కరణాభిలాషి. ఏ విషయాన్నీ స్వయంగా పరిశీలించకుండా ఆయన విశ్వసించలేదు. హిందూమత సంబంధమైన వర్ణవ్యవస్థను, ఆచార అనాచారాలనూ, బ్రాహ్మణ చాదస్తాలనూ ఆయన తీవ్రంగా ప్రశ్నించారు. ఋగ్వేదంలో దొరికిన ఆధారాలతోనూ, రామాయణాది పురాణాలద్వారా లభించిన ఆచారాలనూ లక్ష్మణరావు పునర్విచారణ సలిపారు. రామాయణ అయోధ్యకాండ 78వ సర్గలోని 14 నుంచి 19 వరకూ గల శ్లోకాలద్వారా మహిళలు కూడా అగ్నికార్యమూ, సంధ్యావందనమూ నిర్వర్తించే అధికారం పూర్వం ఉండేదన్న సత్యాన్ని స్థాపించారు. అదే విషయం సుందరకాండ 14-49 శ్లోకాలలో సైతం పునఃవర్ణితమైందని ఆయన వక్కాణించారు. మహాభారతంద్వారా 'గొడుగు చెప్పులు మహిళల ఉపయోగార్థమే మొదటిసారీ దేశంలో సృష్టించబడినట్లుగా ఆయన ధ్రువపరిచారు.

ఆయనే మొదటిసారి సత్యకామ జాబాలి కథను బైట పెట్టారు విమర్శాత్మకంగా వ్యాఖ్యానించారు. కులగోత్రాలు తెలియని సత్యకామ జాబాలికి తండ్రి ఎవరో తెలియదు. అతని తల్లి స్వైరిణియో, అవివాహిత మాతయో వివరణ దొరకదు. కాని చదువూ సంస్కారంవల్ల బ్రాహ్మణత్వానికి అర్హుడైనాడు అని వివరించారు. రజస్వలానంతరం మూడు సంవత్సరాలకు గాని ఆడపిల్లకు పెళ్ళి చేయరాదని వసిష్ఠులవారి నిబంధన. క్రీ॥పూ॥ 1000-500 కాలం వరకూ ఆడపిల్లలకు వయస్సు వచ్చిన తర్వాతనే వివాహాలు జరిగేవి. బాల్యవివాహాలు ఎప్పుడో తర్వాత వచ్చిఉంటాయని లక్ష్మణరావుగారు వక్కాణించారు.

బ్రాహ్మణుడు సర్వాధికారిగా, సర్వాధ్యక్షుడిగా సమాజంపై అధికారం సంక్రమింపచేసుకొన్నాకనే ఎన్నో అనర్థాలు సంభవించాయి. ఆ పెత్తందారీతనానికి అనుకూలంగానే ధర్మశాస్త్రాలు రూపొందాయి. కులవిభజనలూ ఏర్పాటయ్యాయి అని లక్ష్మణరావు నిష్కర్షగా చాటారు. అంతేకాదు. ఆయన యింకా యిలా వివరించారు. 'సరిగ్గా అదేకాలంలోనే రోమ్‌లో కూడ తరతమ వ్యవస్థ చెలామణీకి చేరుకుంది. మన దేశంలో మరికొంత కాలం గడిచాక అంటరానివారన్న వేర్పాటు కూడా ఒకటి పుట్టుకు వచ్చింది!" అంటూ సత్యాన్ని నిరాఘాటంగా చాటారు.

"తరువాత క్రమంగా - పాంచరాత్రులు, కాపాలికులు, భైరవీ పూజారులు, శాక్తేయులు, పాశుపతులు - వంటి సహస్ర క్షుద్రమత సంప్రదాయాలీ దేశంలోనికి చొరబడ్డాయి." అని వారు విశదీకరించారు. భవభూతి మహాకవి రచించిన మాలతీ మాధవం అనే నాటకంలో కాపాలికుల భయంకర ఆచార వ్యవహారాలు వర్ణితమైన తీరు యిందుకు ప్రాతిపదికగా స్వీకరించవచ్చుననీ ఆయన వక్కాణించారు. "ఇట్టి క్షుద్రమతాలన్నిటికీ ఆది శంకరాచార్య వ్యతిరేకంగా నిలిచారు. నిర్మూలించ యత్నించారు" అంటూ చారిత్రకాధారాలను వివరించారు.

"బాల్యవివాహాల వల్లనే మన దేశంలో దుర్బలులు పుట్టనారంభించారు." అంటూ ఆనాటి సంఘదురాచారాన్ని దుయ్యబట్టారాయన. ఆయుర్వేదం బాల్యవివాహాలను నిషేధించడం ఉటంకించారు!

"రాజులు స్వార్థపరులై తమలోతాము కలహించుకుంటూ విదేశీయుల దండయాత్ర సందర్భంలో దేశద్రోహానికే పూనుకొన్నారు" అని దేశానికి జరిగిన కీడును వివరించారు.

కొమర్రాజువారు బహుముఖ ప్రజ్ఞాశాలి. సంస్కృతీ పరుడు ప్రగతివాది. హేతువాద పురస్సరంగా అత్యంతాధునిక దృక్పథంతో భారతీయ సంస్కృతిని పునర్నిర్మించాలని ఆవేశితుడయ్యారు. పూజా పునస్కారాలనుగాని, కర్మకాండలను కాని మత కార్యకలాపాలనుగాని ఆయన ఎన్నడూ ఆమోదించలేదు. బుద్ధి ఎరిగిన తర్వాత పాల్గొననూ లేదు. కన్యాదాత స్థానం వహించి పెళ్లిపీటలపై కూర్చొని, ఎవరికైనా పెళ్లి జరిపించడానికి ఎంతో ఉత్సాహం చూపేవారు. ఏ అనాథ బాలికకో, ఏ వితంతువుకో పెళ్ళి జరిపించడానికి సర్వదా సంసిద్ధమై ఉండేవారు

తన మనుమరాలు అచ్చమాంబకు యుక్తవయస్సు రాకుండానే సంప్రదాయానుసారం వివాహం జరిపించాలని లక్ష్మణరావుగారి తల్లి గంగమ్మగారు పంతుపట్టు పట్టింది. ఆయన వినిపించుకోలేదు. ఆమెను పెద్ద చదువులు చదివించారు. ఈ విషయాన్ని గంగమ్మగారు సహించలేకపోయింది. కొడుకుతో సమాధానమూ పడలేకపోయింది. లక్ష్మణరావు తాను జరిపే విషయాలన్నీ శాస్త్ర సమ్మతాలేనని నిరూపించినా ఆచారబద్ధురాలైన ఆమె అంగీకరించలేదు. ఆయన కుమార్తెను పై చదువులకోసం విదేశాలకు పంపగా గంగమ్మగారి కోపాగ్ని మరీ ప్రజ్వలించింది. ఇక తానాతని యింట ఉండలేనని నిశ్చయించుకుంది. ఒంటరిగా కాశీకి వెళ్ళిపోయింది. తనకన్న ముందుగా కుమారుడు చనిపోయాడన్న వార్త అందినా ఆమె తిరిగి రానేలేదు! అంతటి సంస్కరణశాలి లక్ష్మణరావు.

పురుషు లనుభవిస్తున్న సర్వహక్కులూ సమానంగా స్త్రీలు కూడా అనుభవించాలని ఆయన ఎన్నో సభలలో ఉపన్యాసా

లిచ్చారు. ఎన్నో రచనలు చేశారు. కులవ్యవస్థలోని అనౌచిత్యాలను కూకటివ్రేళ్ళతో త్రెంపివేయాలని ఉద్బోధించేవారు. చెప్పినవన్నీ చేసిచూపేవారు!

తన అభిప్రాయాలను వ్యతిరేకించేవారిపట్ల ఎంతో సహనభావంతో, ఎంతో మర్యాదతో సౌమ్యంగా వ్యవహరించేవారు లక్ష్మణరావుగారు. తనపై కోపించి కాశీకి పోయిన తల్లిగారికి ప్రతినెలా తప్పకుండా డబ్బు పంపుతూ, ఆమెకే కష్టమూ కలగకుండా చూసేవారు. ఆమె హనుమాన్ ఘాట్‌లో నివసిస్తూ, వేదాంతమూ, సంస్కృతమూ బోధిస్తూ, 'గంగామాయి'గా గొప్ప పేరు తెచ్చుకున్నారు.

మహారాష్ట్రులూ తెలుగువారూ అన్నదమ్ములని ఒక వ్యాసంలో నిరూపించారాయన. ఈ రెండు జాతుల ఆచార వ్యవహారాలలోనూ రసభావాలలోనూ ఎన్నో పోలికలున్నాయని నిరూపించారు. 'నందినాగం' అనే లిపిగురించి లక్ష్మణరావు ఎంతో లోతుగా పరిశోధనలు జరిపారు. 'అహదహనకర శాస'నాన్ని పరిశోధించి ఎన్నో వివరాలు సేకరించారు. కాని ఆ అంశాలను ఎందువల్లనో ప్రచురించలేదు. కాని శాసనలిపిని గురించి మాత్రం ఒక వ్యాసం రాశారు.

తూర్పు గోదావరిజిల్లా పిఠాపురం ప్రక్కనేఉన్న చిత్రాడ గ్రామంలో చెలికాని లచ్చారావుగారనే మహాపండితులు ప్రతి వత్సరం చారిత్రక పరిశోధకుల మహాసభ జరుపుతూ వుండేవారు. వారొక సంవత్సరం ఏర్పాటు చేసిన సభకు లక్ష్మణరావుగారు విచ్చేసి, ఈ శాసనపాఠాన్ని చదివి వివరించారు. పండితులందరినీ ఆ శాసనాన్ని పరిశీలించవలసిందిగా అభ్యర్థించారు. తదుపరి వేటూరి ప్రభాకరశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మగార్లు పరిశీలించి యిరువురూ వేరు వేరు నిర్ణయాలు ప్రకటించారు. దానిపై వాద ప్రతివాదాలు జరిగాయి. కాని లక్ష్మణరావు తుదినిర్ణయంతో త్వరలోనే సమాధానపడ్డారు.

చిలుకూరి వీరభద్రరావుగారు సంపాదించిన శాసన సంపుటాలను నేలటూరి వేంకట రమణయ్యగారు సంప్రదించారు. లక్ష్మణరావుగారి సలహావల్లనే నేలటూరివారీ పనికి పూనుకున్నారు. దాన శాసనాలు, పత్రాలు, ప్రభుత్వ నివేదికలు, మెకంజీ సంకలితం చేసిన స్థానిక వృత్తాంతాలు నేలటూరివారు సమగ్రంగా పరిశీలించారు.

ఏ విషయంగురించైనా తెలుగులో క్షుణ్ణంగా రాయగలమనే ధైర్యాన్ని తెలుగు మేధావులకు కలిగించిన ప్రథమవ్యక్తి లక్ష్మణరావుగారే! ఒక ప్రముఖ జమీందారీ ఆస్థానానికి దివాన్‌గా గౌరవభాజను లవుతున్నా ఆయన ఎన్నడూ ఆడంబరాలకు పోలేదు. అతి సామాన్యంగా, నిరాడంబరంగా గడిపేవారాయన!

లక్ష్మణరావుగారి మేధాహృదయ సంస్కారాన్ని పెంపొందించడంలో వారి అక్కా బావల పాత్ర అతిస్మరణీయమైనది. ముఖ్యంగా వారి అక్కగారు - శ్రీమతి భండారు అచ్చమాంబ స్త్రీ స్వాతంత్ర్యం గురించీ, స్త్రీ జాతిలో విద్యాబుద్ధులు అలవడ్డం గురించీ ఎంతో సేవ చేసేవారట. ఆమెగురించి ఎంతో ఉదాత్తంగా అయ్యదేవర కాళేశ్వరరావు తమ స్వీయచరిత్రలో వర్ణించారు. బిలాస్‌పూర్‌లో తీవ్రమైన ప్లేగు వ్యాపించిన రోజులవి. ఆ వ్యాధిగ్రస్తులకు సేవ చేయడంలో అచ్చమాంబగారు తీవ్రంగా నిమగ్నమయ్యారు. ఒక అనాథబాలుని కంటికి రెప్పలా కాపాడనారంభించారు. అప్పుడు క్రైస్తవ మిషనరీవారు వచ్చి ఆ బాలుని తీసుకుపోయి తాము పాలన పోషణ బాధ్యత తీసుకోగలమని కోరారు. ఆమె అంగీకరించక ఆ బాలుని మరింత సన్నిహితంగా చేర్చుకొని సేవ చేయనారంభించారామె! ఆఖరికామెకే ప్లేగువ్యాధి సోకింది. తీవ్రతరంగా వేధించనారంభించింది. తానింక జీవించజాలనని ఆమె గ్రహించారు. వెంటనే తన మరణానంతరం ఆ అనాథ బాలునకు తన ఆస్తిలో కొంత ఆస్తి కేటాయించి విల్లు రాసి మరీ ప్రాణాలు వదిలారామె! అక్కగారి పట్టుదలా, సేవాధర్మమూ లక్ష్మణరావుగారు పుణికిపుచ్చుకున్నారు.

ఆయన ఏర్పరచిన ఆదర్శాలను వారి సన్నిహిత మిత్రులైన హరిసర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతులు జీవితాంతమూ అనుష్ఠించగలిగారంటే వారి ప్రభావం సమకాలికులపై ఎంతగా ఉండేదో తెలుసుకోగలం.

ఏమైతేనేం - ఆంధ్రజాతి దురదృష్టంవల్ల లక్ష్మణరాయ మహోదయులు-నడివయస్సుకైనా చేరకముందే పరమపదించారు. 1923 సం॥రంలో జులై 15వ తేదీ రాత్రి 2గం॥కు లక్ష్మణరావు శాశ్వత విశ్రాంతి పొందారు. ఆయన చనిపోయిన తొమ్మిదేళ్ళకు విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుగారు ఆయన ప్రారంభించిన విజ్ఞాన సర్వస్వం పూర్తి చేయడానికీ, ఆమూలాగ్రం ప్రచురించడానికీ పూనుకున్నారు.

కానూరి వీరభద్రేశ్వరరావుగారివద్ద లక్ష్మణరావుగారు బీజగణితం గురించి వ్రాసిన గ్రంధం తాలూకు వ్రాతప్రతి ఉండిపోయిందట! అందులో కొట్టివేతలుగాని, హంసపాదులుగాని లేకుండా ముత్యాలకోవవంటి హస్తాక్షరితో ఆసాంతం వ్రాసివుందని చూసినవారు చెబుతున్నారు. ఆ ప్రతి ఫొటోస్టాట్ కాపీలు ప్రచురించడానికి ఎవరైనా పూనుకుంటే గొప్ప మేలు. దినపత్రికలవారెవరికైనా ఆ సద్బుద్ధి కలుగుతుందేమో చూదాం!

లక్ష్మణరావుగారు రచించిన వ్యాసాల సమగ్ర సంపుటాలను యితర గ్రంథాలను ప్రచురించాలని సంకల్పించి, వారి ఏకైక కుమారుడు శ్రీ వినాయకరావు ముద్రణాలయాదులు సమకూర్చుకున్నారు. కాని ఆ పని వారు నెరవేర్చలేకపోయారు. పాపం వినాయకరావుగారికి కాలమూ కలసిరాలేదు.

1925 మార్చి ప్రబుద్ధాంధ్రలో లక్ష్మణరావుగారికి నివాళులర్పిస్తూ - కథక చక్రవర్తి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, యిలా రాశారు. "లక్ష్మణరావుగారు చనిపోయినారన్న ఒక విజ్ఞాన

సాగరము యింకిపోయినదన్న మాట! నభూతో నభవిష్యతి అన్న మూర్తిమంతనం వారిది. ప్రపంచంలోనే అపురూప వ్యక్తిత్వం వారిది. సృష్టిలో అపూర్వమైన అవతారం వారిది. ఉండిన్నీ లేనిదై పోయింది మనకి! మన దురదృష్టం!! ఆంధ్రజాతి దౌర్భాగ్యం యిది!" అన్నారు శాస్త్రిగారు.

"తెలంగాణాలో గొప్ప చైతన్యకారకులాయనే! హైదరాబాద్‌లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము, హనుమకొండలో రాజనరేంద్ర భాషానిలయము స్థాపించినది వారే!" అంటూ దేవులపల్లి రామానుజరావు జోహారు లర్పించారు.

"కొమర్రాజు లక్ష్మణరావుగారి బుద్ధి ఎంత నిశితమో, వారి విజ్ఞానమంత విశాలం. ఆయనకు తెలియరాని విషయమంటూ లేదు. వేదాల దగ్గర్నుంచి చీట్లాటదాకా సమస్త సంగతులు ఆయనకు జ్ఞాతాలే! అందులోనూ ఎట్లా? ఆమూలాగ్రంగా!.... విషయచర్చలో ఆయనతో సమానులు చాలామంది ఉండరు. కారణం లేకుండా మాట్లాడేవారు కాదు. రాసేవాడూ కాదు. ఇప్పటి పరిశోధకులు చాలామందివలె ఆయన గప్పాలెప్పుడూ కొట్టేవాడు కాదు!" అంటూ ఆచార్య కురుగంటి సీతారామ భట్టారకులు శ్లాఘించారు!

గడచిన అరవై ఆరేళ్ళలోనూ శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి కీర్తి ప్రవర్ధితమవుతూనే వుంది తప్ప తరగలేదు! వారు తెలుగుజాతికి వెలుగు కిరీటం!

# పంచేది అమృతం కాదు

## శ్రీ అడిగోపుల వెంకటరత్నమ్

వాడు పంచుతున్నది
అమృతం కాదు
హాలాహలం అన్నందుకు
వాడు నాకు మరణం
తప్పదంటున్నాడు!
పుట్టకముందే
చనిపోయినవాడ్ని
నాకు మరణమెక్కడిది?
వాడి ఆస్తి నన్ను బంధించను
వాడి మాట నన్ను శాసించను
పిండకుండానే
వాడింటు పాడికుండ
అడ పొరుగిళ్ళ పాలకుండ
అద్దం వాడిదే
బింబం వాడిదే
బింబం నాణ్యతపై
తీర్పు వాడిదే
వాడిది స్వరాజ్యంలో
సామ్రాజ్యం
వాడు సామ్రాజ్యానికి
సామ్రాట్టు
మూలవిరాట్టు
అరచేతుల్ని గుండెకు కప్పుకొని
వాడు హాయిగా నిద్రిస్తున్నాడు

అరచేతులు గుండెను
అదుకొని రక్షించుకోలేవు
ఆ సంగతి అరచేతులకు తెలుసు
తెలియంది సామ్రాట్టుకే
తెలియజెప్పాల్సింది సామాన్యుడే!

డా॥ పి. శరావతి

# బాదమ్మ

విశ్వనాథవారి చారిత్రక నవల బద్దన్న సేనానిలోనిదీ పాత్ర. ఈ నవలా రచనకు నేపథ్యంగా ఆనాడు ఆంధ్రదేశాన్ని పాలించిన చాళుక్య చోళ రాజుల కాలం ప్రధానంగా తీసుకోబడ్డది. విక్రమ చోళుడు చక్రవర్తిగా వున్న సమయంలో, ఆంధ్ర ప్రాంతాన్ని గొంక రాజు పరిపాలిస్తున్న కాలంలో పశ్చిమ చాళుక్యులాంధ్ర ప్రాంతాన్ని ఆక్రమించుకోవడం, మరలా ఆంధ్రులంతా ఒక్కటై, వారినోడించి స్వతంత్రులవటం కథా వస్తువు,

నవలలో రాజకీయ మత సంబంధమైన ఆనాటి పరిస్థితులు ప్రధానమైన అంశాలుగా గ్రహింపబడి రచయిత ప్రతిపాదింపదలచుకున్న అంశాలకు దోహదాన్నిచ్చాయి. ఈ వాతావరణ నేపథ్యంలో కొన్ని చారిత్రక పాత్రలతోపాటు, కవి కల్పనా జనితపాత్రలు కూడ ఈ నవలలో చోటుచేసుకున్నాయి. అలాంటి పాత్రలలో ఆంధ్ర పౌరుషమంతా మూర్తి కట్టిన వ్యక్తిగా తీర్చిదిద్దబడ్డ బద్దన్న, ఇతని సహచరిగా రూపు దిద్దుకున్న బాదమ్మ పాత్రలు ప్రధానమైనట్టివి.

నవలలో మరొక ప్రధానాంశం పంచమ వర్ణస్థులకు ప్రాధాన్యమివ్వబడడం. ఆనాటి రాజులైన వేంగి చాళుక్యులు, చతుర్థ కులజులైన శూద్రులని, క్షత్రియవంశ రాజులు కాదని, పశ్చిమ చాళుక్యులచేత వారు తమ రాజ్యాన్ని కోల్పోగా, మరలా రాజ్య పునర్వ్యవస్థీకరణ ఎలా జరిగిందో చెప్పటంలో రచయిత పంచమ వర్ణస్థులకు ప్రాముఖ్యాన్నిచ్చి రచించడంలోని అభిప్రాయంగా ఊహించవచ్చు. అంతేకాక హరిజనోద్ధరణ (గాంధీగారి ప్రభావంవల్ల) అన్న దృష్టి కూడ రచయితలో వుండివుండాలి. అందుకే ఈ అంశానికి బలం చేకూర్చటానికి ఆ కాలంలో ఖడ్గ విద్యంతా పంచముల్లోనే వున్నదని చెప్పబడింది నవలలో.

గోశాల అనే వూళ్లో పంచముడైన బద్దన్న ఆంధ్రుల పట్ల వీరశైవులు ప్రకటించే నిరసన భావాన్ని సహించక తమ నగర సరిహద్దులు దాటి మతోన్మాదంతో ప్రవేశించిన కరవాల భైరవుని సంహరించిన యోధుడు. ఈ విజయోత్సాహంచేత అతనిలో ఆంధ్ర రాజ్య స్వాతంత్ర్య కాంక్ష ప్రబలి, సర్వాంధ్ర ప్రజానీకంలో స్వాతంత్ర్య వాంఛను రేకెత్తించి, తదనుగుణంగా యితరుల కెట్టి అనుమానం కలగని రీతిలో వ్యవహారాన్ని నడిపి, చివరకు విజయాన్ని సాధిస్తాడు.

ఈ కార్యదీక్షలో బద్దన్నకు నన్నయ్య, నాగన్న, పాపయ్యల సహాయం లభిస్తుంది. ఆంధ్రరాజులకు, సామంతులకు, తన ప్రణాళికను తెలపటానికి వీలులేని పరిస్థితుల్లో గొంకరాజు వద్దకు నన్నయ్యను, అతని సామంతులైన నంబయ్య మందయ్యల వద్దకు పాపయ్య, నాగన్నలను పంపి, ఈ సర్వకార్యానికి ఆధిపత్యం వహించి సేనను నడపమని చేబ్రోలును పాలించే నంబయ్యను అర్థించటానికి వెళ్ళిన బద్దన్నకు అతని తిరస్కారం మరింత పట్టుదలను పెంచటంతో వేంగి ప్రాంత సామంతుడైన త్రిపురాంతకు నాశ్రయించి, నంబయ్యను మించిన యుద్ధవీరునిగా అతన్ని తయారు చేస్తాడు. బద్దన్న ప్రణాళికను, ఆశయాన్ని అర్థం చేసుకున్న త్రిపురాంతకుడు ఆంధ్ర సైన్యాన్ని రహస్యంగా అన్ని ప్రాంతాల నుండి ఒక చోటికి చేర్చటం సాధ్యం కాదని యోచించి పశ్చిమ చాళుక్యుల ప్రతినిధితో వారికి సహాయ పడుతున్నట్లు నటించి రహస్యంగా తిరుగుబాటు జరగబోతున్నది కనుక సైన్య సన్నాహాలు చేసుకోవటాని కనుమతి సంపాదించి వారికే మాత్రం అనుమానం కలగని రీతిలో బాహాటంగా సేనల నన్నిటిని ఒకచోట చేరుస్తాడు. త్రిపురాంతకునితో బద్దన్న చేతులు కలపటం నంబయ్యకు మరింత కోపహేతు వౌతుంది. ఈ ప్రయత్నంతో పాటు బద్దన్న కొప్పాక అనే ఊర్లో తమ వర్ణస్థులందరినీ "హనుమదళ" మన్న పేరుతో సేనగా తయారుచేసి యుద్ధ సమయంలో కీలకమైన స్థానంలో వుంచి యుద్ధం చేయిస్తాడు. ఆంధ్రులు స్వతంత్రులవుతారు. ఇది బాహ్య కథ.

నవలలో బద్దన్న ఖడ్గవిద్యా గురువు బాదమ్మ అనే పంచమ కుల స్త్రీ. తిప్పన్న అనే సామాన్యుని భార్య. తిప్పన్న ఆమెను అనుమానించి ఇంటి నుండి వెళ్ళగొట్టగా ఆమె బద్దన్న నాశ్రయించి అతనితో వుండిపోతుంది. నవలాంతంలో ఈ విషయాన్నభియోగంగా నంబయ్య తీసుకురావటంతో, బద్దన్నతోపాటు బాదమ్మ చనిపోవటం జరుగుతుంది. ఇది నవలలోని అంతర కథా విషయం.

నవలలో ప్రధాన పాత్రగా బద్దన్న చిత్రించబడినా అతని సర్వ కార్య నిర్వహణలోను కథా వస్తు గమనంలోను, అనుస్యూతంగా నవలాంతం వరకు కన్పించే పాత్ర బాదమ్మది. అందువల్ల రచయిత ఏ అంశాన్ని ముఖ్యంగా చెప్పదలచుకున్నారో తత్సంబంధమైన సమగ్ర వివరణ కామెను ప్రధాన వ్యక్తిగా తీర్చిదిద్దారు.

"బాదమ్మ ముప్పదియేండ్ల యువతి. చామనఛాయ మనిషి. కోలపు చువ్వవంటి మనిషి. ఆమె యొక్క శరీరావయవ విన్యాసము భగవంతుడు చూచి మన్మధునకు క్రొత్త బండి కట్టినట్లుండెను. ఆమె మొగమున సౌందర్య మెంత యుండెనో, ప్రసన్నతయంత యుండెను. ఆమె శరీరమున కాఠిన్య మెంత యుండెనో సౌకుమార్య మంత యుండెను. ఆమె నేత్రములలో తీక్ష్ణ ఎంత యుండెనో, దయ యంత యుండెను." ఇలాంటి బాదమ్మను తండ్రి పేదవాడైన కారణంగా షావుకారు తిప్పన్న అనే ముడవ పెండ్లివానికిచ్చి చేస్తాడు.

"బాదమ్మ సాముగరిడీలు నేర్చిన స్త్రీ. బాదమ్మ పుట్టినింటివారి గూడెములో చిన్నప్పుడు తమ కులములోని యువకులందరు సాములు నేర్చుచుండగా బాదమ్మ వారితోపాటు నేర్చినది. వారి యూరు కొప్పాక. కొప్పాకలోని పంచమ వర్ణస్థుల ఖడ్గ విద్య పంచములందే యుండెను. ఆ సంప్రదాయములోని నిగ్గులు, కొప్పాకలోని మూల భూతములు బాదమ్మకు తెలియును. బాదమ్మ యీ విద్యలో బద్దన్నకు గురువు." -ఇది స్థూలంగా బాదమ్మ పాత్ర పరిచయం. అంటే ఇది ఆమె సాంఘిక వ్యక్తిత్వం. ఆమె అంతర వ్యక్తిత్వం మరొకటుంది. అది ఇది. "అతడు జారుడు కాడు. నేను జారిణిని కాను. మా ప్రేమకు మీ సూత్రములు పట్టవు. మాది లింగ జ్ఞానాతీత సంబంధము"- నవలాంతంలో చనిపోతూ బాదమ్మ అన్నటువంటి మాటలివి. రచయిత నవలలో చెప్పదలచుకున్న ప్రధానాంశమిదే. వారి ఈ విచిత్రమైన సంబంధాన్ని దృష్టిలో పెట్టుకొనే పై పాత్ర సృష్టి జరిగినది. విశ్వనాథ పాత్ర సృష్టిలో ఇదే ప్రధానాంశం.

బాదమ్మ నిశిత పరిజ్ఞానం కల యువతి. సాముగరిడీలు, ఖడ్గ విద్యలో మెలకువలు తెలిసినది కావటంచేత అతి సామాన్యుడు, వయసుమీరినవాడు ఐన తిప్పన్న తోడి దాంపత్య జీవితం ఆమెలో మానసిక సంఘర్షణను కలిగిస్తుంది. ఇదే కథా గమనానికి కారణమౌతుంది. బాదమ్మ కొప్పాక నుండి వివాహ మయ్యాక గోశాల వచ్చాక, తిప్పన్న ఇంటి ప్రక్కనే వున్న సాముగరిడీ శాలలో సాధన చేస్తున్న యువకుల కామె తనకు తెలిసిన ఒడుపులను నేర్పే సమయంలో బద్దన్న పరిచయం కాగా అతని నేర్పు, విద్యాకౌశలము చూచి ఆమె తనకు తెలిసిన విద్యనంతా అతనికి నేర్పుతుంది. ఇద్దరిలో సమాన ధర్మమైన ఈ ఖడ్గ విద్య వారిలో ప్రేమ భావాన్నంకురింప చేస్తుంది.

ఆంధ్రదేశం పశ్చిమ చాళుక్యుల హస్తగతమై వున్న సమయంలో బాదమ్మ గోశాలకు వస్తుంది. ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు, తూర్పు చాళుక్యుల ఓటమివల్ల దేశంలో చెలరేగిన అస్థిరత, బద్దన్నను ప్రేరేపించగా తత్సాధనా ప్రయత్న సమయంలో ప్రేరణ శక్తి రూపంగా బాదమ్మ ప్రవేశించటం, బద్దన్న మరికొన్ని ఖడ్గ విద్యా మెలకువలను తెలుసుకోవటం జరుగుతుంది. గుర్రపు ముంగాళ్ళు, నరకటమన్న విద్యను ఆమెవద్ద నేర్చుకోవడంవల్లే బద్దన్న కరవాల భైరవుని సంహరించగలుగుతాడు. కాని నవలలో ఆమెవల్ల అతనికి సంక్రమించిన విద్యను గూర్చి చెబుతూ రచయిత "కరవాల భైరవునితో చేసిన యుద్ధములో బాదమ్మ నేర్పిన ఖడ్గ విద్య బద్దన్న ఎక్కువ యుపయోగించలేదు. ఆ విద్యలోని ఎక్కువ భాగము రెండు మహాసైన్యము లెదురు పడ్డప్పుడు ప్రయోగింప దగినది' అంటాడు. దీన్నిబట్టి బాదమ్మ అతన్నెంత నిశితంగా పరిశీలించిందో అర్థమౌతుంది. ఈ విషయాన్నే ఆమె బద్దన్నతో "నీలో బాల్యమునందే బాల్యమృదుత్వమునకు సంబంధించని యూహామృదుత్వ మేర్పడినది. ఇచట మృదుత్వ మనగా నిశితత్వమని యర్థము. నీవు యుద్ధమును గూర్చి, రాజనీతిని గూర్చి, సైన్యములు సమకూర్చుటను గూర్చి, మరి తత్సంబంధమైన సర్వ విషయాలను గూర్చి, బాల్యమునందే వృద్ధుడూహించినట్లూహించితివి"- అని అనటంలో బద్దన్నలోని విశేషమైన ఈ గుణాల్ని ఆమె గుర్తించిందని స్పష్టమౌతున్నది.

పశ్చిమ చాళుక్యులాంధ్రులతో యుద్ధం చేసిన నాటికి బద్దన్న పసివాడు. తండ్రి తప్ప తోబుట్టువులు కాని, తల్లికాని లేని బద్దన్న చిన్నతనం నుండి ఖడ్గ విద్యాభ్యాసం తప్ప మరొక విషయంలో ఆసక్తి లేనివాడిగా పెరగటంచేత అతనిపై ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితుల ప్రభావం ముమ్మరంగా వుంటుంది. స్నేహితుడైన నన్నయ్యతో తూర్పు చాళుక్యరాజుల యుద్ధ నైపుణ్యం, వారి వ్యూహ రచన, అందలి దోషాలు, సైన్యాలు నడపబడిన తీరు, మొదలైన అంశాల గూర్చి చర్చించేవాడు. ఇలాంటి బద్దన్నలోని ఏకాగ్రతను, కార్యసాధనా దీక్షను, సామర్థ్యాన్ని, అతని విషయ పరిజ్ఞాన శక్తిని, భావ గాఢత్వాన్ని బాదమ్మ గుర్తించ గలుగుతుంది. కాబట్టే తనకు తెలిసిన ఖడ్గవిద్యా రహస్యాలన్నిటిని అతనికి నేర్పుతుంది. బద్దన్న అంటే "తెలుగునాటి పౌరుషమంతయు ముక్కు మొగముగా నేర్పడిన వాడు" అని ఆమె అభిప్రాయమని నవలలో ఔచితీవంతంగా చెప్పబడింది.

బాదమ్మ నేర్పిన ఖడ్గవిద్య వలన బద్దన్నలో ధైర్య సాహసాలు రెట్టింపై శివరాత్రినాడు ఎన్నో ఏళ్లుగా వస్తున్న ఆచారాన్ని బద్దలు చేసి కరవాల భైరవుడు విజయవాటం సరిహద్దును దాటిరాగా అతన్ని సంహరిస్తాడు. బద్దన్న ఖడ్గ విద్యా ప్రాకట్యానికా సంఘటన

మొదటి మెట్టు కాగా, తనకు లభించిన విజయోత్సాహంతో సర్వాంధ్ర దేశాన్ని స్వతంత్ర దేశంగా మార్చాలన్న వాంఛాంకుర మతనిలో ఆనాడే మొలకెత్తుతుంది.

బద్దన్న మానసిక స్థాయిని సంపూర్ణంగా గ్రహించిన బాదమ్మ అతని ఏకాగ్రత కెలాంటి భంగం కలుగకుండ ఆంధ్ర స్వాతంత్ర్య సిద్ధాంతం వరకు పరిరక్షిస్తుంది. కరవాల భైరవుడితో పోరాడిన బద్దన్నకు తగిలిన గాయాలకు మందులు వేసి రేయింబవళ్ళతనితో వుండి సపర్యలు చేస్తుంది. భర్త తిప్పన్న పెట్టే హింసల నోర్చుకొని బద్దన్న మామూలు వ్యక్తిగా మారేంతవరకు అతన్నంటి పెట్టుకొనుంటుంది. బద్దన్న సాధించిన ఈ విజయం పరోక్షంగా బాదమ్మదే. అందుకే బద్దన్నను చూచి వస్తున్న బాదమ్మను తిప్పన్న నిందించి కొట్టిన సందర్భంలో ఆమె "నీవీసారి నన్ను కొట్టితివా నేనూరుకొనను. పోయి యూరిలో చెప్పెదను. ఇందులో నేను చేసెడి తప్పులేదు. కరవాల భైరవుని బద్దన్న గెలిచినచో నది నేను చేసిన గెలిపింపు. వీరశైవుల మీద కలిగిన యీ గెలుపు ఒక్క శైవులదే కాదు, వైష్ణవులది, బ్రాహ్మణులది కూడా. అన్ని వర్ణముల వారికి బద్దన్న మేలు చేసెను" అని అంటుంది. ఖడ్గవిద్యా ప్రవీణురాలైన బాదమ్మ, అల్పుడైన తిప్పన్న కొట్టిన దెబ్బల్ని భర్త అన్న గౌరవంతో సహించి, పరిస్థితి నతనికి అర్థమయ్యేలాగ వివరించటాన్ని గమనిస్తే, తాను స్త్రీ కాబట్టి, పురుషునంత శరీర దార్ఢ్యం లేని కారణంచేత బద్దన్న ద్వారా కార్యం నిర్విఘ్నంగా సాగేటట్టు చేసిందే కాని లేకుంటే తానే ఆ కార్యాన్ని సాధించగల సమర్థురాలన్న సత్యాన్నామె మాటలు వెల్లడి చేస్తున్నవి. ఇదే విషయాన్నిగూర్చి గాయపడిన బద్దన్న కూడ "మగవాడైనచో నామెయు సంచరించి యుండెడిది" అనుకుంటాడు. గుర్రపు ముంగాళ్లు నరికే ఒడుపు అతనికి తెలియని విద్య. అశ్వారూఢుడైన ప్రత్యర్థితో నేలమీద వుండి పోరాడే బద్దన్న కామెళుకువ తెలియక పోయివున్నట్లయితే కథా గమనాని కవకాశ మేలేదు. ఈ ఒడుపు బాదమ్మ నేర్పటంతో విజయం బద్దన్నదైంది. గాయపడిన బద్దన్న ఈ విషయాన్ని గుర్తిస్తాడు. "అతని గుర్రపు ముంగాళ్లు నరికితిని. లేనిచో నేను యింటికి తిరిగి వచ్చెడి వాడను కాను" అంటూ పసివాడిలాగ ఆమెతో అన్న మాటల్లోని బద్దన్న మానసిక పరిస్థితిని గుర్తిస్తే ఆమె తన విజయానికే కాక, తన ప్రాణ రక్షణకు కూడ కారణభూతురాలైందన్న కృతజ్ఞతా భావం కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. ఈ పరిచయం క్రమంగా అతనికి తెలియకనే బాదమ్మ మీద ప్రేమాభిమానాలు వృద్ధి చేస్తాయి. అందుకే తిప్పన్న కట్టడికి లోబడి బద్దన్నను చూడడానికి వెళ్ళలేని పరిస్థితుల్లో, మరునాడతన్ని చూడటానికి వెళ్ళిన బాదమ్మతో "నీకు తిప్పన్న యే కావలసినచో మాని వేయుము" అంటాడు. బద్దన్న శైవుడు. బాదమ్మ వైష్ణవురాలు. బద్దన్న వయసులో ఆమె కన్న పదేళ్ల చిన్నవాడు. అవివాహితుడు. బాదమ్మ ముప్పైఏళ్ళ యువతి, వివాహిత. ఈ విధంగా ఏ విషయంలోనూ బాహ్యంగా సామ్యంలేని యీ రెండు పాత్రల మధ్య ఆకర్షణ, ప్రేమాది భావాలు కల్పించ బడ్డాయి. లోక దృష్ట్యా యిది అవాంఛనీయమైన విషయం. వయసులో పెద్దదైన స్త్రీని భారతీయ సంఘం సోదరిగానో, తల్లిగానో చూస్తుంది తప్ప భార్యగా చూడదు. కాని బద్దన్న ఆమెతో "నాకు పదమూడేండ్లు వచ్చినప్పటి నుండియు నేను నిన్ను ప్రేమించుచుంటిని. నీవే నా భార్య వనుకొనుచుంటిని", 'నీ వచ్చముగా తిప్పన్న వద్దనే యుంటివనుకొమ్ము. నీమీద నాకు గల ప్రేమ కప్పుడును భంగము లేదు'' అన్న మాటల్ని పరిశీలిస్తే బద్దన్న ప్రేమ శరీరాకర్షణ సంబంధమైన బాహ్య స్పృహ కాదని, అంతర చైతన్య ప్రబోధ సంబంధి అని చెప్పాలి. చిన్నతనం నుండి అతడు పెరిగిన తీరు, పదేళ్ళ వయసు నుండి అతనిలో గాఢంగా నాటుకొన్న స్వాతంత్ర్య దీక్షా గుణం, తత్సాధనా ప్రయత్నంలో బాదమ్మ ప్రోత్సాహం, అతని లక్ష్యాన్ని, ఏకాగ్రతను అతనిలో కర్మయోగి లక్షణాన్ని సూచిస్తున్నది. అంతేకాక బాదమ్మమీది ప్రేమను గూర్చి బద్దన్న "ఆ ప్రేమ భగవంతుడు కల్పించెను. భగవంతుడెట్లు చేయించునో అట్లు చేసెడి వాడను నేను. అది పుణ్యమని, పాపమని, ధర్మమని, యధర్మమని, లోక మనవలయును. నేనిది కామప్రవృత్తి చేత చేయలేదు. కామము యొక్క స్వరూపము నాకు తెలియనప్పుడు నేను నిన్ను ప్రేమించితిని. నా ప్రేమ నా హృదయ విషయము. నా జీవిత విషయము. భగవంతునకును, నాకును నడుమ నున్న విషయము. ఈ లోకము భగవంతునకు, నాకును నడుమలేదు. అందుచేత నీ లోకమును నేను విడిగా చూచుచున్నాను. ఇది పాపమెట్లగునో నాకు తెలియదు" అంటాడు. అహంకార స్ఫురణ లేని బద్దన్న తన ప్రవర్తన దైవ ప్రేరితమైందని భావించటం ఆ పాత్ర ఏ స్థాయి నుండి ఆ మాట లంటున్నదో స్పష్టం చేస్తున్నది. అందుకే అతడు "నేను జారుడను కాను. బహు స్త్రీ లంపటుడను కాను. నేను పాపము చేసినచో నా పాపము దైవ ప్రేరితము" అని ధైర్యంగా చెబుతాడు. ఈ పాత్ర ఏ విషయంలోను తన కర్తృత్వాన్ని చూపించుకోకుండ, సర్వ ప్రయత్నాలు దైవ ప్రేరితంగా జరుపుతున్నాననడం ఆ పాత్ర ఉదాత్త స్థాయిని సూచించే విషయం. ఇలాంటి మన స్తత్వమున్న వ్యక్తి కాబట్టి మత విచారణ దృష్టి శూన్యమై, వైయక్తికమై, ఉపాసనా పూర్వకమైన దైవ భావనను సాంఘిక భావనగా పరిణమింప చేశారన్న వీరశైవులమీది కోపంతో కరవాల భైరవుని సంహరించిన సందర్భంలో "శివుడు జ్ఞానాకృతి. ఆత్మ స్వరూపుడు కాని సంఘవ్యవస్థారూపుడు కాడు" అని అనగలుగుతాడు. ఈ సందర్భంగా బద్దన్న ప్రేమను గూర్చి "తాను బాదమ్మను ప్రేమించెను. అతని

యుద్దేశ్యములో నది ధర్మము. కావున నెవ్వరు దానిని దోషమనరాదు. అతని యహంకారము, స్వాభిమానము వాని యాత్మతో ముడిపడెను. ఈ ప్రపంచమునకు మొట్టమొదటివాడు తాను. ఈ జగత్తు తనకోస మున్నది. ఇది తాను శాసించినట్లు నడువవలయును" అని అంటారు రచయిత.

ఇక బాదమ్మ విషయం. బద్దమ్మను చూడటానికి ఒక్క రోజు వెళ్ళని కారణంగా అతడన్న మాటలు, ఆ మాటల తీవ్రతకు చెంపపై వున్న గాయం పగిలి రక్తం రావటము, అతని ప్రవర్తన, ఆవేశాదులు ఆమెలో సంచలనం కలిగిస్తాయి. ఇంటికి వెళ్ళి అతన్ని గూర్చి ఆలోచిస్తుంది. తన కాతనిపై కోరిక లేదని చెప్పటానికి వీలు లేదను కున్నా, మహా పరాక్రమవంతుడు, ఆంధ్రదేశానికి స్వాతంత్ర్యం తెచ్చే ఉద్దేశంలో వున్న అతనికి తనతో సంబంధం కలిగితే అతని నాయకత్వానికి, గౌరవానికి కూడ భంగం వాటిల్లుతుందని వృద్ధుడైనా తిప్పన్న మర్యాదగా బ్రతికినవాడు కావటంచేత తన ప్రమేయంతో బద్దన్న కెలాంటి హాని కలగకూడదని నిశ్చయించుకుంటుంది. కాని ఆమె మనసు బద్దన్నను గూర్చి "బద్దన్న యేమి యౌవనము కల వాడు! కండలు తిరిగిన దండలు, కన్ను తెఱచినచో సింహము" అని అనుకోకుండా ఉండలేకపోతుంది.

బద్దన్నతోడి పరిచయం స్నేహ పరిధిలో కేవల సంభాషణా వధిగా వున్న సమయంలో ఒకరోజు వాళ్ళిద్దరు రాత్రి రెండు జాముల వేళ తూర్పు పొలంలో కలుసుకోవాలను కుంటారు అది బాదమ్మ చేసిన ఏర్పాటే. కాని బద్దన్న అనుకున్న ప్రకారం రాకపోగా, రాత్రంతా అతనికోసం ఎదురుచూచి ఇంటికి తిరిగివెళ్ళిన బాదమ్మ భర్తచే అనుమానింపబడి, యింటి నుండి గెంటి వేయబడుతుంది. "తిప్పన్న యెంత కొట్టినను బాదమ్మ మాటాడలేదు. కుయిక్కుమన లేదు. చేయి యడ్డము పెట్టనూలేదు. ఆమె మొగమునందు మాత్రము బాధ పడుచుండెను" అన్న మాటల్నిబట్టి లోకజ్ఞానం తెలిసిన యువతి కాబట్టి బాదమ్మ ప్రచ్ఛన్నంగా తిప్పన్నకు దొరికిపోయిన స్థితిలో అతడెన్ని బాధలు పెట్టినా సహిస్తుంది. తన తప్పిదానికి మౌనంగా శిక్ష ననుభవిస్తుంది. కారణం అతడు తన భర్త కనుక. అతను యింటినుండి గెంటివేయడంతో పుట్టింటికి వెళ్ళక ఆత్మహత్య చేసు కోవాలనుకుంటుంది. (కొప్పాక స్త్రీలు పౌరుషం కలవారని నవలలో చెప్పబడ్డది). కాని కృష్ణలో నీరు కొద్దిగా వుండడంచేత ఆత్మహత్యా ప్రయత్నం మానుకొని తన భవిష్యత్తును గూర్చి ఆలోచిస్తూ 'తనకు వయసు వచ్చినప్పటి నుండి ఆ వయసు యొక్క పంట కనిపించలేదు. తన తండ్రి తిప్పన్నకు డబ్బు కోసమిచ్చినాడు. ఆ తిప్పన్న పురుషుడే కాడు. వానివద్ద భోగ లక్షణములే లేవు. వానికి ప్రేమ యనగా నేమో తెలియదు. తన జీవిత మంతయు, తన ప్రేమ యంతయు, పది యేండ్లుగా బద్దన్న కోసము ముడుపుకట్టియుండెను. అది యిప్పటికి పంటమొగము తిరిగెను. ఇప్పుడు పోయి ఆత్మహత్య చేసికొని యిక్కడికి కాక యక్కడికి కాక యగుట యెందులకు? బద్దన్న యింటికి పోయెదను. ఏమి జరుగునో చూచెద" ననుకొని బద్దన్న వద్దకు వెళుతుంది. బద్దన్న ఆమె నాదరిస్తాడు. కొన్నాళ్ళు వారిద్దరి జీవితం సుఖంగా గడిచిపోతుంది. కాని లోక దృష్ట్యా వారి సంబంధం అధర్మమన్న భావన, వారు చేస్తున్నది జారత్వ మన్న దోషారోపణ బద్దన్నను కలత పెడుతుంది. "నే నామెను లేవదీసుకొని రాలేదు. అది తప్పని నాకు తెలియదు. నేననుకొనలేదు. నా మన స్సులో దైవమున్నాడు. నాకు తెలిసిన దొక్కటియే. ఆ ప్రేమ లోకమునందు వ్యభిచారముగా భాసించునని నేనెరుగను" అని మందయ్యతో ఆమె తనతో రావడం తప్పని తెలియదనటం, తాను చేసిన పని అంతర చైతన్య ప్రబోధాన్ననుసరించి నట్టిదే కాని, అహంకార స్ఫురణ వున్న సామాన్యుడిలా చేసింది కాదని చెప్పటం తన మనసులో దైవమున్నాడన్న మాటల్లో తాను ఆంధ్ర స్వాతంత్ర్య విజయానికి దీక్ష వహించటానికి ఏదైన ప్రేరణ కారణమైందో, ఆ దైవ ప్రేరణే తనను బాదమ్మతో కలిపిందని, తమది లోక సామాన్యమైన ప్రేమ కాదని చెప్పినట్లైంది.

ఈ విధంగా నిరహంకారుడైన బద్దన్న బాదమ్మ ప్రోత్సాహంతో సర్వాంధ్ర ప్రజానీక ప్రతినిధిగా, ఆంధ్ర స్వాతంత్ర్య విజయాన్ని ప్రధాన ధ్యేయంగా పెట్టుకొని సమిష్టి మానవ స్వరూపుడిగా విశ్వజనీన స్థాయి దశకు పెరిగి ప్రవర్తించాడు కనుక బాదమ్మతోడి సాహచర్యం, దాంపత్యం, అతనికి ధర్మ విరుద్ధంగా కనిపించలేదు. ఇలాంటి మనోవృత్తికల బద్దన్న మానసిక స్థాయిని పట్టుకోగలిగింది కాబట్టే బాదమ్మ "నా బుద్ధి నిశితమైనది. ఈ నిశితత్వమే మనల నొకరి నొకరి యెడ కాకర్షించినది" అనటమే కాక, "నీకు సరే బాల్యము. నాకు నా పూర్వ జీవితమున నా నిశితత్వమును ప్రదర్శించు టకు వీలు లేకపోయి యాస్థానము కొరకు వెదకుటయు, నీవు కనిపించుటయు జరిగినది. మన యీ కలయికలో శరీరము లాకర్షింప బడుట తక్కువ. మన స్సాకర్షింపబడుట యెక్కువ" అని అనగల్గు తుంది. అంతేకాక 'తెలివితేటలు కలిగి యుండుట యొక చెడ్డ గుణము- ఎప్పుడును ఆ తెలివితేట లుపయోగించుటకు వీలైన పరిస్థితి కోసమే మనస్సెదురు చూచుచుండును. ఒక తెలివి గలిగిన స్త్రీ తెలివి లేని పురుషునితో, తెలివి గలిగిన పురుషుడు తెలివి లేని స్త్రీ కలిసి యుండ లేరు" అని బద్దన్నకు తమ పరిస్థితిని గూర్చి వివరిస్తుంది. అతి సామాన్యుడైన తిప్పన్నతో కలిసి జీవించటం సాధ్యం కాదన్న ఆమె నిశిత బుద్ధి బద్దన్న నాశ్రయింప చేస్తుంది. ఇక్కడి పాత్ర లోకము. వ్యక్తి వీటి రెంటి సంఘర్షణను చిత్రించింది. తెలివి తేటలుండటం

తప్పన్నమాట లోకదృష్టిలోది. ఇందువే ఈమె లోకమర్యాదోల్లంఘనం చేసింది. బద్దన్నా చేశాడు. కాని లోకం దాన్నామోదించలేదు. బద్దన్నతో పరిచయమైనప్పటి నుండి ఆమె కతనిపై ప్రేమ భావం లేకపోలేదు. పుచ్చతోటలో బద్దన్న తానామెను పదేళ్ళుగా ప్రేమిస్తున్నానని, చిన్నవాడవటంతో చెప్పలేక పోయానన్న మాటకు తాను కూడ ఆ భావాన్నే, కలిగి వున్నానని చెప్పటానికి "నీవు చిన్నవాడవు. ఏమని చెప్పుదును" అని హాస్యంగా అతడన్న మాటల నతనికే చమత్కారంగా తిప్పి చెప్పుతుంది. వయసులోను, అనుభవంలోను, పెద్దదైన కారణంచేత చిన్నవాడైన బద్దన్నను చతురోక్తులతో, వ్యంగ్య సంభాషణలతో పూరించి, అతని మనోభావాన్ని గ్రహించిన తర్వాత కాని ఆమె తన మనసును బయట పెట్టని ప్రౌఢ.

బాదమ్మ వైష్ణవురాలని, వైష్ణవ మతానికి సంబంధించిన సర్వ విషయాలు జంగాల వద్ద నేర్చుకున్న సాగరకు రాలిగ నవలలో చెప్పబడింది. ఈ విధంగా బద్దన్నను శైవుడిగా, బాదమ్మను వైష్ణవురాలిగ, వయసులో బద్దన్న చిన్నవాడిగా, ఆమె పెద్దదిగా చిత్రించటంలో ఒకరు లోక దృష్ట్యా వ్యక్తిగత ప్రవృత్తిని విశ్లేషించుకోగా, మరొకరు లోకంతో సంబంధంలేని రీతిలో మానసిక ప్రబోధాన్ననుసరించి విషయ పరిశీలన చేసుకునే పద్ధతి చూపెట్టబడింది తమ యిద్దరి సంబంధాన్ని బద్దన్న లోక దశను దాటిన పై స్థాయిలో చూస్తాడు. బాదమ్మ దాన్ని గుర్తించినా, లోకజ్ఞురాలవటంచేత సంఘానికి (తమ సంబంధాన్ని) సన్నిహితంగా పెట్టి చూస్తుంది. అందుకే మనమిద్దరము ననుభవించుచున్న సుఖము జగత్తులో మరి యే యిద్దరు స్త్రీ పురుషులు ననుభవించరు. ఇది భగవంతుడు చేసిన పని" అన్న బద్దన్నతో "ఇట్టి వాదన నీవును, నేనే కాదు లోకములో జారులందరు చేయ వచ్చును" అంటుంది. వయసుచేత, లోకానుభవంచేత, మానసిక పరిపక్వత కల వ్యక్తి కావటంచేత పసివాడైన బద్దన్నకు తాము సంఘంలో వున్నంతవరకు తమ సంబంధాన్ని జారత్వంగానే పరిగణింపబడుతుంది; తప్ప, అందులోనే దివ్యత్వాన్నిచూసే శక్తి లోకానికి లేదంటుందామె. అందుకనే "మనుష్యులు శరీరముతో తక్కువ జీవింతురు. మనస్సుతో నెక్కును జీవింతురు. మనస్సు కనబడనిది. శరీరము కనబడునది. లోకము కనబడుదాని వెల కట్టుదురు, కాని కనబడని మనస్సు వెలకట్టలేరు. ఆ కనబడని దాని వెల కట్టలేదని యీ లోకమును నిందించుటయు తప్పే" నని అతని నోదార్చుతుంది. ఉదాత్తమైన తమ సంబంధాన్ని గుర్తించే గొప్ప మనసు ఈ లోకానికి లేదని ఆమె భావం. లోక రీత్యా జీవితమంటే కేవలం సాంఘిక సంబంధమైనదన్న దృష్టే తప్ప, మనోభావ దృష్ట్యా గడిపే జీవితంతో దానికి సంబంధం లేదు. కాబట్టి మనసు కన్నా శరీరానికే ప్రాధాన్యమివ్వబడి నడుస్తున్న ప్రపంచంలో మనో జీవులకు గుర్తింపు అసాధ్యమన్న విషయాన్నామె స్పష్టం చేసింది. ఆమెకు తమ ప్రణయ భావౌన్నత్యం సంపూర్ణంగా తెలుసు కాబట్టే బద్దన్న కొన్ని సమయాల్లో కోపించినా, అధికారం చూపినా, మాటల సందర్భంలో ఆమెను బాధపెట్టినా, అతని కనుకూలంగా ప్రవర్తించేది. అందుకే నవలలో "బాదమ్మ కతడొకవేళ కొడుకు ఒకవేళ భర్త. ఒకవేళ తండ్రి. ఒకవేళ రాజు. ఒకవేళ సేవకుడు" అని చెప్పబడింది. ఇదే ఆమె పాత్రత కథా వస్తు సంబంధమైన విషయంగా పరిణమించింది. ఈ విధంగా సర్వకాల సర్వావస్థల్లోను అతనికి చేదోడు వాదోడుగా మసలుతూ, అతని మానసిక స్థాయి కనుగుణంగా ప్రవర్తించటంవల్ల ఆంధ్రదేశం విజయం సాధించిన తర్వాత తననెవరు గుర్తించక పోవటంతో సర్వ జగత్తుమీద నిరాదరణ చెందిన బద్దన్న ఆమెతో "నేను నిన్ను సేవించెదను. నీ వలన నాకెక్కువ సుఖము సమకూడును" అంటాడు. తనను తన మానసిక స్థితిని గుర్తించిన వ్యక్తి ఆమె ఒక్కతే కనుక.

ఇక బద్దన్నతోడి జీవితంలో బాదమ్మ అనుభవాల్ని పరిశీలిస్తే "తాను తప్పన్న వద్దనున్నపుడామె మనసు పరిపరి విధముల భావించెను. జీవితము వేరు. మతమువేరు, ఈ రెండును వేరువేరుగాకనిపించెను. బద్దన్న వద్దకు వచ్చిననాటినుండియు నా రెంటికి భేదము కనిపించలేదు" అని ఆమె కనిపించిందని చెప్పబడింది. ఎందుకు? బద్దన్న సాహచర్యంలో యౌవనానుభూతి విషయంలో ఆమె కొత్తదనాన్ని చవిచూచివుండాలి. ఈ ప్రత్యేక లక్షణాల్ని బాదమ్మ పొందిన అనుభవ విశేషంగా ఊహిస్తే బద్దన్నను, కలిశాక కాని ఆమెలో లింగ జ్ఞానాతీత ప్రణయానుభవ విషయం బయట పడలేదన్న విషయం స్పష్టమౌతున్నది. వాస్తవానికి వారిది లోక విరుద్ధమైన కలయికే అయినా తద్వారా ఒకానొక దివ్యమైన ఆధ్యాత్మికానుభవ విశేషాన్ని వాళ్ళిద్దరు పొందారన్న విషయం స్పష్టంగా తెలుస్తున్నది. ఈ కారణంగా వారిరువురు లోకాన్ని ఎదిరించ గలిగారని వారిద్దరి ప్రకృతిగతమైన స్వభావమే వారినలా ప్రవర్తించేటట్లు చేసిందని చెప్పవచ్చు. ఇలాంటి అనుభవాన్ని పొందిన బాదమ్మ తమ జీవితాన్ని లోకానికి దగ్గరగాపెట్టి చూస్తుంది కాబట్టే, వారి ప్రణయమెంత మానసిక స్థాయిలోదైనా, "కామము శరీర ధర్మము. లేనిచో నిన్ను పడివచ్చుట యెందులకు?" అని అంటుంది. కాని బద్దన్న "పూవునకు వాసన యెటువంటిదో, ప్రేమకు కామమటువంటిది. కొందరు కామమే పుష్పము, ప్రేమయే వాసన యందురేయో! నేనది యంగీకరించను. ప్రేమయే పుష్పము. కామమే వాసన. వాసనచేత నా పుష్పమును గ్రహింతుము. పుష్పమునుండి ఫలమావిర్భవించును. అట్లే ప్రేమ నుండి భగవంతుడావిర్భవించును. కామము లోక సంబంధి, ప్రేమ భగవధారాధనా విశేషము. వాసన లేకుండ పూవె

ట్లుండదో కామము లేకుండ ప్రేమ యట్లే యుండదు' అంటాడు. ఇలా బద్దన్న వివరించిన తీరు వారి ప్రణయ దృష్టికి కేంద్రస్థానమైన ఆధ్యాత్మిక స్థాయిని సూచిస్తుంది. ఈ భావాన్ని నవలాంతం వరకు లేశమాత్రం తక్కువ కాకుండ కాపాడుతుంది బాదమ్మ.

బద్దన్న ప్రయత్నాలన్నీ ఫలించి ఆంధ్రులు విజయాన్ని సాధిస్తారు. యుద్ధానంతరం బద్దన్న తనకు గొంకరాజు వద్ద నుండి ఆహ్వానం వస్తుందని, తన సామర్థ్యానికి గుర్తింపు లభిస్తుందని ఆశిస్తాడు. కాని యుద్ధం ముగిసి పది నెలలైనా ఎలాంటి వర్తమానం రాకపోగా బద్దన్న దిగులు పడతాడు. బాదమ్మ అతడి నోదారుస్తూ "నీవింతటి పనియు నెవరో నీకు ప్రత్యుపకారము చేయుదురని చేయలేదు కదా! దేశభక్తికొలది చేసితివి. దేశమునకు మరల స్వాతంత్ర్యము తెచ్చుటకు చేసితివి. అప్పుడు నీకు ప్రతిఫల వాంఛ లేదు, ఇప్పుడెందు" కంటుంది బద్దన్న కార్య నిర్వహణలోనె నిస్వార్థ దృష్టిని గుర్తించింది కాబట్టి లోకాన్ని పట్టించుకోవద్దంటుందామె. తన పట్ల కృతజ్ఞతా భావాన్ని లోకమెందుకు చూపడం లేదన్న బద్దన్నతో "ఇది యచ్చముగా వారియందు కృతజ్ఞతా భావము లేకపోయెనని దిగులా? నేనేదో వాంఛించి యావాంఛ పూర్తి కాలేదన్న జిజ్ఞాసయా? అని ప్రశ్నిస్తుంది. అతని విచారంచేత ఆ వాంఛకొక కాలుష్యమేర్పడుతున్న దంటుందామె. అసలా వాంఛయే పొడసూపరాదంటుంది. యుద్ధానికి పూర్వమున్న అతని విశ్వజనీన స్థితిని, (ఆ కార్యం సమాప్తమైంది కాబట్టి) ఉద్వేగాన్ని, తన విచారంతో తగ్గించుకోవడంతో సామాన్య మానవుడిగా లోకానికి ఓగి రావడాన్ని గుర్తించి పై మాట లంటుంది. అతణ్ణి మామూలు మనిషిగా చేయడానికి శత విధాలా ప్రయత్నిస్తుంది. (లోకానుభవం లేని బద్దన్నను ఎట్టి పరిస్థితులలోనూ తక్కువ స్థాయికి దిగజారిపోకుండ వుండటానికి వయసులోను, అనుభవంలోను, అతనికన్న మానసిక పరిపక్వత, లౌకికానుభవం కల్గి, సక్రమ మార్గాన్ని సూచించగల వ్యక్తి సాహచర్యం బద్దన్నకు అవసరం కనుక నవలలో అతని కన్న బాదమ్మ పదేళ్ల పెద్దదిగా చెప్పబడిందని చెప్పవచ్చు). లోకం తనను గుర్తించ లేదని బాధపడుతున్న బద్దన్నను గూర్చి అతడు శైవుడుకాక, వైష్ణవుడై వుంటే బాగుండేదనుకుంటుంది బాదమ్మ. లోకస్థితి నిత్యత్వాన్ని వైష్ణవము, మిథ్యాత్వాన్ని శైవము ప్రతిపాదించడం వల్ల శైవుడిగా పెరిగిన బద్దన్నకు లోక సంబంధాలు, ప్రవర్తనాదులు తెలియక పోయిందన్న భావన ఆ మాటల్లో అర్థం.

తామిరువురు కలుసుకున్నపుడు దేశ పరిస్థితి అస్థిరంగా వుండడం, దేశానికొక మహావీరుడవసరమైన స్థితి వున్నది కనుక తత్కార్య దీక్షకై ఏకైక వీరునిగా నిలబడ్డ బద్దన్నను లోకం మెచ్చుకున్నది. అతని మార్గాన్ననుసరించింది. కాని స్వాతంత్ర్యానంతరం సర్వ దేశాల్లో పరిషత్తులు యధావిధిగా పనిచేయడం ప్రారంభిస్తుంది. రాజ్య పరిరక్షణ, ధర్మాది న్యాయ నిర్ణయ సభలు కార్యరూపం ధరిస్తాయి. రాజ్యం సర్వసుభిక్షమౌతుంది. గొంకరాజుచేత బద్దన్న తప్ప తక్కిన వారందరు సన్మానింపబడతారు. కాని ఏ విధమైన గుర్తింపు లేని బాదమ్మ బద్దన్నలు సామాన్యుల్లాగ కూలి చేసుకొని బ్రతుకుతున్న సమయంలో గోశాలలో ఒక స్త్రీ మరియొకనితో కొన్నాళ్ళుండి వచ్చిన సంఘటన పరిషత్తులో తీర్పుకు వస్తుంది. పరిషత్తు వారిద్దరిని శిక్షిస్తుంది. ఈ సంఘటన తిప్పన్న బద్దన్నపై అభియోగం తేవడానికుపకరిస్తుంది. నంబయ్య నాశ్రయించి తిప్పన్న బద్దన్నను గొంకరాజు ముందు దోషిగా నిరూపిస్తాడు. ఆంధ్రుల విజయానంతరం నవలలో ఈ రెండు పాత్రల ఆవశ్యకత తీరిపోతుంది. అటు ప్రభుత్వంలోగాని, యిటు ప్రజల్లోగాని వారికి గుర్తింపు లేదు. ఈ కారణంగా పాత్రల కొక ఉదాత్తమైన ముగింపివ్వదలచి రచయిత ఈ సన్నివేశ కల్పన చేశారని చెప్పవచ్చు.

బద్దన్న ద్వారా సహాయాన్ని పొందిన నాగయ్య తనమీద అభియోగం తెచ్చిన వారిలో ఒకడిగా తెలిసినపుడు "నాగయ్య చాల మంచివాడు. మనము నిద్రపోవుచుంటిమి. అతడు వచ్చి మేల్కొలిపెను. మనము మనలను మరచిపోయినాము. అతడు మీరు మీరని చెప్పినాడు" అన్న బాదమ్మ మాటల్లో బద్దన్న వీరుడన్న మాట మరచి సామాన్యుడిలా మిగిలాడన్న విషయాన్ని, స్వార్థపూరితలోకం బద్దన్న విలువను గ్రహించ లేదన్న భావం నిండివున్నది. పరిషత్తులో దోషిగా హాజరు కావలసిన బద్దన్నలోనే దైన్య భావాన్ని సంపూర్ణంగా తొలగించి, తన ఓదార్పు మాటలలో బాదమ్మ అతణ్ణి సేదదీర్చుతుంది. అంతేకాక ఏ పరిషత్తుకు అతడొక మహాధికారిగా ప్రవర్తించాలో ఆ పరిషత్తెదుటే దోషిగా నిలబడవలసిరాగా, అతని దైన్యాన్నే మాత్రం బయట పడనీయ కూడదని, వీరుడన్న భావన మరణానంతరం వరకు అతని నుండి తొలగి పోనీయక కాపాడుకుందామె ఈ దృష్టితోనే అభియోగం తేబడ్డ రోజు దిగులుగా వున్న బద్దన్న వద్దకు "బాదమ్మ తల దువ్వుకొని, కొప్పుపెట్టి, చెంగావి చీరకట్టి, తనకున్న నగలన్నియు పెట్టుకొని బద్దన్న యెదుటికి" వస్తుంది. "ఆమెను చూచినంతనే బద్దన్న తాను పాలేరు పని చేయుచున్నానని మరచిపోయెను. మరల బద్దన్న నని జ్ఞానము వచ్చెను" అని చెప్పబడిన ప్రకారం బాదమ్మ, అతన్నుత్సాహ పరచి పునరుజ్జీవితుణ్ణి చేస్తుంది. ఈ భావాన్నే రచయిత "మెత్తని పదార్థములకు, మెత్తని పదార్థములకు పరస్పర సన్నికర్ష మట్టిది. అవి యొకదాని నొకటి యొదుగును. ఒకదానిలో నొకటి చొచ్చును. రెండును కలసిపోవును. మిక్కిలి యూహగల రెండు ప్రకృతుల సమాగమ మట్టిది" అని వివరించారు.

రాజు యెదుట దోషిగా హాజరు పరచబడ్డ బద్దన్న అతనిపై అభియోగాన్ని తెచ్చిన నంబయ్యతో యుద్ధం చేయాలన్న పరిషత్తు తీర్పు ప్రకారం నంబయ్యతో యుద్ధం చేసి కావాలని అతని కవకాశాన్నిచ్చి తన చావును కోరి తెచ్చుకుంటాడు. వారి అభియోగపు విచారణ ముందు రోజు నన్నయతో ప్రసంగవశాత్తూ బాదమ్మ ఈ పరిణామాన్నూహించే "బద్దన్న యెట్లును చచ్చిపోవును. నేను కూడ చచ్చిపోయెద" నంటుంది. పరిషత్తు యిచ్చే తీర్పు, బద్దన్న జీవితం ఎలా ముగుస్తుందో ఊహించిన బాదమ్మ బద్దన్నకు దీటైన వీరుడు ఆంధ్రదేశంలో లేడన్న విషయాన్ని సంపూర్ణంగా ఎరిగిన వ్యక్తి కాబట్టే ఆ గుర్తింపులేని అతడు బ్రతకడని గ్రహిస్తుంది. అతడు లేకుంటే తానుండదు. అందుకే బద్దన్న ద్వంద్వ యుద్ధంలో నంబయ్య చేతివ్రేళ్లు ఖండించి చనిపోగా "బాదమ్మ ఎచటి నుండి వచ్చెనో, తన కత్తి గుండెలో క్రుమ్ముకొని బద్దన్న మీదపడి రాజుతో "ప్రభూ! వంద ఏన్గులకు కత్తి పుచ్చుకొని యెదురు నిల్వదగిన వాని ఎదుటనొక మేకపిల్లను పెట్టితివి. ఆ మేకపిల్లకు వ్రేళ్లు తెగిపోయినవి. ఆ మొటిక జంతు వెందుకు పనికి వచ్చును? మహాసేనాధిపతిని పోగొట్టుకొంటిరి" అని బద్దన్న గొప్పతనాన్ని చాటి, పరిషత్తులో సామాన్యుడిలా మరణాన్నాహ్వానించిన బద్దన్నలా కాక తను యిద్దరి దివ్యసంబంధాన్ని, దాని పవిత్రతను గూర్చి రాజ పరిషత్తులోని ప్రజలతో "మా ప్రేమకు మీ సూత్రములు పట్టవు. మాది లింగ జ్ఞానాతీతమైన సంబంధము" అని ధైర్యంగా చెప్పి మరణిస్తుంది. ఈ విధంగా బద్దన్న మీద అభియోగం రాకపోయి వున్నట్లైతే వారి శౌర్య పరాక్రమాలు, యుద్ధనీతి, రాజ్య తంత్రం, సర్వం మరుగున పడిపోయి వారు కూడ సర్వ సాధారణమైన జీవితం గడిపివుండేవారు. నవల ముగింపులో పాత్ర వైశిష్ట్యం దెబ్బతినేది. రచయిత ఈ పాత్రల నావిధంగా ముగించక లోక స్వభావాన్నొకవైపు చిత్రిస్తూ, తద్వారా ఆ పాత్రల కొక వైశిష్ట్యాన్ని కల్పించటంకోసం పై కల్పన చేసి బద్దన్నను వీరునిగా తీర్చిదిద్దారు.

విజయవాటం సరిహద్దును దాటరాదన్న కట్టడి నుల్లంఘించి ఆంధ్రదేశంలో తన నెవరైనా ఎదుర్కోవచ్చునన్న కరవాల భైరవుని వీరుడైన బద్దన్న సర్వాంధ్ర ప్రతినిధిగా ఎదుర్కొని సంహరించటం, ఆంధ్ర సామ్రాజ్య స్థాపన తన విద్యుక్త ధర్మంగా భావించి "నా శౌర్యమునకు మెచ్చి నన్ను సేనానిని చేయు స్వతంత్ర రాజే లేనప్పుడు నన్నెవరు చేయుదురు? నాయంతట నేనే కావలయును" అని నిర్ణయించుకుని, ఎన్ని అడ్డంకులు వచ్చినా సర్వాంధ్ర విజయ సాధనే తన ధ్యేయంగా దీక్ష వహించిన బద్దన్న మానసిక స్థాయి, సామాన్య వ్యక్తియొక్క స్థాయికన్న ఉన్నతమైనట్టిది. ఈ స్థాయిని గుర్తించిన బాదమ్మ సాంఘిక ధర్మాన్ని అతిక్రమించి అతన్ని కర్తవ్యోన్ముఖుణ్ణిగా చేస్తుంది. ఈ స్థాయినుండి లోకాన్ని చూసిన బద్దన్నకు బాదమ్మతోడి సాహచర్యం అవినీతిగా కన్పించలేదు. లోక సామాన్యమైన కట్టుబాట్లు, ధర్మాధర్మాలు వారి దృష్టిలో ప్రాధాన్యం వహించలేదు. కాని ఆంధ్ర స్వాతంత్ర్య సిద్ధి కోసం పడిన శ్రమ, సమకూర్చిన సైన్యం, వ్యూహ కల్పనలు, యుద్ధం, చివరకు సాధించిన విజయము - ఈ సర్వ కార్యాన్నీ నిర్వర్తించి కూడ గుర్తింపు లేకపోగా దోషిగా నిలబడవలసి రావడం అతడెదురు చూడని విషయం. బాదమ్మ సాహచర్యంలో లోక స్వభావాన్ని కొంత కొంత తెలుసుకున్న వాడైన కారణంగా ఏ బద్దెను దాటి కరవాల భైరవుడు రాగా తాను సంహరించాడో, అదే రీతిలో లోక దృష్ట్యా సాంఘిక కట్టుబాటనే బద్దెను దాటి ప్రవర్తించిన కారణంగా లోక సామాన్య రీతిలో తనను తాను శిక్షించుకుంటాడు.

బద్దన్న, బాదమ్మలు భావ దృష్ట్యా తీర్చిదిద్దబడిన పాత్రలు కాబట్టి లోక సామాన్యమైన కట్టుబాట్లు, ధర్మాధర్మాలు, వారి దృష్టిలో ప్రాధాన్యత వహించలేదు. నవలలో రచయిత కొన్నిచోట్ల వివాహము, దాంపత్యము, ధర్మకామ విషయాలను గురించి ప్రస్తావించినా, ప్రధాన పాత్రల ప్రవర్తనా విధానాన్ని ఖండించిన తీరు ఏకవీర, రత్నావళి మొదలైన పాత్రల విషయంలో లాగలేదు. కారణం? బద్దన్న చేసిన కార్యం వైయక్తికమైంది; స్వార్థపూరితమైంది కాదు కనుక. బద్దన్న నిస్వార్థంగా విశ్వకళ్యాణ దృష్ట్యా మానవకర్మ చేశాడు కనుక ఆ నిష్కామ కర్మను యోగంగా తీసుకుంటే అతన్ని సాధారణ లౌకిక జీవిగా చూడటం కుదరదు. అదే ప్రకారం వారి ప్రేమ విషయం కూడ. శారీరక భౌతిక పరిధులనధిగమించి నటువంటిది. తిప్పన్నచే గెంటింపబడిన బాదమ్మ బద్దన్న నాశ్రయించిన సమయంలో వారి ప్రథమ పరిష్వంగాన్ని గూర్చి రచయిత "వారి ప్రేమ యెట్లున్నదో, వారి ప్రథమ పరిష్వంగ సమయము కూడ అట్లే యున్నదని" చెప్పటంలో వారి కామరహిత స్వచ్ఛమైన ప్రణయ భావావిష్కారాన్ని సూచించారు. వీరుడైన బద్దన్నకు ఉత్సాహ స్థాయి బాదమ్మ. బాదమ్మ ఖడ్గ విద్యంతా బద్దన్నలో పర్యవసించగా, బద్దన్న కామ భావమంతా బాదమ్మలో పర్యవసించింది. ఈ విధంగా బద్దన్న కష్టసుఖాల్లో అతన్ననుసరించి, అతని జీవిత రథ సారథైంది బాదమ్మ.

నాయికా నాయకుల దృష్ట్యా నవలా నామకరణాన్ని పరిశీలించవచ్చు. బద్ద+అన్న=బద్దన్న. బద్దె రాజ్యపు సరిహద్దు. రాజకీయమైన బద్దెను దాటి కరవాల భైరవుడు మరణించాడు. సాంఘిక కట్టుబాటనే బద్దె నతిక్రమించి బద్దన్న శిక్షార్హుడైనాడు. కాబట్టి ఎంత మహానుభావుడినైనా వ్యక్తిని లోకమే జయిస్తుందన్న సత్యాన్ని ధ్వనింప చేస్తున్నదీ నామకరణం. అలాగే బాదమ్మ. బద్దన్నలోని భావం బాదమ్మగా భావిస్తే-

పాదు - ఆధారం, క్షేత్రం, పాదు కట్టటం

బాదు - కొట్టటం

ఈ విధంగా విశేష్య, క్రియా, రూపాల్లో బాదు, పాదు, శబ్దాలు వాడుకలో వున్నాయి కాబట్టి, పాదు = ఆధారం-ఇదే బాదమ్మ ఐంది. బద్దన్నకు ఆధారమైన పాదు వంటిది కాబట్టి ఆ స్త్రీ పాత్రను రచయిత బాదమ్మగా చెప్పారనుకుంటే, శైవమత సంబంధమైన విషయం కనుక, వారిది అంతర బాహ్య సమన్వయం కల లింగ జ్ఞానాతీత సంబంధ విషయమన్న రచయిత దృష్టిని పరిశీలిస్తే బద్దన్న బాదమ్మల తత్త్వం శివలింగ తత్త్వంగా ఈ నామకరణం శబ్దార్థ సమన్వయ దృష్టిని కలిగి వుందని చెప్పవచ్చు. నవల కూడ శివరాత్రితో ప్రారంభించబడటం అంతంలో బాదమ్మ మాటలు నవల ఆద్యంతాల సమన్వయాన్ని సూచిస్తున్నది.



# భావఝరి

శ్రీ యలమంచిలి శివాజీ

మనిషి కోరేది స్నేహం
మనసు కోరేది స్నేహం-
మనిషికీ
మనసుకూ మధ్య వున్నది
వ్యూహం-
మనసులోని భావనకు
మనిషిలోని సృజనకు
రూపకల్పన చేస్తాడు-
మనసులోన
వ్యూహరచన చేస్తాడు-
అతడు
రచయిత-
చూచిన ప్రతి సన్నివేశం
చూచిన ప్రతి సుందర దృశ్యం
అందంగా
రసరమ్యంగా
శిల్పిస్తాడు
ఓ అద్భుత శిల్పి-

మానస మురళి
పాడాలన్నా
మనసు
నాట్య మయూరియై
ఆడాలన్నా-
రసఝరి పొంగాలి
నీలో
రసవాహిని ఉప్పొంగాలి-
మానస వికాసం కలగాలన్నా
మనిషి విజ్ఞానం పెరగాలన్నా
మనిషి మనిషినీ చూడాలి-
మనసు మనసునూ
అవగాహన చేయాలి-
మనిషి మనిషినీ చూచి
మానస తంత్రులు మీటనిదే
రసరాగం పలకదు-
ఆనందం తెలియదు- అసలు
అవగాహన పెరగదు-

# "ఆరు నెలలు"

## 'అరవింద'

"నేను కూడా వస్తాను" అంది సీత తలెత్తి నన్ను చూస్తూ. సూట్‌కేస్‌లో నా బట్టలు సర్దుతోంది. నాకు ఢిల్లీ వెళ్ళాల్సిన పని ఉంది. అప్పటిదాకా సీతనే చూస్తున్న నేను వెంటనే నా చూపుల్ని మరలించుకున్నాను.

"వీలుకాదు. నాకు రెండు రోజులూ మీటింగ్ ఉంది. తీరిక ఉండదు. ఒక్కతెవూ హోటల్‌లో ఉండి ఏం చేస్తావూ" అన్నాను.

సీత మళ్ళీ మాట్లాడలేదు. మిగిలిన షర్టులు, సేవింగ్ సెట్, లోపల పెట్టి పెట్టె మూసేసి లాక్ చేసింది. కొత్తల్లో ఏవైనా భేదాభిప్రాయం వస్తే వాదనకి దిగేది. ఇప్పుడు మాట్లాడటం తగ్గించేసింది. ఇది నాకూ బాగుండలేదు. ఐనా.... నేనేం చెయ్యలేకపోతున్నాను.

నాకు ఆఫీస్‌పని ఒకరోజే ఉంది. రెండోరోజు పనిలేదు. రవికాంత్ ఇంట్లో అతనితో గడపటానికి నిశ్చయించుకున్నాను. ఆత్మపరిశీలన చేసుకోవాలనుకుంటున్నాను. సీత నా పక్కన, దగ్గర ఉంటే అది సాధ్యంకాదు. వీలైతే ఈ విషయం రవికాంత్‌తో చర్చించాలి. సీతతో నా పెళ్ళయి ఆరు నెలలైంది. ఈ ఆరు నెలలూ....

* * *

మెరీనా దీపాలతో మెరిసిపోతోంది. రకరకాల మనుషులతో కలకలంగా ఉంది. సముద్రపు కెరటాల్ని చూస్తూ కొంచెం దూరంలో కూర్చున్నాను నేను. ఒకదానివెంట ఒకటి వస్తూనే ఉన్నాయి కెరటాలు ...ఆగకుండా. ఎన్నాళ్ళనుంచి జరుగుతోందో ఈ లీల! మనసులో ఆశ్చర్యం. సముద్రాన్ని ఎన్నిసార్లు చూసినా ఆశ్చర్యం కలుగుతూనే ఉంటుంది. కొంచెంసేపు ఆ సముద్రపు కెరటాలలో పాదాలు తడుపుకుంటూ ఆడుకుని వచ్చి కూర్చుంది సీత. నేను ఇంకా కెరటాలవైపే చూస్తున్నాను.

"నా చిన్నప్పుడు ఒకసారి విశాఖపట్నంలో సముద్రంలో పడిపోయాను. ఎవరో రక్షించారు. చచ్చిపోవలసింది" అంది నావైపు చూస్తూ.

"చచ్చిపోయినా బాగుండేది" అనిపించిన క్షణమైన నా ఊహకి వెంటనే ఉలికిపడ్డాను. నేనెందుకిట్లాగ మారిపోయాను? బాధగా అనుకుంటున్నాను.

"హాయ్ సీతా!" ఎవరో ఆనందాశ్చర్యాలు మేళవించిన కంఠంతో పలుకరిస్తున్నారు....అటుతిరిగి చూశాను.

ఎవడో వీడు! ఆకర్షణీయంగా ఉన్నాడు. వేషం బాగా వేశాడు. డబుల్‌బుల్‌షర్ట్ ...స్టైలిష్‌గా దువ్విన జుట్టు.

"ఓ....గౌతమ్!" అంది సీత. ఆ మొహంలో సంతోషం. కప్పు నిండిపోయి పొర్లిపోతున్నట్లు.

అతను మా పక్కనే కూర్చున్నాడు.

"రియల్ సర్‌ప్రైజ్. నిన్ను ఇక్కడ చూస్తానని అనుకోలేదెప్పుడూ!" అంది సీత.

"ఎర్త్ ఈజ్ రౌండ్! నేనూ అనుకోలేదు. ఇక్కడ ప్రోగ్రాం ఉండివచ్చాను," అన్నాడతడు.

"ఇతను గౌతమ్. చాలా బాగా పాడతాడు. ప్రోగ్రామ్స్ ఇస్తుంటాడు. ఈయన మావారు. రాజశేఖర్." పరిచయం చేసింది సీత.

"నమస్తే. మీకు తెలుసునో లేదో సీత చాలా బాగా పాడుతుంది "

"ఆయనకి తెలీదు. నేను సుశీలనా? నాజియాహసన్‌నా?" అంది సీత.

"నువ్వు ప్రయత్నం చేస్తే కదూ. చెయ్యలేదు. రాజశేఖరంగారి అదృష్టం బాగుంది. ఆయన భార్యని అయ్యావు" అన్నాడు గౌతమ్ నవ్వుతూ.

నా అదృష్టం అఘోరించినట్లే ఉంది. భార్య రూపవతి శత్రుః అన్నారు పూర్వులు. భార్య ఆధునిక యువతి అయితే ఏమిటో నాకిప్పుడు తెలుస్తోంది.

"రేపు సాయంత్రం ప్రోగ్రామ్‌కి మీరు తప్పకుండా రావాలి. మిమ్మల్ని నా అతిథులుగా ఆహ్వానిస్తున్నాను" అన్నారు.

అతడి అభ్యర్థన నన్ను లోబరచుకుంటోంది.

"వెళదామా!" అంది సీత నన్ను చూస్తూ. సీత నావైపు చూస్తోందని తెలిస్తే చాలు నా మనసు కఠినమైపోతుంటుంది.

"సారీ. మేము రాలేము. ఏమీ అనుకోకండి. నాకు మీటింగ్ ఉంది" అన్నాను.

"ఇటీజ్ ఓ.కె." అని, సీతని చూడగలిగినందుకు మరొకసారి తనని తను అభినందించుకుంటూ వెళ్ళాడు అతడు.

ఇంటికి వెడుతూ సీత చెప్పింది. వాళ్ళ నాన్నగారికి సంగీతం చాలా ఇష్టంట. పాడమని ప్రోత్సహించేవారుట. ఫంక్షన్స్‌లో భజన్స్, లలితసంగీతం పాడుతుండేదిట. గౌతమ్‌తో కలిసి కొన్ని ప్రోగ్రామ్స్‌లో పాడిందిట. ఇంకా ఏదో చెప్తోంది. నేను వినటంలేదు. వినలేకపోతున్నాను.

"పాడటంవరకేనా వీళ్ళ చనువు! ఇంకా.... నువ్వు అంటోంది వాణ్ణి." కసి! మనసులో మంట నన్ను దహించివేస్తూ.

నాకు బాగా చదువుకుని, మంచి సంస్కారం, ప్రపంచ జ్ఞానం కలిగిఉండి ఇంకో మనిషితో చక్కగా కలిసి బ్రతకటానికి కావలసిన అవగాహన ఉన్న ఆధునిక యువతి అంటే చాలా ఇష్టం. గౌరవం. సీత అట్లాగ ఉండాలని కోరుకున్నాను. అట్లాగ ఉంటుందనుకున్నాను.

ఆ రాత్రి నిద్ర పట్టలేదు. ఆ రాత్రే కాదు. పెళ్ళయిన తర్వాత ఇంకా ఎన్నో రాత్రులు....

సీత బాంక్‌కి వెడుతుంది. పోస్టాఫీసుకి వెడుతుంది. అన్ని పనులూ చెయ్యగలదు. చేస్తుంది. ఎక్కడికి వెళ్ళినా ఎవరో కనిపిస్తారు. పలకరిస్తారు హాయ్ సీతా! అంటూ. ఎవరు వీళ్ళంతా!

ఇట్లాగ ఎంతమంది సీత చుట్టూ!

హనీమూన్‌కి ఊటీ వెళ్ళినప్పుడు!!!

ఒకవైపు మేఘమాలికల అందం. ఇంకొకవైపు నేలమీద రంగుల తివాచీలాగ పరుచుకున్న పూల సౌందర్యం. నా మనసులో, నా కళ్ళముందర, నా కలల్లో తను ఉండి, నాలో నిండి, నా గుండెమీద సరిగమలు పలికిస్తూ, నా ఉనికిని అందంగా చిత్రిస్తూ, సీత నా ఎదుట! నన్ను నేను మరిచిపోయి ఉన్న స్థితిలో ఎవరో మిలిటరీ వేన్ దిగి మావైపు పరిగెత్తుకుని వచ్చారు.

"హాయ్ సీతా!"

ఎవరో ధీరేంద్రకుమార్‌ట! నా చేయి గట్టిగా పట్టుకుని "హేపీ టు మీట్ యూ. ఐ కంగ్రాట్యులేట్ యూ ఫర్ యువర్ ఛాయిస్. మీరు చాలా లక్కీ. సీతని చేసుకున్నారు. అంత స్వీట్ అండ్ ఇన్నోసెంట్ గార్ల్‌ని మీరు ఈ కాలం వెతికినా చూడలేరు." అంటూ ఒకటే పొగడ్తలు. ముందర సంతోషం వేసింది. కానీ అంతతో ఆగలేదు అతడు.

"అందం ఉండటం అరుదు. అందానికి తెలివి కూడా తోడైతే అది గొప్ప సంగతి. అందానికి, తెలివికి మంచితనం కూడా కలిస్తే అది సీత! అద్భుతం! ఆనందం!" అన్నాడు. విని విని చిరాకు వేసింది.

"పోనీ తనే చేసుకోకపోయాడా?" అనిపించేసింది.

ఇంతకంటె ఏ గొప్పలూ లేనిదాన్ని చేసుకుంటే ప్రాణం హాయిగా ఉండును అనిపించింది.

ఇంకా ఒదిలిపెట్టలేదు. కాంటీన్‌కి తీసికెళ్ళి కాఫీ ఇప్పించాడు.

"సీత మీకు చెప్పిందో లేదో. వీళ్ళ పక్క ఇల్లే మాది. సీతా నన్ను పెళ్ళి చేసుకోకపోతే ఈ మందారచెట్టుకి ఉరి వేసుకుని చచ్చిపోతా అనేవాడిని. చచ్చిపో అనేది సీత. అలాగ ఊరికే సరదాకి... "

సరదాట! వాడి బొంద. ఐనా ఈ సీత మొహంలో ఆ ఆనందం, గొప్ప ఎందుకు! వాడు వెళ్ళిపోయాక చెప్పింది.

"ఒట్టి జిడ్డు. ప్రతి ఆడపిల్లతో స్నేహం చెయ్యాలని తహతహ. వీణ్ణెవరు పెళ్ళి చేసుకుంటారు! తెల్లవారి గార్డెన్‌లోకి వెళ్ళటానికి భయం. ఓ పువ్వు తెంపుకుని తయారయ్యేవాడు. సెలవలు వస్తున్నాయంటే భయం. బోరు. వీడు వచ్చే రైలుకి ఎక్కడైనా ఆక్సిడెంట్ అయితే బాగుండును అనిపించేది."

అంతా నాటకం! బోరుట. ఎందుకా అబద్ధాలు. తిరగటానికి, సరదాలు తీర్చుకోటానికి అందం కావాలా! కులాలు అడ్డా! సీతకి తల్లి లేదు సరే....తండ్రి చూస్తూ ఊరుకున్నాడా?

"మీ డాడీ ఏమీ అనరూ!" అన్నాను ఎట్లాగో నోరువిప్పి.

"డాడీకి ఆడపిల్లలు పిరికిగా ఉండటం ఇష్టంలేదు. అందరితో బాగా మాట్లాడటం, ఎవరితో ఎట్లాగ ప్రవర్తించాలో తెలిసిఉండాలి అంటారు. ఎప్పుడైనా మా అత్తయ్య అనేది "ఇట్లాగైతే నీ కూతురికి పెళ్ళికాదు అని" అంటూ సీత నావైపు ఓరగా చూసింది.

చూస్తుంది! ఎందుకు చూడదూ. నన్ను బుట్టలో పెట్టారు మరి. పెళ్ళి ఎందుకు కాదూ. నా ఖర్మకాలి నేను వాళ్ళకి

దొరికాను. ఇటువంటి పిల్లనా నేను పెళ్ళి చేసుకున్నాను.... మనసుపడి!

ఆ రాత్రి నేను భోజనం చెయ్యలేదు. సీత బతిమాలింది.

"నన్ను విసిగించకు. నాకు ఆకలిలేదు." అన్నాను.

సీత కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఐనా నాకు జాలి వెయ్య లేదు. ఏం చూసి చేసుకుంది నన్ను! సన్నగా పొడుగ్గా ఉంటాను. స్కూల్లో నన్ను గెడకర్ర, లాంప్‌పోస్ట్ అనేవారు. పైగా నలుపు కూడాను. ఇంకొకసారి సినిమాకి వెళ్ళాం. అక్కడ ఎవరో దంపతులు కనిపించారు. మధ్యవయస్కులు. ఎప్పుడో ఎందుకో వాళ్ళింట్లో భోజనం చేసిందిట. అన్నీ వివరంగా చెప్పింది కానీ నేను వినలేదు. వినాలనిపించదు. అక్కడికక్కడే వాళ్ళని భోజనానికి రమ్మని పిలిచింది.

ఆ కోపంతో తర్వాత నేను నా స్నేహితులు ఇద్దర్ని భోజనానికి పిలిచాను. సీతకి కోపం వస్తుందనుకున్నాను. కోపం రాలేదు. చాలా చక్కగా వంటచేసింది సీత. వడ్డనచేసి కబుర్లు చెప్పి మర్యాద చేసింది. ఎంతో గర్వంగా అనిపించింది. కానీ అది నిలవలేదు.

ఆ తర్వాత రమణ తరచూ మా ఇంటికి రావటం మొదలుపెట్టాడు. నాకు చిరాకు ఎక్కువైంది. వాడు తమ్ముడు లాంటివాడు అంటుంది.

"స్నేహితులు ఉండాలి!ట".

ఎందుకు? సమస్యలు సృష్టించుకోటానికా!

అన్నట్లుగానే స్కూటర్ ఆక్సిడెంట్ అయింది. కాలు ఫ్రాక్చరయి నేను హాస్పిటల్లో ఉండాల్సి వచ్చింది. అప్పుడు రమణే చాలా సాయం చేశాడు. చూడటానికి అమ్మ వచ్చింది. అత్తాకోడళ్ళకి ఏం గొడవలు వస్తాయోనని భయపడ్డాను. ఏ భేదాలూ రాలేదు సరిగదా ఇద్దరికీ స్నేహమైపోయింది. అమ్మ వెళ్ళిపోతూ—

"సీత బంగారంరా!" అంది. సీత అమ్మని కూడా బుట్టలో పెట్టింది. బంగారం! ఈ కాలం బంగారంమీదే అందరి కళ్ళూ.

ఇంతమందికి మంచిది ఐన సీత నాకెందుకు బాధాకరంగా, సమస్యగా తయారయింది! క్షణం క్షణం అశాంతితో బ్రతకట మెట్లాగ? సీత కూడా బాధపడుతోందని తెలుస్తూనే ఉంది. సుఖ పెట్టాలని, బాధపెట్టకూడదని ప్రయత్నిస్తూనే ఉన్నాను. ఐనా సాధ్యపడకపోతే....విడిపోవటం మేలా???

* * *

నేను వెళ్ళేటప్పటికి రవికాంత్ ఒక్కడే ఉన్నాడు ఇంట్లో. భార్య లేదు. డ్రింక్ ఆఫర్ చేసాడు. నేను అవసరాన్నిబట్టి అప్పుడప్పుడు తీసుకుంటాను. ఇవేళ గ్లూమీగా ఉంది. మనసులో మాట రవికాంత్‌తో చెప్పుకోవాలనుకుంటున్నాను. డ్రింక్ అవసర మనిపించింది. తీసుకున్నాను.

"నీ శ్రీమతి పుట్టింటికి వెళ్ళిందా!" కుశలప్రశ్న వేశాను.

"ఊఁ. నామీద కోపంతో వెళ్ళిపోయింది. మళ్ళీ రాక పోవచ్చు కూడాను. తనకి తెలుసు నేను డ్రింక్ చేస్తానని, ఆఫీస్ పనిమీద ఊళ్ళకి వెళ్ళాలని. ఐనా అస్తమానం వేధిస్తుంది. సాధిస్తుంది." అన్నాడు.

రవికాంత్ ఇదివరకు ఇంట్లో తాగేవాడు కాదు. క్లబ్ లోనూ, పార్టీల్లోనూ తప్ప. ఇప్పుడు ఇంట్లో కాబినెట్‌లో రక రకాల డ్రింక్స్ కనిపిస్తున్నాయి.

"నువ్వు అవసరాన్ని మించి తాగుతావేమో!" అన్నాను.

"అవసరం అంటే ఏమిటి? నేను తాగి తందనాలు ఆడను. నా స్టేటస్ చూసుకుంటాను. నా ఇంటికి పెద్ద పెద్ద ఆఫీసర్లు వస్తారు. బిజినెస్‌మెన్ వస్తారు" అన్నారు.

ఔను. ఇప్పుడు వీడు పెద్దవాడైపోయాడు. మాలతి తెలిసే చేసుకుంది వీణ్ణి. ఐనా ఇప్పుడు భరించలేకపోతోంది అంటే వీడు తప్పకుండా బరితెగించి ఉంటాడు. వీణ్ణి మారుద్దామని, మార్చగలనని అనుకుని ఉంటుంది. మార్చలేకపోయింది. అహం దెబ్బతింది. ఎదురుతిరిగింది. కాపురం కూలిపోయింది. తప్పు వీడిదా, ఆవిడదా? సుస్థిరమైన విలువల్నిబట్టి చూస్తే తాగటం గొప్ప నేరం, ఇల్లు గుల్ల....ఒళ్ళు గుల్ల....వీడిదే తప్పు!

"నీ భార్య సంతోషం కోసం, నీ సంసార సుఖం కోసం నువ్వు డ్రింక్ చెయ్యటం మానేయవలసింది. త్యాగం చెయ్యా ల్సింది!" అన్నాను.

"నువ్వు కూడా నన్ను ఇర్రిటేట్ చెయ్యకు. నీకు అసలు సంగతి తెలియదు. దానికి నేనంటే లక్ష్యంలేదు. సరదాలు కావాలి. మగస్నేహాలు కావాలి. నేను ఊరికి వెడితే ఇంట్లో ఉండదు. ఎక్కడెక్కడికో వెడుతుంది. ఎవరెవరితోనో తిరుగు తుంది. నేను ఇంట్లో ఉన్నప్పుడు కూడా రాత్రి లేట్‌గా ఎవరో డ్రాప్ చేస్తుంటారు. ఇదంతా కవర్ చేసుకోటానికి నన్ను.... నన్ను తాగొద్దని గొడవ లేవదీస్తుంది" అన్నాడు.

నా ఒంట్లో రక్తం వేడెక్కిపోతోంది. తలలో నరాలు చిట్లిపోతాయి అనిపిస్తుంది. రవికాంత్ చెప్తున్నదంతా నిజమేనా?

ఎంత నిజం? ఎంత భ్రాంతి?

ఎటువంటి సుడిగుండంలో పడ్డాడు!

బ్రతకటానికి ఎంత సంయమనం కావాలి!

నాలో పొంగిన ఉద్రేకాన్ని అదుపులో పెట్టుకుంటూ

"స్టాపిట్ రవికాంత్! స్టాపిట్. నువ్వు అనవసరంగా అనుమానిస్తున్నావు నీ భార్యని. నువ్వు ఎప్పుడైనా నీ కళ్ళతో చూశావా? నీకేమైనా ఋజువు ఉందా?"

రవికాంత్ సోఫాలో వెనక్కి వాలిపోయాడు. కళ్ళు మూసుకున్నాడు.

"నేను చూడలేదు. చూడనవసరంలేదు. నాకు తెలుసు." అన్నాడు.

తెలుసు! ఏమిటి తెలుసు?

నాకు పెద్దగా నవ్వాలనిపించింది.

రవికి ఏం తెలుసు! నాకు ఏం తెలుసు!

రవికాంత్ వెనకాల, నాకు ఎదురుగా ఉన్న గోడమీద నా మనోనేత్రానికి విస్టావిజన్‌లో సీత కనిపిస్తోంది. తలఒంచుకుని పమిటకొంగు కొన నలుపుతూ.

"నవ్వాలనే అనుకుంటున్నాను. ఐనా ఏడుపే వస్తోంది" అంటోంది.

మనిషికి ఏం తెలుసు?

తను సృష్టించుకున్న భ్రమల వలయంలో చిక్కుకుని బయటపడలేక బాధపడటం తెలుసు. నరకాన్ని సృష్టించడం తెలుసు.

ఏది తప్పో ఏది ఒప్పో తెలుసా?

రవిలో నన్ను నేను చూసుకోగలుగుతున్నాను.

"తెలుసు! నీకు ఏమిటి తెలుసు? తెలుసు అనుకుంటాము కానీ మనకి ఏమీ తెలియదు. ఆనందంగా ఉండటం అసలు తెలీదు. జీవితాన్ని చేతులారా దుఃఖమయం చేసుకోవటమే మనకి తెలుసు. మూఢనమ్మకాలు, సందేహాలు, అనుమానాలూ, పంతాలూ, అహంకారాలూ మనని పట్టిపీడిస్తుంటాయి. మనిషిని ఎదగనీయకుండా, ఆనందంగా బ్రతకకుండా ఉరివేస్తున్నాయి. వాటికి లొంగకూడదు. వీటినించి బయటపడాలి. ఎదిరించాలి.... పోరాడాలి.... గెలవాలి!"

వాడికి ఇంకా ఏం బోధించానో.... ఏం మాట్లాడానో.... మనసునిండా విషాదం.... ఆవేదన.

నేను మాత్రం ఏం చేస్తున్నాను! అన్యాయం చేశాను.... సీతకి! న్యాయం చెయ్యాలి. ప్రేమించాలి. ఆనందంగా ఉంచాలి.

సీత గురించి నేను రవికాంత్‌కి ఏమీ చెప్పలేదు. చెప్ప దలుచుకోలేదు. నేను వచ్చేముందర రవికాంత్ అడిగాడు.

"నీ పెళ్ళి సడన్‌గా నిశ్చయమైందని రాశావు. నాకు రావటానికి వ్యవధి లేకపోయింది. నీ భార్య అందంగా ఉంటుందనుకుంటాను. మీరు హేపీగా ఉన్నారనుకుంటాను."

"ఆ. అంతా అనుకోకుండా అయిపోయింది. తెలిసినవాళ్ళు ఈ సంబంధం చెప్తే చూడటానికి వెళ్ళాను. ఒక్కడినే! అమ్మాయి చూడగానే నచ్చింది. వాళ్ళ నాన్నగారికోసం ఎవరో వచ్చారనుకుని కాఫీ తెచ్చింది. షల్వార్, కమీజ్ వేసుకుంది. ఒక జడ! పైపై మెరుగులు లేవు. కాఫీ ఇస్తూ నవ్వింది. కళ్ళలో అమాయకత్వం, తెలివి కనిపించాయి. మేము మాట్లాడుతుండగానే తండ్రికి గుండెలో నొప్పి వచ్చింది.... హార్ట్ ఎటాక్. వెంటనే సీతా నేనూ కలిసి ఆయన్ని హాస్పిటల్‌కి తీసికెళ్ళాము. ఆయన నా చేయి పట్టుకుని

"సీత పెళ్ళి నిర్లక్ష్యంచేసి నేను చాలా పొరపాటు చేశాను. నువ్వు నాకు నచ్చావు. నువ్వు సీతని పెళ్ళి చేసుకుంటే నేను చాలా సంతోషిస్తాను. నిశ్చింతగా కన్నుమూస్తాను" అన్నాడు.

నేను వెంటనే ప్రామిస్ చేశాను, పెళ్ళి చేసుకుంటానని. ఆయన రెండు వారాల్లో కోలుకున్నాడు. మా పెళ్ళయిపోయింది."

రవికాంత్ సరదాగా నవ్వేస్తూ

"ఐతే నీ పెళ్ళిలో చాలా డ్రామా ఉందన్నమాట!" అన్నాడు.

ఈ సృష్టి అంతా చేసి ఆఖరిగా స్త్రీని సృష్టించాడు భగవంతుడు. పురుషుణ్ణి నియమించడానికే! స్త్రీయేగనక లేకపోతే ఈ భూమిమీద పురుషుడు జంతువుగానే మిగిలి ఉండేవాడు అంటాడొక రచయిత.

"స్త్రీ పురుషులలో స్త్రీజాతి బలహీనమైనదంటారు. నిజానికి స్త్రీయే ఉత్తమమైన సృష్టి. సహనం, సౌశీల్యం, త్యాగం, అవగాహన మూర్తీభవించిన వ్యక్తిత్వం స్త్రీది!" అంటారు గాంధీజీ.

కానీ ఈనాడు స్త్రీ సహనం వదిలేసింది.

ఎందుకు త్యాగంచెయ్యాలి? అని ప్రశ్నిస్తోంది.

ఆనాడు సహనం వహించినా, ఈనాడు అసహనం ప్రదర్శించినా ఈ భూమిమీద జీవితం ఆనందంగా ఉండాలనే!

సుఖవంతమైన సహచర్యం కోసమే!

ఓ స్త్రీ! ఈ పోరాటంలో నువ్వు దిగజారిపోకు. అక్కడే నిలబడు. నువ్వు ఒంటరివి కాదు. నీకు నేను సహకరిస్తాను.

జీవితానందంకోసం ఏమైనా చేస్తాను.

పురుష జాతినంతటినీ షేల్కొల్పాలని నాలో షరికొత్త ఆరాటం!"

* * *

గేటు తీసుకుని లోపలికి వెళ్ళేటప్పటికి డ్రాయింగ్‌రూమ్‌లో సీత ఎవరితోనో మాట్లాడుతూ ఉంది.

సీత సోఫాలో కూర్చుని ఉంది.

అతడు దగ్గరలోనే నిలబడి ఉన్నాడు. చేతిలో ఏభై రూపాయల నోటు ఉంది. కార్డ్రాయ్ పేంట్, టింటెడ్ గ్లాసెస్ ...రిచ్‌గా ఉన్నాడు.

నన్ను చూడగానే సీత లేచి నిలబడింది. తల ఒంచుకుంది. కళ్ళు వాలిపోయాయి. శరీరం కంపిస్తోంది. నన్ను చూసి భయ పడుతోంది.

"నమస్కారమండి!" అన్నాడతడు.

నాకేమౌతోంది! బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్.

రక్తంలో కరుణ విరిగి ద్వేషం ఎక్కిపోతోంది.

ఎవరు ఈ ఆపరేషన్ చేస్తున్నది? ఆపండి....ఆపండి....

"నువ్వు కూర్చో సీతా! నమస్కారం. మే ఐ నో యువర్ నేమ్ ప్లీజ్. మీరు సీతకి స్నేహితులా? బంధువులా?" అన్నాను

అతడు కొంచెం అతిగా నవ్వుతూ

"ఏమీకానండి! మీ పొరుగింటివాణ్ణి." అన్నాడు.

పొరుగింటివాడా! ఎప్పుడూ చూడనేలేదు.

"మనం ఎప్పుడూ కలుసుకోలేదు సార్. మీ పనిమనిషి మా ఇంట్లో కూడా చేస్తోంది. నేను నిన్న ఆఫీసులో ఉండగా మా ఆవిడ కళ్ళు తిరిగి పడిపోయింది. సీతగారు వెంటనే వచ్చి ఆవిడని హాస్పిటల్‌కి తీసికెళ్ళారు. డాక్టర్ ఫీజూ అవీ.. ఏభై రూపాయలయింది. అది ఇచ్చి బాకీ తీర్చుకుంటున్నాను." అన్నాడు. నేను మీ అందరి బాకీ తీర్చుకోగలనా! నన్ను నేను క్షమించుకోగలనా! రవికాంత్‌తో ఏమన్నాను! ఒకవేళ తిరుగు తోందే అనుకో. చవటలాగ వదిలేసి ఊరుకుంటావా? క్షమించ లేవా? ప్రేమించలేవా? నీవైపు తిప్పుకోలేవా? అన్నాను.

నేనేం చేస్తున్నాను?

ఏ తప్పూ చెయ్యకుండానే సీతని....సీత ఎదురుతిరిగితే?

"వస్తానండి...." అతడు వెళ్ళిపోయాడు.

"కూచో సీతా! ఇక్కడ కాదు. బెడ్‌రూమ్‌లోకి రా!"

నా వెనకాల వచ్చింది సీత. నా పక్కన కూర్చోబెట్టు కున్నాను.

"అట్లాగ చూడకు సీతా! నేను పులిని కాదు. ఇన్నాళ్ళూ నిన్ను బాధపెట్టిన మాట నిజమే. అనుమానాలతో వేగిపోతూ నా గుండెని వధ్యశిలగా చేసుకున్నాను. ఎదురుగుండా గిన్నెలో అమృతం ఉన్నా తాగలేని వెధవలుంటారు ఈ లోకంలో! వాళ్ళలో ఒకడిని అయిపోయాను...."

సీత నా భుజంమీద ఆనుకుని ఏడుస్తోంది.

"ఏడవకు సీతా! ఇంక నిన్ను ఏడవనియ్యను." సీత కన్నీళ్ళు తుడిచాను.

"నాకు తెలుసు మీ బాధ. కానీ నేనేం చెయ్యను! నేను ఏ తప్పూ చెయ్యలేదని చెప్పటం ఎలా....ఏ తప్పూ లేకుండానే!"

"ఏది ఎక్కువైనా ఉక్కిరిబిక్కిరి అవుతాం సీతా! నాకు ప్రేమ కావాలి. నువ్వు నన్ను ప్రేమించటంలేదని భయం. ఎవరినో ప్రేమించి ఉంటావని అనుమానం."

"నాకు పెళ్ళికి ముందరే ప్రేమించటాలూ అవీ....ఇష్టం లేదు. నా ఫ్రెండ్ అరుణ ప్రేమించింది. రెండేళ్ళు అతడితో తిరిగింది, చివరికి తల్లిదండ్రులు కుదిర్చిన పెళ్ళి చేసుకుంది. అతడు విషం తాగాడు. ఎట్లాగో బ్రతికించారు. ఇప్పటిదాకా పెళ్ళి చేసుకోలేదు. పెళ్ళి, ప్రేమ ఒకచోటే ఉండాలి!" అంది సీత.

"ఇప్పటిదాకా మనం మనసులు విప్పి మాట్లాడుకోలేక పోయాం. ఈ ప్రపంచంలో అన్నీ ఉన్నాయి సీతా! అమృతం-విషం, దేవతలు-రాక్షసులు, పూలూ-ముళ్ళూ. మనం ఏది వెతు క్కుంటే అది దొరుకుతుంది. ఎంత వింత సృష్టి! చివరికి నాకు అమృతం దొరికింది!"

సీత నా కళ్ళలోకి చూస్తూ నవ్వింది.

ఆ కళ్ళలో ఇప్పుడు బాధ లేదు. సంతోషం వెలిగించే దీపాల వెలుగు ఉంది. కోరికలు వర్షించే రత్నాల రాసులున్నాయి.

కీ॥ శే॥ కే. యస్. కోదండరామయ్య

# నన్నయభట్టు - ఆంధ్ర భారత రచన

## రాజరాజు ఆనతికి నన్నయ రంగమును సిద్ధము చేసిన వైనము

(గత సంచిక తరువాయి)

**రాజేంద్రచోళుడు రాజరాజును చూడకుండుటకు కారణము–**

రాజేంద్ర చోళుడు సింహాసనమునకు వచ్చినప్పటి నుండి యెడతెగని యుద్ధకార్యములందే నిమగ్నుడై యుండెనని తెలియుచున్నది. ఈ విషయమును కీ. శే. శ్రీ కే. ఏ. నీలకంఠ శాస్త్రిగారిట్లు విశదపరచియున్నారు.

"....విలెర్న్ అప్ టు ది థర్డ్ ఇయర్ ఆఫ్ హిజ్ రీయిన్ హి హాడ్ కాంక్వర్డ్ ఇడితురైనాడు, బనవాసె (వనవాసి)... కొత్తిప్పాక్కై అండ్ మన్నైక్కడక్కన్. ది కాన్క్వెస్ట్ ఆఫ్ ది హోల్ ఆఫ్ ఇలమండేమ్(సిలోన్) ఈజ్ ది నెక్స్ట్ అచ్చీవ్‌మెంట్... విమేబి ష్యూర్ దెట్ ది వార్. అగెన్స్ట్ ది సిలోన్ వాజ్ అండర్‌టేకన్ ఇన్ ది ఫిఫ్త్ ఇయర్ ఏ. డి. 1017-18 ... ఇది సిక్స్త్ ఇయర్ ఏ. డి. 1018, రాజేంద్ర సీజ్డ్ ది హేర్‌లూమ్ ఆఫ్ ది కేరళా మానార్క్..." [వైడ్. ది చోళాస్. పి. పి. 199, 200]

ఇట్లు రాజేంద్ర చోళుడు సింహాసనమునకు వచ్చినప్పటి నుండి 1018-19 వరకు యుద్ధములు చేయుట యందే గడిపెను. క్రీ. శ. 1020 లో రాజరాజు రాజ్యమును పోగొట్టుకొని తన్ను సహాయము వేడగా, తన దండనాథుడైన చోళియ వఱకును వేంగి రాజ్యమునకు బంపెను పిదప క్రీ. శ. 1022 వ సంవత్సరమున చోళరాజు స్వయముగా రాజమహేంద్రపురమునకు వచ్చి అల్లునకు బట్టాభిషేకము చేయుటయేకాక పిల్లనిచ్చి పెండ్లి చేసెను. ఇట్లు రాజేంద్రుడు యీ పెద్దకాలము తన యల్లుని చూడలేదని తెలియుచున్నది.

కావున రాజ రాజనరేంద్రుడు క్రీ. శ. 1011వ సంవత్సరము నుండి 1032 వరకు తన తెలుగు రాజధాని యందే యుండి, నన్నయగారి పర్యవేక్షణ క్రింద విద్యాబుద్ధులు నేర్చెనని దృఢముగా జెప్పవచ్చును, మరియు నమ్మవచ్చును.

రాజరాజు పట్టాభిషేకము శ 944 సింహ భాద్రపద 2 గురువారము (క్రీ. శ. 16-8-1022) నాడు రాజ మహేంద్రవరములో చోళ సామ్రాజ్య చక్రవర్తి సమక్షమున నెంతో వైభవముగ జరిగెను. రాజరాజు పట్టాభిషేకము సంప్రదాయాను సారముగ జరుగవలసిన వైదిక క్రియలన్నింటిని బేతన భట్టు సహాయముతో నన్నయ భట్టారకుడు కుల బ్రాహ్మణుడు గావున శాస్త్రోక్తముగాను,చక్కగాను, వైభవముగాను జరిపించెనని చెప్పవచ్చును. చోళ దండనాథుడు దెచ్చి యుండిన పవిత్ర గంగా సలిలములతోను, గోదావరి తెలుగు జలములతోను నన్నయ రాజరాజును అభిషేకించి, రత్నాభరణ భూషితుని జేసి ప్రాజ్య వేంగీ చాళుక్య భవ్య సింహాసనముపై గూర్చుండబెట్టి, చోళ సార్వభౌముడు రాజరాజు మస్తకమున కిరీటమునలంకరించగా నన్నయ పట్టాభిషేకోత్సవమును విజృంభణముగా జరిపించెనని చెప్పవచ్చును. తన ప్రియ శిష్యుడు, తన యందనన్యమైన భక్తి తాత్పర్యములు గలవాడు, చాళుక్య వంశ శిఖామణి, రాజమనోహరుడు, సరస్వతీ విలసన్ముఖాంభోజుడు, నవయౌవన విలసితుడగు రాజరాజు సింహాసనము నలంకరించియుండగా జూచి, నన్నయ యెనలేని సంతోషమును బొందియుంటాడు, ఇట్లు నన్నయ రాజరాజును విద్యావినయ సంపన్నునిగను, జేయుటయే కాక పట్టాభిషిక్తునిగ గూడ జేసెను.

రాజరాజు కడు బాల్యము నుండియు తెలుగు దేశమున, తెలుగు రాజధానిలో, తెలుగు పిల్లవాండ్రతో నాటలాడి పెరిగి పెద్దవాడై తెలుగు పెద్దల పరిచయమును గడించి, తెలుగు మరియు

సంస్కృత పండితుల, కవుల మధ్య మెలగి, తెలుగు సాహిత్యపు లోతుపాతులను గ్రహించి, తెలుగు పలుకుల నిసర్గ మాధుర్యమును గ్రోలి ఆనందించినందునే, తన కొఱకు, తన ప్రజల కొరకు పంచమ వేదమనబడిన వ్యాస భారతమును, నన్నయగారిచే దెనుగున వ్రాయించెను. నన్నయవంటి రసజ్ఞుడు, సమయజ్ఞుడగు మహాకవి రాజరాజునకు గురువుగా, రక్షకుడుగా లభించుట, మహా సంస్కారవంతుడు, గుణవంతుడు, చతురుడు నగు రాజరాజు వంటి రాకుమారుడు శిష్యుడుగా నన్నయగారికి లభించుట దైవ విలాసము, తెలుగు ప్రజల తరతరాల పుణ్యముల పంట.

ఇచ్చట ఒక ముఖ్య విషయమును గురించి చెప్పవలసి యున్నది. అది రాజరాజు పట్టాభిషేకమును గురించినది. ఆ పట్టాభిషేకమెవ్వరు చేసిరను విషయమున చరిత్ర కారులలో అభిప్రాయభేదము లున్నవి. కీ. శే. శ్రీ నీలకంఠశాస్త్రిగారు రాజేంద్ర చోళుడు స్వయముగా రాజమహేంద్రవరమందుండి పట్టాభిషేకము జేయించెనని చెప్పియున్నారు. ఈ విషయము నిదివరకే వెనుకటి పుటలలో చెప్పియున్నాను. కీ. శే. శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారు సయితమీ యభిప్రాయమునే గలిగియున్నారు. వీరిట్లు చెప్పియున్నారు. "విమలాదిత్యుని మరణానంతరము రాజరాజ నరేంద్రుని వశ్యమైన సింహాసనము నధిష్టింపనీయక నడ్డుపడిన ప్రతిపక్షియెవ్వడో రాజ్యమునాక్రమించు కొన్నది నిశ్చయము. చోళ సైన్యములు వచ్చి వాని నోడించి తఱుము వరకు రాజరాజ నరేంద్రునకు రాజ్యము స్వాధీనము గాదాయెను. ...చోడియవరసు దేశమును వశపఱచుకొనిన పిమ్మట రాజేంద్ర చోళ చక్రవర్తి స్వయముగ రాజమహేంద్రవరమునను సరించి శ. 944. సింహ. బ. 2 గురువారమునాడు రాజరాజు నరేంద్రుని పట్టాభిషేక మహోత్సవమును గావించెను. రాజరాజు సుగుణ సంపత్తిని విని, సంతసించి రాజేంద్ర చోళుడు, తన కుమారిత నిచ్చి, యాతని కుద్వాహము జేసెను... [చూ. పల్లవులు-చాళుక్యులు. పు. 381].

ఇంత వ్రాసి, శ్రీ రమణయ్యగారు తమపై యభిప్రాయమును మరల నిట్లు చెప్పియున్నారు. "తమ మేనల్లుడగు రాజరాజనరేంద్రుని వేంగీ రాజ్యమున బునఃప్రతిష్ఠ సేయుటకు రాజేంద్రచోళుడు 943 లో నొక సైన్యమును చోడియ వరసుని యాధిపత్యము క్రింద నంపి యుండుట చేతను, రాజరాజ నరేంద్రుని పట్టాభిషేకము రాజేంద్ర చోళుని గోదావర్యాగమన కాలమున నడచియుండుటచేతను, రాజేంద్ర చోళుడు, రాజరాజును వేంగీ రాజ్యమున నభిషిక్తునిగ జేయుటకే గోదావరీ తీరమునకు, అనగా రాజమహేంద్ర పురమునకు బయనము జేసెననుట యొప్పను... "

[చూ. పై గ్రంథము — అథోజ్ఞప్తిక]

కాని, శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారీ విషయమున భిన్నాభిప్రాయమును గలిగియున్నారు. వారు రెండు అభిప్రాయములను వ్యక్తపరచియున్నారు. 1) రాజరాజు శత్రువులను తానొక్కడే జయించెననియు బిమ్మట పట్టాభిషేకము జేసికొనెననియు, రాజేంద్ర చోళుడు వచ్చి పట్టాభిషేకము చేయలేదనియు 2) పట్టాభిషేకము జరిగిన పిదప రాజరాజు సుగుణ సంపత్తిని 'విని' రాజేంద్ర చోళుడతనికి గుమార్తెనిచ్చి బెండ్లి గావించెను. వారిట్లు చెప్పియున్నారు. "దాయాదులను జయించిన పిమ్మటగాని, రాజరాజు పట్టాభిషేకమును చేసికొనలేదు.... పట్టాభిషేకానంతరమే రాజరాజు అమ్మంగ దేవి నుద్వాహ మయ్యెను. ఆమె మధురాంతక దేవుడని ప్రసిద్ధ నామము గల రాజేంద్ర చోళ దేవుని ప్రియతనయ. ఆ వివాహము క్రీ. శ. 944 వ సంవత్సర మాఘఫాల్గుణములందు [క్రీ. శ. 1023 ఫిబ్రవరి] జరిగి నట్లూహింపవచ్చును. బేతనభట్టు తన యేలిక వివాహమును అర్థ గాంభీర్యము గల మాటలతో తెలిపియున్నాడు. రాజరాజ రాజ్యాభిషిక్తు డయినాడని 'విని' యాతని ఉన్నత వంశ వినయ త్యాగాది గుణములనుగాంచి, సుహృష్టుడయి, స్నేహముతోనా చాళుక్యాభరణునకు తన కుమార్తె అమ్మంగదేవి నిచ్చి బెండ్లి జేసి, అగ్ర మహిషిని జేసెనని బేతనభట్టు వ్రాసిన దానియందు, రాజేంద్రచోళుడు స్వయముగానే తెంచి, తన మేనల్లుని దుర్బలునొకనిని, నిస్సహాయుని, వేంగీ సింహాసనముపై గూర్చుండ బెట్టినట్లు స్ఫురించుటలేదు. రాజేంద్ర చోళుడు రాజరాజు సహాయము కొఱకు సేనలు పంపినట్లు చోళ శాసనములందు ధ్వని గూడ లేదు. కాని, సేనా సహాయము జేసి యుండుననుట సంశయింప నక్కరలేదు. కాని, వేంగి సామ్రాజ్యమును సమరాంగణమున రాజరాజు పలు విక్రమ శౌర్య సహాయములతో, స్వబలముతో జయించి, కొనినాడనుట నిస్సంశయము. ...రాజేంద్ర చోళుడు అమ్మంగదేవి నుద్వాహము గావించు తలంపుతో రాజమహేంద్రవరమున నిలిచి యుండును. ఆ వివాహము జరుగు నాటికి చోళ దండనాధులు కులూతొత్కల కళింగాధిపతులను జయించి భాగీరథీ జలములను గొనివచ్చిరి....

[చూ. రాజరాజ నరేంద్రుడు. పుట. 104].

శ్రీ భావరాజుగారి యీ రెండు యభిప్రాయములను గురించి కొంత బరిశీలించవలసి యున్నది. ముందు మొదటి అభిప్రాయమును బరిశీలింతము. రాజరాజును సింహాసనము నుండి వెడలగొట్టి దానినాక్రమించు కొన్నవాడాతని దాయాదియైన విజయాదిత్యుడు, ఇతనికి బశ్చిమ చాళుక్యులు, ఉత్కల మరియు కళింగదేశపు రాజులు దమ దమ సైన్యములతో దోడ్పడిరి, అంతటి గొప్ప శత్రు సైన్యములను యువకుడైన రాజరాజొక్కడే యెదిరించి ఓడించె ననుట యెంత మాత్రము విశ్వాసార్హమైనది కాదు. అంతటి బలపరాక్రమములే రాజ

రాజున కుండిన యెడల నాతడు చోళుల సహాయమును కోరవలసిన అవసరమేర్పడి యుండదు.

కావున, చోళ సైన్యముల సహాయముతోనే యాతడు శత్రువులను నిర్జించెననుటను అంగీకరింపక తప్పదు. తమ కేమీ యిష్టము లేకున్నను, శ్రీ భావరాజుగారే తుదకు "రాజేంద్ర చోళుడు రాజరాజు సహాయము కొఱకు సేనలనంపినట్లు చోళ శాసనములందు ధ్వనిగూడ లేదు. కాని, సేనా సహాయము జేసియుండె ననుటను సంశయింప బనిలేదు'' అని చెప్పియున్నారు కావున బ్రహ్మాండమైన చోళ సైన్యముల సహాయముతో రాజరాజు శత్రువులను జయించినది నిజమనుట ఋజువగుచున్నది.

ఈ విషయమును గురించి, కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారిట్లు వ్రాసియున్నారు. "రాజరాజు పట్టాభిషేకమునకు బూర్వము పెక్కు వైరులతో యుద్ధములు జేసినట్లును, ఆ యుద్ధములందు రాజరాజే జయమొందినట్లును భారతము నధ్యయనము జేసిన గాననగును.

ఏలయన నన్నయభట్టు ప్రయోగించిన సంబోధనముల వలన దెలియగలదు. వీనిని బట్టి రాజరాజునకు విరోధులైన భూనాథులు పెక్కుమంది యుండిరనియు, వారినెల్లర నీతడు జయించెననియు దేటబడగలదు. కాని, ఇందులకు శాసన ప్రమాణము గానరాదు."

[చూ. పట్టాభిషేక సంచిక పుట. 21]

కావున, రాజరాజు చోళ సైన్యముల దోడ్పాటుతోనే శత్రువులను జయించెనని స్పష్టముగా దేలినది. చోళ సైన్యాధిపతియైన చోడియవరను తోడ్పాటుతో రాజరాజు పట్టాభిషేకము గావించుకొనెనని నిస్సందేహముగా జెప్పవచ్చును. ఇట్లు మొదటి విషయము తెలిసినది.

ఇక భావరాజుగారి రెండవ యభిప్రాయమును బరిశీలింతము. రాజేంద్ర చోళుడు దానే స్వయముగా రాజమహేంద్రపరమునకు వచ్చి రాజరాజునకు పట్టాభిషేకము చేసినది నిజము కాదనుట. ఇంతవరకు పై పంక్తులలో విశదపఱచిన అంశముల నుండి, చోళ దండనాయకుని సహాయముతోనే రాజరాజు పట్టాభిషేకము జరిగినదని తేలినందున, అది రాజేంద్రచోళుడు వచ్చి స్వయముగా జేసినదికాదని విశదమైనది, ఆ సమయమున నాతడు తన రాజధానియైన తంజాపురమునందే యుండెను. ఈ విషయమును గురించి శ్రీ భావరాజుగారు మరియొకసారి యిటనిట్లు జెప్పినారు. "తిరువాలంగాడు, తిరుమల శాసనముల నెంత పరిశీలించినను, రాజేంద్రచోళుడు తన మేనల్లునకు, రాజమహేంద్రవరమున స్వయముగా పట్టాభిషేకము జరిపించుటకు బోయి యుండినట్లూహించుటకు యవకాశము గానిపింపదు. తన దండనాయకుని వీర కృత్యమును రాజేంద్రచోళుడు దన కృత్యములుగా బ్రకటించుకొని యుండును. అందు సంగతమేమియునులేదు.

[చూ. భారతి 1949 అక్టోబరు]

కావున కీ. శే. శ్రీ నీలకంఠ శాస్త్రిగారు మరియు శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగార్ల యభిప్రాయముల కంటెను, భావరాజుగారి యభిప్రాయమే సమంజసముగాను, విశ్వాసార్హముగాను నున్నదని జెప్పవచ్చును.

రాజరాజ నరేంద్రుని పట్టాభిషేకము ముగిసిన బిదప, చోడియవరను తంజాపురమునకే మరలిపోయెను. ఆ నగరమును జేరిన పిదప రాజేంద్ర చోళ చక్రవర్తిని సందర్శించి, రాజరాజు పట్టాభిషేకమును గురించియు, అతని సద్గుణగణములను గురించియు జెప్పియుంటాడు. ఆతడు చెప్పగా 'విని' ఆ చోళచక్రవర్తి సంతసించి, రాజరాజునకు కుమార్తె నిచ్చుటకు నిశ్చయించు కొనియుంటాడు. ఇది యిట్లు జరిగియుండుటయే సమంజసముగ నున్నది. అట్లుకాక, రాజేంద్రచోళుడు స్వయముగా రాజమహేంద్రవరమునకు వచ్చి రాజరాజునకు బట్టాభిషేకము జేసియుండిన పక్షమున, రాజరాజును గురించి చోడియవరను చెప్పవలసిన యవసర ముండియుండదు. సమస్తమును నాతడు స్వయముగా గాంచి తెలిసికొని యుంటాడు. ఇట్లయియుండిన యెడల కలిదిండి శాసన రచయిత "సత్కృత్వా" యని చెప్పియుండడు. చెప్పియుండినను నది యర్థరహితమై, చారిత్రిక సంభవమునకు విరుద్ధముగా నుండును. కాని, ఆ పండితుడు రాజరాజు పట్టాభిషేకమును, ఆనాటి పరిస్థితులను స్వయముగా జూచినవాడు గావున, యున్నదున్నట్లు జెప్పియున్నాడు. దీనినుండి రాజరాజు యొక్క ముఖ్య జీవిత ఘట్టమును దెలిసి కొనుటకు వీలైనది. ఇట్లు యదార్థ విషయమును జెప్పి భేతనభట్టు మనకు మహోపకార మొనర్చినాడు.

చోడియవరను రాజమహేంద్రవరము నుండి తంజాపురమును జేరుటకు, చోళ చక్రవర్తి పెండ్లిని నిశ్చయించుకొనుటకు, తన కుటుంబముతోనూ, పరివారముతోనూ, తగిన వస్తు వాహనములతోనూ తన రాజధాని నుండి బయలుదేరి రాజమహేంద్రవరమును జేరుటకు రాజేంద్రునకు గొన్ని నెలలు పట్టియుంటుంది. శ్రీ భావరాజుగారు అమ్మంగదేవి వివాహము శ. 944వ సంవత్సరము మాఘ ఫాల్గుణములందు (క్రీ. శ. 1023, ఫిబ్రవరి యందు) జరిగి యుండునని చెప్పియున్నారు. క్రీ. శ. 1022 ఆగస్టు 16వ తేదీ రాజరాజు పట్టాభిషేకము జరిగినది. అవల యించుమించుగ ఆరు నెలలకు అమ్మంగదేవి వివాహము జరిగినది. ఇట్లు జరిగియుండుట సమంజసముగానే యున్నది.

పై కలిదిండి శాసనములోని 'సత్కృత్వా' అను పదము నుండి రాజేంద్రచోళుడు సింహాసనాసీనుడైన క్రీ. శ. 1012వ సంవత్సరము

నుండి క్రీ. శ. 1022 వరకు తన మేనల్లుని చూడలేదనియు, యాతడును తన మేనమామను జూచియుండలేదనియు స్పష్టముగా నిరూపితమైనది. ఈ 10-11 సంవత్సరముల కాలములో, రాజరాజ నరేంద్రుడు తన రాజధానియందే యుండి నన్నయగారి పర్యవేక్షణ క్రింద విద్యాభ్యాసము గావించి, తెలుగు రాజుగా రూపొందెననుట నిక్కము.

ఇది యొక కడు సూక్ష్మమైన విషయము. పాఠక మహాశయులు కొంత ఓపికతోనూ, భావనా బలముతోనూ జదివిన పక్షమున విషయము బాగుగా గ్రాహ్యమగును. మరియు నెంతో సంతోషము గూడ గలుగును.

రాజరాజు పట్టభద్రుడైనను, నెమ్మదిగానుండుటకు వీలుగాదు. దాయాదియగు విజయాదిత్యుడు బశ్చిమ చాళుక్యులు, కళింగరాజులు మొదలగువారి తోడ్పాటుతో తఱచుగా అలజడులు గలిగించుచుండెను. అందువలన రాజ్యాధికార మెప్పుడు చేజారిపోవునో యను భీతి యాతని మనస్సును కలవర బెట్టుచుండెను. మాటమాటికిని చోళుల తోడ్పాటును గోరుచుండుట, వారిపై యాధారపడి యుండుట మొదలగు కారణముల వలన నాతడు నిర్భయముగ, రాజధానిలో నుండి పరిపాలనా కార్యములను నిర్వహించుటను, తనకతి ప్రియమైన విద్వత్సభా కార్యములందు ప్రౌఢుపుచ్చుటకును యవకాశము లభించ లేదు. రాజరాజు పట్టాభిషేకానంతర పరిస్థితిని శ్రీ నీలకంఠ శాస్త్రిగారిట్లు చెప్పియున్నారు.

"బట్ రాజరాజా వాజ్ సెల్‌దమ్ ఫ్రీ ఫ్రమ్ ట్రబుల్... హిస్ హాఫ్ బ్రదర్ విజయాదిత్య దో వాంక్విష్డ్ ఇన్ ఫైట్, నెవర్ గేవ్ అండ్ హిజ్ డిజైన్స్ అపాన్ ది థ్రోన్ అండ్ వాజ్ అన్‌సీజింగ్ ఇన్ హిస్ ఎఫర్ట్స్ టు బ్రింగ్ అబౌట్ హిజ్ డౌన్ ఫాలీ విల్ ది ఎయిడ్ ఆఫ్ ది వెస్టర్న్ చాళుక్యాస్ ...

[వైడ్. ది చోళాస్. పుట 210]

రాజరాజట్టి దుర్భర పరిస్థితులలో నుండినందున, నన్నయభట్టు మరికొంత కాలము మిన్నకుండ వలసివచ్చెను. దేనికిని కాలము కలసి రావలయును గదా!

తుదకు రాజరాజచోళులతోడి రాజకీయ సంబంధమును వీడి పశ్చిమ చాళుక్యుల నాశ్రయించి, వారికి సామంతుడుగ నేర్పడెను. ఆ చక్రవర్తుల కొన్ని బిరుదులను గూడ తానుంచుకొనెను. ఆ సమయమున చాళుక్యులు చోళుల కంటెను బలశాలురుగను, ప్రతాపవంతులుగను నుండిరని ఆనాటి శాసనముల నుండి తెలియుచున్నది. ఈ విషయము చోళుల చరిత్రము నుండి కూడ తెలియుచున్నది.

"...ఇన్ ఫ్యాక్ట్ ఇట్ వుడ్ సీమ్ దెట్ వెరి సూన్ రాజరాజ హాడ్ టు గివ్ అప్ హిజ్ డిపెండెన్స్ ఆన్ చోళా సపోర్ట్ అండ్ రీచ్ యాన్ అండర్‌స్టాండింగ్ విత్ సోమేశ్వర...."

[వైడ్. ఇబిడ్ పుట 225].

ఈ విషయమును శ్రీమాన్ ఎన్. వేంకట రమణయ్యగారిట్లు విశదపరచియున్నారు "ది రిపీటెడ్ ఫైల్యూర్స్ ఆఫ్ ది చోళా ఎంపరర్ టు ఫ్రీ వేంగీ ఫ్రమ్ ది వెస్టరన్ చాళుక్యన్ యోక్స్ సీమ్స్ టు హావ్ దిస్ ఇల్యూషన్డ్ రాజరాజ, హిజ్ ఓన్ హెల్ప్‌లెస్ నెస్ అండ్ ది ఇన్ ఎబిలిటీ ఆఫ్ ది చోళా ఎంపరర్ టు ఓవర్ త్రో హిస్ ఎనిమీస్ సీమ్ టు హావ్ బ్రాట్ అబౌట్ ఎ చేంజ్ ఇన్ హిజ్ ఆటిట్యూడ్. హి సా క్లియర్లీ దెట్ అండర్ ది సర్కమ్‌స్టెన్సస్ ఇట్ వాజ్ ఫ్యుటైల్ టు పెర్‌సిస్ట్ ఇన్ హిస్ అపోజిషన్ టు ది వెస్టర్న్ చాళుక్యాస్. హి మైట్ బై హిస్ పెర్‌సిస్టెంట్ హోస్టిలిటీ లూస్ హిజ్ కింగ్‌డమ్ కంప్లీట్లీ అండ్ ది చాన్సస్ ఆఫ్ రీగైనింగ్ ఇట్‌వాజ్ వెరి రిమోట్ ఇన్‌డీడ్. హి కన్‌సిడర్డ్ ఇట్ ఎక్స్‌పీడియంట్ టు కన్సిలియేట్ ది ఎనిమి అండ్ అబైడ్ హిజ్ టైమ్ అంటిల్ సర్కమ్‌స్టెన్సస్ బికేమ్ ఫేవరబుల్ టు త్రో ఔట్. రాజరాజా దేర్‌ఫోర్ ఓపన్డ్ నెగోషియన్స్ విత్ సోమేశ్వర I అండ్ కన్క్లూడెడ్ విత్ హిమ్ ఎ ట్రీటి, అకార్డింగ్ టు విచ్ హి వాజ్ అలోడ్ టు రూల్ హిస్ కింగ్‌డమ్ ఆన్ ఎ కండిషన్ దెట్ హి అక్నాలెజ్డ్ సోమేశ్వరాస్ సుప్రీమసీ అండ్ అక్సెప్టెడ్ హిమ్ యాజ్ హిజ్ ఓవర్‌లార్డ్. రాజరాజా అస్యూమ్డ్ సమ్ ఆఫ్ ది క్యారెక్టరెస్టిక్ వెస్టర్న్ చాళుక్యా టైటిల్స్ టు బీ టేకన్ హిస్ ఫ్రెండ్‌షిప్.

[వైడ్, ది ఈస్టర్న్ చాళుక్యాస్, పుట 236]

పశ్చిమ చాళుక్యులతోడి సమాధానము రాజరాజునకు బెక్కు మేళ్ళను సమకూర్చెను. అతనికి అరవులతోడి రాజకీయ సంబంధ మంతరించెను రాజ్యములో శాంతిభద్రతలు స్థిరముగా నెలకొనెను. పెద్దకాలము నుండి రాజకీయ కల్లోలాలతో సతమతమై యుండిన అతని మనస్సుకు ధైర్యము, నెమ్మది మరియు నిలకడ గలిగెను. అందువలన నతడు తన మనస్సును యుద్ధ కార్యముల నుండి సాహిత్య రంగమువైపు మరల్చెను.

ఈ విషయమును పూజ్యులు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారిట్లు విశదపరచియున్నారు. "అతడు ప్రశాంతముగా రాజ్యపాలనము కావించినప్పటి నుండియే ఈ సమయముననే యతడు స్వస్థ చిత్తముతో కావ్యగీత ప్రియుడై యానందమున కాలము బుచ్చుచూ, నన్నయచే భారతాంధ్రీకరణము చేయించియుండెనని బలువురు విమర్శకుల అభిప్రాయము." [చూ. వికాస లహరి, పుట 19].

ఈ కారణములవలన ఆనాటినుండి రాజరాజు జీవితము తేజోవంతము కాజొచ్చెను. నన్నయగారికి కాలము కలిసి రాసాగెను. ఆంధ్ర-కర్నాటకముల పరస్పర సంబంధము బలపడ సాగెను. తెలుగు సాహిత్య నందనోద్యానవనమున మధుమాసము ఆసన్నము కాజొచ్చెను. తెనుగులో భారతమును వ్రాయవలసి యుండు యవసరమును. ఆవశ్యకతను నన్నయ రాజరాజునకు చక్కగా విశదపఱచియుండెను. ఆతడును నా విషయమును గ్రహించియుండెను. భారతకథ ఆతని వంశకర్తలైన పాండు భూపతులది. దానిని వినుటయన్న యాతనికెంతో యాసక్తి. ఆ కథను జదివినను, విన్నను బుణ్యము గలుగును. అప్పటికే అది యరవభాషలోనూ, కన్నడమందును వ్రాయబడి ఆయా దేశములందు వ్యాప్తి జెందియుండెను. కాని, ఆ మహాగ్రంథము తన మాతృభాష, మరియు తన దేశభాషయగు దెనుగున వ్రాయ బడియుండలేదు. భారతకథ విశదముగ దెనుగు ప్రజలకు దెలియదు. అంతా గానట, బీసటగా గల్గిన విషయ పరిచయమే. తన ప్రజలకు భారతకథ దెలియవలయును. అది వేదవ్యాస మునీంద్రుడు రచించియుండిన భారతమున కనుగుణముగ నుండవలయును.

ఇంతేగాక, ఇమ్మడి యరికేసరి బంప మహాకవిచేత కన్నడమున భారతమును రచింపజేసియుండెను. అందువలన నతనికి మంచి కీర్తిప్రతిష్ఠలు గలిగియుండెను. అరికేసరి వేములవాడ చాళుక్య వంశమునకు జెందినవాడు, రాజరాజువలెనే ఆతడును చాళుక్యుడే. కాన, యా వంశమునకు జెందిన తాను గూడ భారతమును తెనుగున వ్రాయించి, ఆ రాజుకంటె ఎక్కువ కీర్తిని గడించవలయునను యాకాంక్ష యాతనికుండెను. అందుల కవసరమైన పట్టుదల గూడ రాజరాజు మనస్సున స్థిరముగా నెలకొనియుండెను.

ఈ విషయమును గురించి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారిట్లు చెప్పియున్నారు. రాజరాజ నరేంద్రుడు శైవుడు. భారత శ్రవణాసక్తి యెంత యున్నను, పంపభారతమందు "పార్వతీపతి పదాబ్జధ్యానము" లేదేయన్న కొఱత రాజరాజునకు దప్పకయుండును. కావున భారతమును వ్రాయించి తన కీర్తికి ఆయుపు బోసికొనెను. మరియు "దుర్గమార్గ జలగౌరవ భారత భారతీ సముద్రము"ను మథించి కీర్త్యమృత కలశమును బొంద వలెనను దాయాదులకు సహజమగు భావము గూడ యాతనికుండ లేదనుకొందము గదా? దీనితో రాజరాజ నరేంద్రుడు భట్టారకుని భారత రచనకు బురికొల్పెను...."

[చూ. కిన్నెర. 1953. పుట. 395]

నన్నయ భట్టే ఈ విషయముల నన్నిటిని ఆయా సందర్భములందతనికి జెప్పి, యాతని మనస్సును సిద్ధపరచి యుండవచ్చును ఈ మహాకార్యము రాజరాజున కత్యంత ప్రియ మైనది. ఆ గ్రంథరచన కన్ని విధములందును నన్నయభట్టారకుడే దగినవాడని ఆ రాజు తెల్సుకొనియుండును.

ఇట్లుండగా నారాజొక్కనాడు నిండుకొలువు దీర్చి, విద్వజ్జనులు బరివేష్టించియుండ, విద్యా విలాసగోష్ఠిలో సుఖోప విష్టుడై, ఇష్ట కథా వినోదంబులనుండి, తన కరుణారసపూరిత చూడ్కులను నన్నయగారిపై ప్రసరింపజేసి, యాతనితో

"కం॥ జననుత కృష్ణ ద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారతబ
ద్ధ నిరూపితార్థ మేర్పడ
దెనుగున రచియింపు మధికధీయుక్తి మెయిన్.

అని యానతిచ్చెను.

దీనినిబట్టి సంస్కృత భారతమును తెనుగులో నెట్లు వ్రాయవలయుననుటను వారిరువురు ముందే జక్కగా యాలోచించు కొనియుండిరనియు, ఒకనాటి నిండుసభలో రాజరాజు నన్నయగారి కిచ్చిన యనుమతి యాతని తుది యనుమతి యని జెప్పవచ్చును.

[ఇట్ వాజ్ ది ఫైనల్ పర్మిషన్ గివెన్ ఇన్ ది ఓపన్ లిటరరీ కోర్టు] అని అర్థము.

వీరిరువురు అసాధ్యులే. గురువును మించిన శిష్యుడు; శిష్యుని మించిన గురువు.

నన్నయ రాజరాజునకు తన యంగీకారమును చెప్పుచు "విద్వజ్జనంబుల యనుగ్రహంబున" అని కూడ చెప్పినాడు. అనగా రాజానుమతితోను, విద్వజ్జనుల దయతోను నేను వ్రాసెద నని చెప్పెను. "విద్వజ్జనుల యనుగ్రహమున" అనుమాట ఆ సాహిత్య సభలోని పండితులను సంతోషపెట్టుటకు చెప్పిన మాటే కాని, వేరొకటి కాదు. తన కులబ్రాహ్మణుడు, గురువు, ఉభయ భాషా కావ్యరచనాభి శోభితుడగు నన్నయకు చాళుక్య కులా భరణుండు సరస్వతీ విలసన్ముఖాంభోజుడునగు రాజు భారతమును దెనుగున వ్రాయుమని ఆజ్ఞ యిచ్చుచుండగా, సభలోని పండితు లెట్లు యాక్షేపింపగలుగుదురు. రాజాజ్ఞను గాదనునంతటి ధైర్యము రాజాశ్రితులైన యా పండితుల కెట్లుండును. ఆ సమయమున నారాయణభట్టింకను రాజమహేంద్రవరమునకు వచ్చి యుండలేదు.

ఇట్లు నన్నయ తుట్టతుదకు భారత రచనకు రాజానుమతిని సంపాదించెను. ఆతడు సిద్ధపరచియుండవలసిన రెండు రంగములలో ముఖ్యమైన మొదటి రంగము చక్కగా కుదిరినది.

ఇచ్చట నొక విషయమును చెప్పవలసియున్నది. భారతమును తెనుగున వ్రాసెదనని నన్నయ అంగీకరించిన సమయమున ఆ సభయందుండిన బండితులు కొందఱాతనిని తీవ్రముగా నాక్షేపించియుందురనియు, నా సమయమున నారాయణభట్టు నన్నయ తోడ్పడి వారిని సమాధానపరచి, ప్రసన్నులగావించి, వారి యామోదముద్రను గడించి యిచ్చెనని కొందఱు బండితులు తలంచియున్నారు. కాని యిది విశ్వసింపదగినది కాదు. ఏలయన, భారతమును తెనుగున వ్రాయుమని చెప్పినది రాజు. కావున దానిని యాక్షేపించుటకు పండితులకు సాధ్యము కాదు. అంతేకాక, నిండుకొలువులో రాజరాజు, పండితులను, కవులను నుద్దేశించి చెప్పక, ఒక్క నన్నయ్యగారినే చూచి, ఆతనితోనే తన విద్యా విషయములను, తన సాహిత్యాభిరుచులను చెప్పెను. తక్కిన పండితులందరూరక వినుచుండిరి. రాజరాజు, నన్నపార్యుని జూచి యిట్లు చెప్పెను.

చం॥ విమలమతిం బురాణములు వాటి ననేకము లర్ధ ధర్మ శా
స్త్రములు తెఱంగెఱింగితి నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యములైన
యీశ్వరా
గమములయందు నిల్పితి బ్రకాశంబుగా హృదయంబు
భక్తితోన్.

ఈ పద్యమునందును, ఆ పిదపగల గొన్ని పద్యములందును రాజరాజు తన గుణగణములను గొప్పగా జెప్పుకొనియున్నాడు. నన్నయగారితో కాక, ఆతడు సభాసదులను జూచి చెప్పియుండిన యెడల అంత గొప్పగా జెప్పియుండుట చాలా సమంజసముగా నుండెడిదని తోచుచున్నది. వారికి తన విషయములను చెప్పినట్లుండును. ఇట్లు చెప్పి తుదకు భారత రచనకు నన్నయకు యానతి నిచ్చెనని చెప్పియుండిన పక్షమున నింకను చక్కగా నుండెడిది. కాని, అట్లు జరుగలేదు. ఆతడు నన్నపార్యునితోనే తన్ను గురించి, అన్ని విషయములను చెప్పియుండుటను గురించి యాలోచించిన పక్షమున రాజరాజు డంబముగ నాత్మస్తుతి చేసుకొనెనను భావము స్ఫురించుచున్నది. ఈ విషయమున నాకొకటి దోచుచున్నది. నన్నయ భట్టారకుడు, విద్యావిషయమున తనకు సల్పిన సహాయమునకు కృతజ్ఞతలు దెలియజేసి, కడపట భారతమును దెనిగింపుడని చెప్పియుండిన మాటలుగా గ్రహించుట సమంజసముగా నుండునని నాకు దోచుచున్నది. అప్పుడిట్లుండును. ఓ మహనీయమూర్తీ! మీ దయవలన బురాణములు వింటిని. అర్ధ ధర్మశాస్త్రముల తెఱంగెఱింగితిని.........నాకు భారతమునందలి అభిప్రాయము విన అభిలాష యున్నది. కాన, భారతమును దెనుగున రచియింపుడని చెప్పియుండునని వినయముతో చెప్పిన మాటలని దలంచుట సమంజసముగా నుండునని జెప్పవచ్చును గదా! ఇట్లు రాజరాజు వాక్యములు కృతజ్ఞతాసూచకములని దలంచకపోతే సమంజసము కాని యొక విషయము స్ఫురించును. నన్నయగారికా నిండుకొలువు నాటివరకు రాజరాజుయొక్క పై గుణము లొక్కటియు దెలియవనియు, ఆనాడే రాజు చెప్పగా వినెననియు దెలియుచున్నది. ఇది నిజమని నమ్మినయెడల నన్నపార్యుడా రాజు కులబ్రాహ్మణుడనియు మరియు ననురక్తుడనియు చెప్ప మాటల కర్థము లేకపోవును. అనురక్తుడైన కులబ్రాహ్మణునకు రాజరాజు గుణగణాలు, ఆతని విద్యాభ్యాసము, ఆతని సాహిత్యాభిరుచి మొదలగు విషయములు తెలియకపోవునా! తెలిసియుండిన పక్షమున రాజరాజాతనికి దన్ను గూర్చి యంత గొప్పగా చెప్పవలసినది యేల? పొగడకొనవలసినది యేల? కాన, రాజరాజు తన్ను గూర్చి చెప్పిన వాక్యములన్నియు నతడు నన్నయకు దెలియజేసిన కృతజ్ఞతాసూచకములే కాని, వేరుగావని చెప్పవలసియున్నది. ఇంతేకాక, నన్నయగారి విద్యా విషయములు, ఆతని ఉన్నత గుణములు, ఉభయభాషా కావ్యరచనాశక్తి మొదలగునవి రాజరాజునకు దెలిసియుండెనని భారతమునుండి తెలియుచున్నది. నన్నయను గురించి యిన్ని విషయములు రాజరాజునకు దెలిసియున్నపుడు రాజరాజు విద్యావివేకాది గుణములు నన్నయభట్టుకు దెలియకుండునా? కావున రాజరాజు తన్ను గురించి చెప్పిన గుణములను, కృతజ్ఞతను తెలియజేయునవిగా గ్రహించుట లెస్స. భారత రచనా విధానమును గురించి నన్నపార్యుడు ముందే యాలోచించి తేల్చుకొనియుండెనని పెక్కుమంది పండితులు సూచించియున్నారు. కీ. శే. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిట్లు చెప్పియున్నారు.

"ఇక్కావ్యంబు రచియించెదనని రాజరాజుతో నాత్మ నిశ్చయంబు జెప్పి భారతాంధ్రీకరణమునకు దొడంగె........."

[చూ. పట్టాభిషేక సంచిక. పు. 35]

ఆచార్య శ్రీ దివాకర్ల వారిట్లు చెప్పియున్నారు.
"ఇక్కావ్యంబు ననుటనుబట్టి తాను సంస్కృతములో నున్న దానిని దెనుగున కావ్యముగా సంతరించెనను భావము వ్యక్తమగుచున్నది."

[చూ. వికాస లహరి. పు. 22]

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

Amrutanjan Limited 



765

శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు కూడ యిట్లే చెప్పియున్నారు.

"అతడు ప్రదర్శించిన యనువాద స్వాతంత్ర్యమును, వినిపించిన సొంత గొంతును బరిశీలించినచో నాతడొక మహా కావ్యమును సృష్టిజేయుటకు సమగ్రమగు సామగ్రి గలవాడనుట తెల్లము." [మా. వ్యాసభారతము - నన్నయ పరిష్కారము]

ఇట్లు భారతము నొక రమణీయమైన కావ్యముగ వ్రాయుట కతడు సంసిద్ధుడుగ నుండెను.

నన్నయభట్టు భారతమును దెనుగున వ్రాయుటకుముందు చాముండికా విలాసము, చౌడేశ్వరీ విలాసము, ఇంద్రవిజయము, మరియు రాఘవాభ్యుదయమను గ్రంథములను దెనుగున వ్రాసి యుండెనని తెలియుచున్నది. "ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడ"నని యాతడు చెప్పియుండుటనుబట్టి నన్నయ సంస్కృత భాషయందుగూడ నొకటి, రెండు గ్రంథములు వ్రాసి యుండెనని తోచుచున్నది. రాజరాజు నన్నయగారి తెనుగు గ్రంథములనుగూడ చదివి, యవి హృదయరంజకములై యుండి నందుననే, యాతని తెనుగు కవితా సామర్ధ్యమును గ్రహించి యుండును. అందువల్లనే ఆతడు తెనుగున భారతమును వ్రాయుటకు నన్నయ తగినవాడని నిశ్చయించుకొని యుండెనని చెప్పవచ్చును. ఈ కారణమునుబట్టియే రాజరాజు విద్వత్సభలో నన్నయగారికి తన కృతజ్ఞతను చెప్పుచు తెనుగున భారతమును వ్రాయుడని ప్రార్థించెను.

సాహితీసమరాంగణ సార్వభౌముడైన కృష్ణరాయలు కూడ,

కం॥ భువన విజయాఖ్య సంస
ద్భవన స్థితసింహ పీఠ ప్రాజ్ఞుల గోష్ఠిన్,
గవితా మధురిమ డెందము
దవులన్ గొలువుండి సదయతన్ ననుబల్కెన్.

హితుడవు, చతుర వచోనిధివి, అతుల పురాణాగమేతిహాస కథార్థ స్మృతియుతుడవు. కావున భవచ్చతుర రచన కనుకూలంబుగ స్వారోచిషమను సంభవమరయ సమంచితముగ వినిపింపుమని చెప్పెను. సంస్కృత మార్కండేయ పురాణములోని కథను యథాతథముగ తెనుగున వ్రాయుమని రాయలు పెద్దనకు చెప్ప లేదు. స్వారోచిషమను సంభవకథ వినుట కింపుగానుండును. సరసమగు నీకావ్యరచన కనుకూలముగ నుండును. కావున నట్టి రసవంతమైన కథను రచియింపుమని ఆంధ్ర కవితాపితామహు డగు అల్లసాని పెద్దనకు, కవితాశ్రీలోలుడైన ఆ రాయ లాన తిచ్చెను. ఆ కవియు శిరీష కుసుమ పేశల సుధామయోక్తులతో మనుచరిత్రమును రచించెను. ఇచ్చటగూడ మనుచరిత్రను వ్రాయవలసిన విధానమును గురించి వారిరువురు అంతకుముందే చర్చించి నిశ్చయించుకొని యుండిరనియు, తుది యనుమతిని రాయలు భువనవిజయ సభాభవనమున పండితుల సమక్షమున పెద్దన కొసగెననియు దెలియుచున్నది.

రాజరాజ నరేంద్రుడు కూడ భారత రచనను గురించి, నన్నయగారితో ముందే యాలోచించుకొనియుండి ఒకనాటి విద్వత్సభలో యా కవీంద్రున కానతి యొసంగెను. నన్నపార్యుడు భారతమును రచించి పద్యవిద్య కాద్యుడయ్యెను. పెద్దన మను చరిత్రమును రచించి ప్రబంధవిద్య కాద్యుడయ్యెను. ఆ యిరువురు రాజులు మరియు నా యిరువురు కవులు మనకు జిరస్మరణీయులే.

ఆ కాలమున కృతులను రచియింపజేసి అంకితముగొని యానందించదలచిన రసజ్ఞులగు రాజులు తమకు నచ్చిన కవుల నిట్లే తమ యాస్థానములలో కవిపండితుల సమక్షమున ప్రార్థించి, వారికి గర్పూర తాంబూలంబుల నొసగి గౌరవించుటయు, ఆ మహాకవులుగూడ మహా ప్రసాదంబని సంతోషముతో నంగీకరించి కావ్యరచన సల్పుటయు జరుగుచుండెను.

భారత రచనావిధానమును గురించి వారిరువురు మొదటనే చర్చించి తీర్మానించుకొనకయుండిన పక్షమున రాజరాజు తన సభ లోని కవి, పండితుల నందరిని యుద్దేశించి, తన కోరికను జెప్పి యుండును. వారును తమ తమ యభిప్రాయములను జెప్పి యుందురు. తుదకా కార్యమున కర్తదెవ్వడనుట నిర్ణయమై యుండును. కాని, అట్టిదేదియు జరుగలేదు. తన యాస్థాన మందుండిన కవులు, పండితులు మొదలగువారి సమక్షమున భారతమును తెనుగున రచియింపుమని నన్నయగారితోనే చెప్ప వలయునని రాజరాజు నిశ్చయించుకొనియుండెను. అటులే చేసెను.

రాజానుమతి లభించిన పిదప నన్నయ తన కిష్టుడును, సహాధ్యాయుడునైయుండిన నారాయణభట్టు సహాయముతో భారతమును రచించెనని తెలియుచున్నది. ఈ నారాయణభట్టును గురించి యింకను బరిశోధించవలసియున్నది కావున, నా విషయ మును "నన్నయభట్టు-నారాయణభట్టు" యను వేరొక వ్యాసమున వ్రాయగలను.

బాల్యమునందు విద్యాభ్యాస కాలమునందే తెనుగున భారతమును వ్రాయవలయునను సంకల్పము నన్నయగారికి తోచినది. అది క్రమముగా వృద్ధిగాంచి తుదకు స్థిరరూపమును

గాంచెను. వ్రాయవలయునను కుతూహలము క్రమక్రమముగా వృద్ధిగాంచుతూ వచ్చెను. ఎంత గాఢమైన యభిలాష యున్నను, కాలము కలిసిరావలయును గదా? కలసిరానందున నతడు ఓపికతో దగిన సమయమునకై వేచియుండి పట్టుదలతో కృషిచేసి, ఆ రోజుననే తన సంకల్పమును కనుకూలునిగా దిద్దితీర్చియుంచుకొని కార్యసిద్ధి గాంచెను. తెనుగులో భారత రచన యాతని ఏకైక లక్ష్యము. ఆ లక్ష్యము నాతడు సాగించుకొనెను. నన్నయ భట్టు రాజరాజును తెనుగురాజుగా రూపొందించి, ప్రాచీనమైన, భవ్యమైన, వేంగీ చాళుక్య రాజ్యమునకు క్రొత్త ఊపిరి పోసి, అది మరల సుమారేబది యేళ్ళపాటు స్వతంత్ర తెలుగు రాజ్యముగా మనగలుగునట్లు చేసెను. మరియు ఖిలమైపోవుచుండిన తెలుగుభాషకు గట్టి పునాదులు వైచి తిక్కనాది మహాకవులకు మార్గదర్శకుడాయెను.

నన్నయగారి వ్యక్తిత్వము అద్భుతము. నిరుపమానము. ఆతడాంధ్రభాష కొనర్చిన మహత్తరమైన యుపకారమును గురించి, కీ.శే. శతఘంటము వేంకటరంగ శాస్త్రిగారిట్లు చెప్పియున్నారు. "నన్నయభట్టు లాక్షణికమై, రసవంతమై, భావానుగమమై, యర్థగంభీరమై, శ్రవణధుర్యమై, సమస్త విద్వాదరణీయమై యొప్పు గవిత్వంబు రచియించి, యాంధ్ర లోకమునకు మహోపకారమును గావించెను. ఆతడెంతటి పొగడ్తకైన యర్హుడే. అట్టి యనర్గళ కవిత్వరచన యాతనికే జెల్లు."

[చూ. ఉగాది సంచిక. **1911** - పుట. 39]

కీ.శే. కట్టమంచి రామలింగారెడ్డిగారిట్లు చెప్పియున్నారు.

"నన్నయగారి ప్రతిభ యసాధారణము. దానివంటి మూర్తిని సృష్టింపనేరికిని తరముగాదు. ఆతని శైలి మిక్కిలియు మనోహరము. అతయనన్యతుల్యము. దానివంటిది వేరొండులేదు...."

[చూ. పట్టాభిషేక సంచిక]

కీ॥శే॥ శ్రీ నండూరి బంగారయ్యగారిట్లు చెప్పియున్నారు.

"కొందరు మహాకవులు శబ్దసిద్ధులు. మరికొందరు అర్థసిద్ధులు. ఉభయసిద్ధులు యత్యల్ప సంఖ్యాకులు. అందులో నన్నయ యొకడు. ప్రసన్నకథా కవితార్థయుక్తిలో అర్థసిద్ధిని, అక్షర రమ్యతలో శబ్దసిద్ధిని ప్రతిజ్ఞ చేసుకొని ఉత్తీర్ణుడైనాడు. నాదమాధుర్యమును సిద్ధించుటలో నాతనిది నిరంకుశ ప్రజ్ఞ

[చూ. భారతి, **1953** జూలై]

కీ॥శే॥ శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు.

"భారతమువంటి ఉత్తమమైన సాహిత్యమును నా తెలుగు వారికి తంగేటిజున్ను చేసి, బంతివిందులు బెట్టెదనని నడుము గట్టిన ఆ వాగనుశాసనుడు మనకు ప్రథమారాధ్యుడు. ఆ మహాభాగుని శుభారంభముచేతనే తెనుగునకు భారతవర్షీయ భాషలలో భారతమును ప్రథమముగా నవతరింపజేసుకొన్న గౌరవము దక్కినది. భారతమును కావ్యముగా జదువు భాగ్యము తెనుగునాడు నోచినది. [చూ. భారతి, **1947**. సంపుటి. **24**, సంచిక. 4]

కీ.శే. ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు ఈ విధముగా జెప్పియున్నారు.

"నన్నయభట్టారకుడు వాగనుశాసనుడే కాక ఆంధ్రుల యావన్మహోదయమునకు స్థాపనాచార్యుడు. వేంగిదేశమున బుట్టిన పంపనివంటి మహాకవులు కన్నడములో తమ ప్రతిభను దాచుకోవలసివచ్చెను. బౌద్ధులయిన ఆంధ్రులెందరో తమ విజ్ఞాన దీపములను ఏ ప్రాకృత విద్యాలయములలోనో వెలిగించియుందురు. ఈ జాతీయ విపత్తు నతికట్టిన దిట్ట నన్నయ భట్టారకుడు ఆంధ్రుల జాతీయ సౌభాగ్యమును నిలువరించుటకు ఆదియందు సువర్ణపు ఖజానాను గట్టిన అక్షర రమ్యశిల్పి నన్నయ భట్టారకుడు. సూక్ష్మముగా బరిశీలించిన ఈ ప్రసన్న ధారాజీవమే ఆంధ్ర కవుల రచనలయందెల్ల ద్యోతకమగును."

[చూ. భారతి, **1934**. సంపుటి-**11**. సంచిక-**2**]

కీ.శే. శ్రీ హయగ్రీవ రావుగారిట్లు చెప్పియున్నారు.

"నన్నయభట్ట రెస్క్యూడ్ అండ్ రిస్టొరేటెడ్ ది ఏన్షియంట్ తెలుగు లాంగ్వేజ్ అండ్ లిటరేచర్ ఫ్రమ్ ది డెప్త్స్ ఆఫ్ ఒబిలివియన్ అండ్ గేవ్ ఇట్ ఎలాస్టింగ్ అండ్ కలర్‌ఫుల్ లైఫ్."

మహాకవి తిక్కననుండి చిన్నయసూరి వరకు, ఆ పిదప ఆంధ్ర సాహిత్యరంగములో మహా కీర్తిప్రతిష్ఠలు గడించిన మహాకవులు మరియు పండితులు అందరు నన్నయగారి రమణీయమైన కవితాశక్తిని హృదయపూర్వకముగా తనివితీరక స్తుతించియున్నారు. పూజ్యులు డా॥ దివాకర్లవారొక్క మాటలో "ఆయా శుభదినములలో నన్నయ ఆంధ్రభాష కొనరించిన సేవ యింతింతనరానిది." అని యెంతో సముచితముగా జెప్పియున్నారు."

నన్నయగారిని గురించిన కొందరు పండితుల విద్వారపు వ్రాతలు :

నన్నపార్యుడు తెనుగుభాషకు చేసిన మహోపకారమును స్మరించి, సంతసించి, తమ కృతజ్ఞతలను స్తుతులద్వారా,

ప్రశంసలద్వారా యెందరో మహాకవులు, పండితులు తరతరాల నుండి తెలియజేసియుండగా నొకరిద్దరా మహాకవిపట్ల పరమ కాఠిన్యమును వహించి, ద్వేషించి దూషించియుండుట యాతడు తెలుగువాడు కాడని హేళన చేసియుండుట, ఆతని కవిత్వమును హీనపరచి చెప్పియుండుట శోచనీయమేకాక దురదృష్టకరము.

అట్టివారిలో కీ. శే. శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులు ముఖ్యులు. నన్నయగురించి యెందుకంత హీనముగా వారు వ్రాసిరో ఆశ్చర్యముగ నున్నది. ఇందుకు కారణము వారు నన్నయ అరవవాడైయుండునని అనుకొనుట. పెక్కుచోట్ల నన్నయ అరవవాడని చెప్పినను, ఒకచోట నన్నయ కల్యాణనగర ప్రాంతాలనుండి వచ్చిన కర్ణాటుడై యుంటాడని చెప్పి యున్నారు. శ్రీనాథభట్టుకృత పల్నాటి వీరచరిత్రకు వ్రాసిన విపులమైన పీఠికలో వీరు నన్నయను పెక్కుచోట్ల పెక్కు విధములుగా దూషించియున్నారు.

నన్నయ యరవవాడను యభిప్రాయమెపుడీ పండితునకు గలిగెనో, అపుడే యాతనిపై అసూయ జనించినది. అసూయ ద్వేషానికి దారితీసినది. ద్వేషము దూషణకు కారణభూతమైనది. నన్నయపట్ల అసహ్యాము, ఆతని సంస్కృతాంధ్ర పాండిత్యము పట్ల సందేహము, అసంతృప్తి, ఆతనికి తెలుగు కవిత్వము రాదను మనస్తత్వము, ఆతని పదప్రయోగములమీద, వాక్యరచన మీద తీవ్రమగునట్టి ఖండనము వీరు చేశారు. నన్నయ భారత రచన అనుచితానువాదమని, వికారాలతో కలుషితముగా నున్నదని, ఆతని భారతము అధములైన యధికారులకు మాత్రమే యుప యుక్తమని, ఆతని పద్యములు మురికిలక్షణాలు గలిగియున్నవని యింకా యేమేమో చెప్పియున్నారు.

ఈ దోషములు మహాకవి తిక్కనకు, ప్రబంధ పరమేశ్వరునకు గనబడలేదా? నన్నయగారిని, ఆతని ఆంధ్రభారతమును గురించి తిక్కనగారు,

ఉ॥ ఆదరణీయసార వివిధార్థగతి స్ఫురణంబు గల్గి య
స్తా దశ పర్వనిర్వహణ సంభృతమై పెనుపొందియుండనం
దాది దొడంగి మూడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్.

అని యెంతో చక్కగా పొగడియున్నారు. ఈ మహాకవులకు నన్నయ భారతములో మంచి గుణములు గనబడెనే తప్ప దుర్గుణములు గనబడలేదు. ఈ యిరువురు కవులే కాక కేతన, శ్రీనాథుడు, పోతన, పెద్దన, సూరన మొదలగు కవులందరు నన్నయను తమ కృతులందు స్తుతించియేయున్నారు. వీరందరు తెలివితేటలు, విద్యావివేకములు, భాషాపాండిత్యము లేనివారని చెప్పనగునా? కాని, ఉమాకాంతముగారి అభిప్రాయములు నిజమని నమ్మినయెడల పై కవులందరు తెలివిలేనివారని, విద్యాపరిణతి లేనివారని చెప్పవలసివచ్చును. ఈ పండితుడు తుదకు తిక్కనను, శ్రీనాథకవిని, కృష్ణరాయలను కూడ వదలలేదు. వారిని కూడ నిర్దయగ విమర్శించియున్నారు. వీరు నన్నయగారిని గురించి చెప్పియుండు విషయములను పరిశీలించి చూతము.

1) నన్నయ అరవవాడై తంజావూరియందో లేక కాంచీ పురమందో యుండిన పక్షమున ఆతనికి నన్నయ యను పేరు గలుగుటకు వీలులేదు. ఈ పేరు గలవారా యరవదేశమున యా కాలమందుండలేదు. ఈ కాలమందు కూడ అరవవారు తమ పిల్లలకా పేరు పెట్టరు. నన్నయ యనునది కర్ణాటక దేశమునకు సంబంధించినది. కాన, విద్యాశేఖరుల పై యభిప్రాయము సరి గాదని తెలియుచున్నది.

2) నన్నయ అరవవాడై కాంచీపురమందుండిన యెడల, నారాయణభట్టు ఆతనికి సహాధ్యాయుడు మరియు మిత్రుడు నగుటకు సాధ్యముగాదు. అట్లు కావలసిన పక్షమున నారాయణభట్టును గూడ అరవవాడని చెప్పవలసి వచ్చును. కర్ణాటక దేశమందు కూడ అక్కడక్కడ వేద పాఠశాలలు, పెద్ద పెద్ద ఘటికాస్థానము లుండినవి. నారాయణభట్టు విద్యాభ్యాసమున కంతదూరము పోవలసిన యవసరముండలేదు. కావున నతడు అరవవాడు కాడు.

3) నారాయణభట్టు అరవవాడు కాడని తేలినందున యాతడు రాజమహేంద్రవరమునకు వచ్చి, భారత రచనయందు అరవవాడైన నన్నయకు దోడ్పడియుండడు.

4) నారాయణభట్టు యరవవాడని యనుటను వాదము కొఱకు యంగీకరించిన పక్షమున, ఆతడు పశ్చిమ చాళుక్యరాజుల ప్రతినిధిగ రాజమహేంద్రవరమున నుండుటకు వీలుండదు. ఇందులకు గారణము పశ్చిమ చాళుక్యులు చోళులకు ప్రబల విరోధులు. కావున కర్ణాటక చక్రవర్తి ఒక అరవ బ్రాహ్మణుని తన ప్రతినిధిగ రాజరాజు నాస్థానమునకు బంపియుండడు. పంపడు కూడ.

5) నన్నయ అరవవాడైయుండిన పక్షమున రాజరాజు చోళులతోడి రాజకీయ సంబంధమును విడనాడి, వారి శత్రువులతో రాజీ చేసుకొనుటయు, వారికి సామంతుడుగ నుండుటయు, వారి బిరుదములను తాను వహించుటయు జరిగియుండదు.

6) నన్నయ అరవవాడై యుండినయెడల రాజరాజు తెలుగురాజుగ రూపొందియుండడు. ఆతనికి తెలుగుపై మక్కువ

యేర్పడియుండదు. మరియు నాతడు తెనుగున భారతమును నన్నయచే వ్రాయించి, ఆ భాషను పోషించియుండడు.

7) ఇట్లేవిధముగ జూచినను, నన్నయ అరవవాడనుటకు వీలుకాదు. కాని నన్నయ ముమ్మాటికీ తెనుగువాడే.

ఇక, శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులు విషయముల సరిగా గ్రహించక నన్నయ అరవవాడని భ్రమించి తూలనాడియుండుట శోచనీయమే కాక తెలుగువారి దురదృష్టమని చెప్పవలసి యున్నది. ఇది ఆతని యొకవిధమగు బుద్ధిజాడ్య జనితోన్మాదమే.

ఇంతేకాక ఒక తమిళ విద్యావంతుడు శ్రీ ఉమాకాంతము గారి అభిప్రాయము నాధారముగ కొని కాబోలు నన్నయ అరవ కవియనియు, నతనికి తెలుగులో గూడ పాండిత్యముండినదనియు, నతడు చోళ రాజాంతఃపురమునుండి అమ్మంగదేవితో రాజ మహేంద్రవరమునకు అరణపు కవిగా వచ్చెననియు వ్రాసినట్లు తెలియుచున్నది. ఇది వేలు చూపిన హస్తము మ్రింగెనను సామెతవలెనున్నది. ఉమాకాంతముగారు నన్నయ అరవవాడుగ నుండునని మాత్రమే చెప్పగా, బై పండితుడు మరియొక మెట్టు పైకెక్కి అతడు అరవ యరణపు కవియనుచు నుడివెను.

నన్నయ పేరే యాతడరవవాడు కాడని సూచించుచుండగా, నతనిని యరవవాడని గట్టిగా జెప్పుటయు, నతనిని చోళరాజుల యాస్థానకవి యనుటయును, ఆతనిని అరణపు కవిగా రాజ మహేంద్రవరమునకు వచ్చెననుటయును వింత. విద్యాశేఖరులు చెప్పినది మొదటి వింతయగుచుండగా, నీ రెండవవారు చెప్పి యుండునది రెండవ వింతయగును.

ఇంతేకాక, తంజావూరునుండి వచ్చిన కవిని, తెలుగు సరిగారాని కవిని, రాజరాజు తెనుగున భారతమును వ్రాయుమని యెట్లు చెప్పును. మరియు ఆ నన్నయ రాజరాజు కులబ్రాహ్మణు డెట్లగును? తాను ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడని యెట్లు చెప్పుకొనును? అట్లయిన, ఆ యరవకవి వ్రాసిన తెనుగు గ్రంథము లేవేవి? ఒకవేళ ఆ కవి తాను అంతటి గొప్పవాడని ప్రగల్భములు చెప్పుకొనియున్నను, తాను తెనుగున భారతము రచియించెదనని రాజుతో చెప్పియున్నను, ఆ యాస్థానములోని కవులు, పండితులు సమ్మతించియుందురా? ఆక్షేపించియే యుందురు.

నన్నయ తెనుగు కవిత్వము దెలిసిన అరవకవియై యుండిన పక్షమున రెండు పర్వములను, అరణ్యపర్వములో కొంతభాగమును మాత్రమే వ్రాసి యంతటితో నాపివేయవలసిన పనియేమి? రాజరాజు మరణించిన పిదపగూడ అరవ భాషాభిమాని యైన కులోత్తుంగుని యాస్థానమందుండి భారతమును సంపూర్ణ ముగా దెనిగించియుండవచ్చును గదా? అట్లేదియు జరుగలేదు. కాన, నన్నయ అరవవాడు కాడనియు, ఆతడు అరణపు కవిగా రాజరాజు అంతఃపురమునకు రాలేదనియు గట్టిగ నిశ్చయించ వచ్చును.

నన్నయగారిని గురించి పై రెండు విధములగు వింత యభిప్రాయములే కాక, సుప్రసిద్ధాంధ్ర పండితులు కొందరు, నన్నయ బాల్యమున అరవదేశమందుండు కాంచీపురమునకేగి, యచ్చట విద్యాభ్యాసముజేసెనని దలంచియున్నారు. తలంచుటయే గాదు. మీదుమిక్కిలి నమ్మియున్నారు కూడ. నమ్ముటయేగాక గ్రంథస్థము నొనర్చియున్నారు. ఇట్లు చెప్పుటకు ఏమి కారణ ముండవచ్చును? కాంచీపురము భారతదేశములోని సుప్రసిద్ధ ప్రాచీన మహానగరములలో నొకటి. అచట వేదాది విద్యల నభ్య సించుటకు బ్రహ్మాండమైన వసతులుండెను.

ఈ విషయమును గురించి కీ.శే. శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారిట్లు చెప్పియున్నారు.

"ఆ కాలమున కాంచీపురము బౌద్ధులకు మాత్రమే కాక బ్రాహ్మణులకును ముఖ్యస్థానముగా నుండెను. వేదవేదాంగ విదు లయిన బ్రాహ్మణోత్తము లనేకులు కాంచీపురమును జేరి, పల్లవ రాజుల పోషకత్వమున బరిషత్తులను, వేద విద్యాలయములను నెలకొల్పి, మతవ్యాప్తికై కృషిచేయుచు కృతార్థులగుచుండిరి...."

[చూ. ఆంధ్రుల చరిత్రము - పూర్వయుగము]

క్రీ.శ. మూడవ శతాబ్దమునుండి 9వ శతాబ్దము వరకు పల్లవ చక్రవర్తులకు కాంచీనగరము రాజధానిగా నుండెను. వారు వేదాది విద్యలను పోషించి, సంస్కృతభాషను చాలా యభివృద్ధిని గావించిరి. తొమ్మిదవ శతాబ్దమున వారి రాజ్యము జితికిపోయెను. అరవరాజులా రాజ్యమును యాక్రమించిరి. ఈ రాజులలో గొందరు కొంతకాలము కాంచీపురమునుండి పాలించిరి. వారికి ప్రధాన నగరము తంజాపురము. ఈ కాలమున కాంచీపురములో వేదపాఠశాలలు పల్లవుల కాలములోవలెనే ప్రసిద్ధి గాంచియుండె నేమో తెలియదు.

ఆ కాలమున సుదూర ప్రాంతమందు శ్రీరంగ పట్టణ రాజ్యములోనుండిన నంజనగుడి ప్రాంతమువాడైన నన్నయ స్వస్థలమును వీడి కాంచీపురమునకేగి, ఆ యరవసీమలో విద్యా భ్యాసము చేసెననుటను విశ్వసించుటకు సాధ్యము కాదు. ఆ

కాలమున నంజనగుడియందే యొక వేద పాఠశాల యుండెను. మరియు నా సమీపమందుండిన నగర్ల యను గ్రామమందు గూడ నొక వేదపాఠశాల యుండెను. ఆ పాఠశాలలలో నన్నయ మరియు నారాయణభట్టు సహాధ్యాయులుగ జదువుకొనియుంటారు. ఇది సహజమే కూడ.

కాని, క్రీ.శ. శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు నన్నయ మరియు నారాయణభట్టు బాల్యమందు కాంచీపురములో జదివి యుండిరని తమ "నారాయణభట్టు" అను గ్రంథమున మరల మరల జెప్పియున్నారు. వారే అదే గ్రంథమందు నారాయణభట్టు కర్ణాటక దేశీయుడని కూడ చెప్పియున్నారు. ఆతడు కర్ణాటక దేశీయుడైన పక్షమున నతని సహాధ్యాయుడైన నన్నయ గూడ ఆ దేశమునకు జెందినవాడేయనుట సూచితమగుచున్నది కదా? ఇట్లు వీరిరువురు కర్ణాటక దేశమునుండి, అంత దూర మందున్న కాంచీపురమున కెందులకు బోయిరో తెలియదు. దీనిని బట్టి కూడ వారిరువురొక ప్రాంతపువారని తెలియుచున్నది గదా?

శ్రీ శాస్త్రిగారే కాక పూజ్యులు, "సరస్వతీపుత్ర" బిరు దాంకితులగు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు కూడ నన్నయ భట్టారకుని విద్యాభ్యాసము కాంచీనగరమందే జరిగియుండునను నభిప్రాయము గల్గియున్నట్లు తెలియుచున్నది. శ్రీ ఆచార్యుల వారికా యభిప్రాయము గలుగుటకు రెండు కారణములున్నట్లు తోచుచున్నది. ఒకటి పూతలపట్టు శ్రీరాములుగారా అభిప్రాయ మును ఆచార్యులతో బలుమార్లు నొక్కిచెప్పియుండుట. రెండవది ఇళంగో అడిగళ్ అను తమిళ మహాకవి ఆ భాషలో "శిలప్పధి కారము" అను గ్రంథమును వ్రాసెను. ఈ మహాకావ్యములోని కొన్ని భావాలు నన్నయభట్టు భారతములో నన్నట్లు ఆచార్యుల వారికి దోచుట, నన్నయగారికి శిలప్పధికారమును గురించి తెలిసి యుండెనో లేదో ఈనాడు ఆ విషయమును గురించి మనము చెప్పలేము. ఒకవేళ రాజరాజు యాస్థానమున కేతెంచుచుండిన తమిళ పండితులా గ్రంథములోని రమణీయ భావములను నన్నయ గారితో జెప్పియుండవచ్చును. భావములు రమణీయముగనుండి యవి నచ్చిన యెడల తరువాతి కవులుగూడ ఆలాటి భావములను తమ తమ రచనలలో జొప్పించి రచించియుందురు. ఇట్లగుట సహజమే.

శిలప్పధికారములోని రెండవ పదము "అధికారము" అనునది సంస్కృతపదమే. ఈ గ్రంథమును వ్రాసిన మహాకవి వాల్మీకి రామాయణమును చదివి, అందలి పురాణ దంపతులు, ఆదర్శ దంపతులయిన సీతారాముల దివ్యగాథచే ప్రభావితుడయి, తన కాలమునకు గొంత ముందు జరిగినదని చెప్పబడుచుండిన కోవలన్, కణ్ణకి దంపతుల సాధారణమైన యొక చిన్నకథను బ్రహ్మాండముగా బెంచి వ్రాసియున్నట్లు తమిళ పండితులు నిశ్చ యించియున్నారు. కావున, వాల్మీకి మహాముని కవితాప్రభావము శిలప్పధికారములో నుండునట్లు అనుకొని యాశ్చర్యము జెంద వలసిన పనిలేదు.

ఇంతేకాక, యెంత దూరమందున్నను, యే కాలమందున్నను మహాకవులు వ్యక్తపరచెడు భావములలో సమానత్వము గోచ రించుననుట ఎల్లరెరింగినదే. అందువలన పై కారణములను గొప్ప యాధారముగ దలంచి, నన్నయ కాంచీపురములో విద్య నభ్యసించెనని తలంచుట సముచితము కాదని మనవి చేయు చున్నాను

తెలుగు పెద్దలకొక మనవి. ప్రాచీన కాలమున శాతవాహ నాంధ్ర సార్వభౌములు మిక్కిలి సమర్థతతో దక్షిణాపథము నంతటను శతాబ్దాలకొలది పాలించినారు. ఆ రాజులు మగధ సామ్రాజ్యమును గూడ జయించి కొంతకాలము పాలించినారు. తమ యధికారము నంతటితో పరిమిత మొనర్చక నేపాళము వరకు కూడ వ్యాపింపజేసి పాలించినారు. శాతవాహన వంశము నకు జెందిన యొక రాజు పంజాబులో గూడ పరిపాలనము సాగించెనని యా దేశచరిత్రమునుండి దెలియుచున్నది. ఆంధ్ర రాజులు, "దక్షిణాపథమును" పెద్ద కాలము పాలించినందున నది "ఆంధ్రాపథ" మాయెను. ఆ కాలమునుండి, ఆంధ్రదేశము నుండీ ఈ కవులు, పండితులు, గణకారులు పలుప్రాంతాలకు బోయి తమ యాంధ్రత్వమును నిలుపుకొని వస్తున్నారు. కాన, ఆంధ్రములో గ్రంథములు వ్రాసిన వారక్కడక్కడ నుండిరి. ప్రస్తుతముగ యున్నారు. కవులు మరియు పండితులు నేటి సంకుచితమైన ఆంధ్రదేశమునకే పరిమితమైయుండవలయునని తలంచరాదు. ఎప్పుడో యొకప్పుడు ఆంధ్రదేశమునుండి వలస పోయి, కర్ణాటక రాజ్యములో స్థిరముగ నెలకొన్న తెలుగు కుటుంబాలానాడేకాదు, నేడు కూడ లక్షల కొలదిగ నున్నవి. వీరిలో నన్ని జాతులవారు కూడ నున్నారు. అట్లా ప్రాంతాలకు పోయి స్థిరపడిన వైదిక బ్రాహ్మణ కుటుంబమునకు జెందినవారిలో నన్నయ భట్టారకుడొకడు. భాషాద్వేషాలు ప్రబలి, భాషల నుద్ధరించకున్నను, విరోధములు పెంచుకొనుచుండు నేటివలె కాక, ఆ కాలమున వేదాధ్యయనము చేసిన, పెక్కు శాస్త్రములు దెలసిన తెనుగువారు మిక్కిలి గౌరవింపబడుచుండిరి. ఉదాహరణమునకు క్రీ.శ. 1600 నుండి 1950 వరకు మైసూరు దేశమును కీర్తి

ప్రతిష్ఠలతో పాలించిన "అరసుల"ను రాజకుటుంబమువారి పురోహితులు. వైదికమత కార్యములను నిర్వహించుచుండినవారు ఆంధ్ర వైదికబ్రాహ్మణులే. కావున, "మత్యహరాధిపాచార్యుడు" అని రాజరాజుచే పొగడబడి, ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడైన నన్నయభట్టు తెనుగు కవిశేఖరు డనుటలో సందేహ మిసుమంతయు లేదు.

నన్నపార్యుని భారతమందలి, యవతారికా భాగమును, ఆశ్వాసాది అంతమందు గల పద్య గద్యములను, మరియు నా కాలపు చోళ, వేంగీ, చాళుక్య, పశ్చిమ చాళుక్యరాజుల చరిత్రములను, నన్నయగారిని గురించియు, ఆతని భారతమును గురించియు గల గ్రంధములను జదువగా ఆ మహాకవి జీవిత చరిత్రకు సంబంధించిన విషయములను నాకు దోచినవానిని సాహసించి, ఆంధ్ర విద్వల్లోకము ముందుంచుచున్నాను. ఇందేవైనా మంచి విషయములు కొన్నియైనా యున్నవని. సహృదయులగు పాఠకులు దలంచిన నా ప్రయత్నము సార్థకమైనదని తృప్తినొందెదను.

ఇక నన్నయగారికి సంబంధించిన రెండు విషయములను గురించిన నా పరిశోధన వలన దేలిన యంశములను మనవి జేయవలసియున్నది. ఒకటి నన్నయ రాజరాజునకు కులబ్రాహ్మణుడనుట. రెండవది నారాయణభట్టును గురించినది. ఈ రెండింటిని గురించి త్వరలో వ్యాసరూపమున వ్రాయగలను.

**ఆధార గ్రంథములు :**


1) శ్రీమదాంధ్రభారతము (నన్నయగారిది)
2) రాజరాజ పట్టాభిషేక సంచిక
3) రాజరాజ నరేంద్రుడు - శ్రీ బి. వి. కృష్ణారావు
4) నారాయణభట్టు - కీ.శే. నోరి నరసింహశాస్త్రి
5) ఆంధ్ర వాఙ్మయ చరిత్ర-డా॥ దివాకర్ల వేంకటావధానిగారు
6) వ్యాసభారతము-నన్నయ పరిష్కారము - జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు.
7) భారతి - పాత సంచికలు.
8) పల్లవులు-చాళుక్యులు - డా॥ ఎన్. వేంకటరమణయ్యగారు
9) ఆంధ్రుల చరిత్రము - కీ.శే. చిలుకూరి వీరభద్రరావుగారు
10) ది హిస్టరీ ఆఫ్ ఈస్టర్న్ చాళుక్యాస్ — ఎన్. వెంకట రమణయ్యగారు.
11) మైసూరు గెజిటీర్స్- వాల్యూం - 2 పార్ట్ - 2 ఎన్. హయవదనరావు
12) పల్నాటి వీరచరిత్ర - పాఠనిర్ణేత - కీ.శే. శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులు
13) కిన్నెర - (మాసపత్రిక) 1953
14) ది చోళాస్ - కే. ఏ. నీలకంఠశాస్త్రి
15) రాజరాజు కలిదిండి తామ్రశాసనము, ఇంకను మరికొన్ని గ్రంథములు, పత్రికలు.


[అయిపోయింది]

# "కరుణ కాదంబ చక్కని శారదాంబ"

భూమి నా సొమ్మని గర్వపడెడి
భూస్వామిని చూచి
పంటవలతి పకపక నవ్వుతుంటుంది!
ధనం నా సొంతమని మురిసెడి
పిసినారిని చూచి
కలుముల జవరాలు వికవిక నవ్వుతుంటుంది!
జీవితం శాశ్వతమని భ్రమసెడి
మనిషిని చూచి
"చాల పెద్దమ్మ" కహకహ నవ్వుతుంటుంది!

వాణీ నారాణి అని చాటెడి
కవిబ్రహ్మను చూచి మాత్రం
పలుకుల వెలది పకపక నవ్వదు
వికవిక నవ్వదు, కహకహ నవ్వదు
కలకల నవ్వుతుంటుంది!
నెయ్యపుటులుకను చూపిస్తుంటుంది!
మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్ని
కట్నంగా యిచ్చి
అతనికి శ్రేయస్సును సమకూరుస్తుంటుంది!

శ్రీ కె. కిశోరుబాబు; శ్రీ కె. అశోకుబాబు

# విశ్వ సందేశం!

## డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

నీటి చుక్క లేక
ఎండిపోయిన చెరువులో
బలు రక్కసి పొదలు అపహాస్యం చేస్తూ!
ఎగుడు దిగుడుగా ఉన్న
గతానుభవాలను
అదేపనిగా నాగ జెముళ్లు వల్లె వేస్తూ!

దూరాన కొండలు
నున్నగ ఉన్నాయి!
ఆశను సన్నగా వినిపిస్తూ!!
నీలిమేఘాన బంగారు కాంతులు
మెరుస్తూ ఉన్నాయి!
భవిష్యత్తుపై భ్రమలు గొలుపుతూ!!

గమ్యమేదో తెలియదు కాని
సాగిపోతున్న కాలిబాట
కాలం!
అనంతానంతమైన కాలం!!

ఎడారిలో ఒంటరిగా
బితుకు బితుకు మంటున్న కొబ్బరిచెట్టులా!
వర్తమానం!
నీడకూడ ఇవ్వలేని సంవర్ధమానం!!

నెరలు చీలిన
బీడులలో
దారులు వెతుకున్న
ఆకలిచూపులు ఒకవైపు!
పిడికెడు బూడిదగా
పగిలిన కుండముక్కలే సాక్ష్యంగా
నూరేళ్ళనిండు బ్రతుకు మంటగలుస్తున్నప్పుడు
గుండెకోత ఒకవైపు!
ఎంతో ఆశతో పాదులు కడుతూ
విత్తనాన్ని నాటుతున్న మనోబలం ఒకవైపు
సంధిగ్ధంలో నిశ్శబ్ద నిర్నిద్ర సందోహంలో
బిగి సడలని పిడికెడు గుండెను జానెడు కడుపులో!
పూరిపాకలో దాచిపెడుతూ ఒకవైపు!

ఊరికి తూరుపున
బ్రతుకు చెరువుకు ఎగువన
శివాలయం!
సత్యమో అదిసుందరమో!

ఊరికి పడమట
మునుగుతున్న సూర్యుని ముంగిట
గత చరిత్ర నడిపిన సమాధులు!
కాలగర్భంలో కలసిన ఒకనాటి ఉగాదులు!

ఎముకల్ని పోగుచేస్తున్న
కాటికాపరి ముఖంలో అర్థంకాని
విచిత్రమైన ముభావం!

రాలిపడ్డ ఎండు గడ్డి పరకల్ని
ఎంతో ఆబతో తింటున్న బక్కఆవు కడుపులో తెలిసిరాని
అంతుబట్టని విశ్వదాహం!

ఒక్కక్షణం స్పందించిన
నా అంతరాత్మ
వాహ్యాళిలో ఏమిటి మీ పరధ్యానం
అన్న నా భార్య మాటతో ఉలిక్కిపడింది!

నన్ను దూసుకొంటూ
ఒక ఎర్రటి బస్సు

వేగంగా వెళ్లిందని కాస్తలో ప్రమాదం తప్పిందని
మనూ అన్నప్పుడు ఎవరో మూలిగినట్లు తోచింది!

పూర్తిగా చీకటి పడిందని అనుకొంటున్నంతలో
నీలికాంతుల నెలవంక రోచులీన సాగింది!
నిస్పృహలో నిట్టూర్చేలోగా శివాలయంలో
జాగృతి గుడిగంట మ్రోగసాగింది!

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

## మే - 1989

### మేషం (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్విని వారికి ఆదాయం బాగుండును. ఉద్యోగాభివృద్ధి కలుగును. ఆరోగ్యము బాగుండును. సంతానమునకు అన్ని విధాల అభివృద్ధి కలుగును. శుభకార్య ప్రయత్నములు ఫలించును. 20-31 తేదీల మధ్య శ్రమ, వేడిమి కలిగించును. ఆరోగ్యం బాగున్నా, ప్రతి చిన్న పనికి కించిత్ శ్రమ పడవలసి వచ్చును. విద్యార్థులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు అనుకూలమైన కాలము

భరణి వారికి పనికిమాలిన ఆలోచనలు హెచ్చుగా నుండును. మధ్యమధ్య శ్రమ, చిక్కులను కలిగించును శుభకార్య ప్రయత్నాలు ఫలించినట్లే అనిపించి వాయిదా పడును ఉద్యోగులకు మంచి అభివృద్ధి కలుగును. అయితే రావలసిన ప్రమోషను కొంతకాలంపట్టును. వర్తకులకు శ్రమతో కూడిన ఫలితం కొనసాగును అయితే ఈ నక్షత్రం గల వారందరికి గతం కన్న కొంత నయమని చెప్పవచ్చును.

కృత్తిక 1 పా. వారికి ధనము అనేక విధముల కలసివచ్చినను, అనుకొనని విధంగా వ్యయము జరుగును. కాని కించిత్ శ్రమను కలిగించును. ఆరోగ్యం బాగుండును. కావలసిన వారితో మాట పట్టింపులు వచ్చును. విద్యార్థులకు, వర్తకులకు, ఉద్యోగులకు, అన్నింటిలోను విజయం, లాభము, అభివృద్ధి కలుగును. మొత్తంమీద సర్వులకును మంచి అనుకూలప్రదంగా నుండును.

### వృషభం (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4 పా. వారికి అన్ని విధాల మేలు కలుగును. కాని కొన్నాళ్ళ వరకు మానసిక ఆందోళన కొనసాగును. శుభకార్య ప్రయత్నములు ఫలించినట్లే అనిపించి వాయిదా పడును. అతి వ్యయ ప్రయాసలతో పనులు నెరవేరుచుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు మొత్తం అన్ని వర్గాలవారికీ వారి వారి ప్రయత్నాలకు అనుకూల ఫలితాన్ని ఇయ్యగలవు.

రోహిణి వారికి నెలంతా శ్రమ, ఆందోళన, ధనవ్యయం జరుగును. ఆరోగ్యం సరిగా నుండదు. సంతానము యొక్క అభివృద్ధికి చాల వ్యయ ప్రయాసలను పొందవలసి వచ్చును. శుభకార్యాలకు గురించి అధికంగా ధన వ్యయం జరుగును. ప్రతి విషయంలోను అధైర్యం, పిరికితనం హెచ్చుగానుండును. ఉద్యోగులకు, విద్యార్థులకు సామాన్యముగా ఉండును. రాజకీయవాదులకు మేలు కలుగును.

మృగశిర 1, 2, పా. వారికి 10వ తేదీ వరకు శ్రమ, ధన వ్యయం జరుగును. ధనమునకు తొట్రుపాటు. ఆత్మీయులతో మాట పట్టింపులు కలుగును. మధ్య మధ్య శరీరంలో నలతచేసి నిమ్మళించును. తాత్కాలికంగా ఏర్పడిన శత్రువులవల్ల ఇబ్బందులు హెచ్చుగా నుండును. మనస్సునకు సరియైన స్థిమితం ఉండదు. పనికిమాలిన ఆలోచనలతో గడచును. మొత్తంమీద అధిక శ్రమ, అల్ప ఫలం కలుగును.

### మిథునం (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3పా)

మృగశిర 3, 4 పా. వారికి 10వ తేదీ వరకు మనశ్చాంచల్యముండును. సోదర వర్గం వారితో విరోధము కలుగును. ప్రతి వ్యవహారములోను త్రిప్పట, ధన వ్యయం, ప్రయాస తప్పదు. శుభ కార్యములకు ఆటంకము కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తక, కర్షక, కార్మిక వర్గాలకు కొంత సామాన్యముగా నుండును. వృత్తి వ్యాపారులకు సామాన్య స్థితి కలుగును.

ఆర్ద్ర వారికి 19వ తేదీవరకు శ్రమ, త్రిప్పట, ఉష్ణాధిక్యము జరుగును. మనస్సునకు తగినంత ఉత్సాహ ముండదు. అనుకొన్న పనులు సకాలంలో నెరవేరక వాయిదా పడుచుండును. నెల చివరి నుండి అనుకూల ఫలం కలుగును. అనుకూల వాతావరణ మేర్పడుతుంది. 6-13 తేదీల మధ్య సౌఖ్య భంగం, నలత కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, రాజకీయవాదులకు బాగుగా లాభించును.

పునర్వసు 1, 2, 3 పా. వారికి 27వ తేదీ వరకు మనోవైకల్యముడుంను. శ్రమ హెచ్చుగాను నుండును. అన్ని విషయములలో బాగున్నను, అసంతృప్తి హెచ్చుగా నుండును. హఠాత్తుగా జరిగిన చిన్న చిన్న సంఘటనలకు, మనఃక్లేశం, బంధుమిత్ర వ్యతిరేకత, ధనమునకు తొట్రుపాటు కలుగుచుండును. సోదరులతో మాట

పట్టింపులు వచ్చును. 20వ తేదీనుండి ఉష్ణాధిక్యం కలుగును, విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు అభివృద్ధి, లాభము కలుగును.

## కర్కాటకం (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4 పా. వారికి 27వ తేదీ వరకు మనో వైకల్యం కలిగించును. కావలసిన వారితో, ఆత్మీయులతో విరోధము కలుగును. తరచు ప్రయాణముల వలన శ్రమ కలిగినా, అన్ని విషయాలలో వ్యయంతోపాటు లాభం కలుగును. కళత్ర సంసార సౌఖ్యం బాగుగా నుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, శ్రామికవర్గాలకు అన్ని విధాల బాగుగానే ఉండును. 20వ తేదీ నుండి శరీరంలో వేడి హెచ్చుగా నుండును.

పుష్యమి వారికి శ్రమ హెచ్చుగా నుండును. పుణ్య ధర్మ కార్యములు నెరవేరును. శుభకార్యక్రమములలో పాల్గొనుట జరుగును. ఉద్యోగులకు బాగుగా కలసివచ్చును. కుటుంబ సంసార సౌఖ్యం కలుగును. అనుకొన్న పనులన్నీ సక్రమంగా నెరవేరిపోవుచుండును. విద్యార్థులకు, వర్తకులకు అన్ని విధాల మేలు కలుగును.

ఆశ్లేష వారికి శారీరక, మానసిక శ్రమ, పిరికితనం కలిగినా, అన్ని విధాల లాభము కలిసివచ్చి, సుఖ సంతోషాలు కలుగును. వివాహాది శుభకార్యములు జరుగును. సంఘంలో మంచి పలుకుబడి, పేరు ప్రఖ్యాతులు బాగుగా నుండును. వ్యవసాయదారులకు, రాజకీయ వాదులకు మంచి యోగదాయకమైన కాలము. ధనము అనేక విధముల కలసివచ్చును. 27వ తేదీ నుండి భాగ్యవృద్ధి యగును.

## సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1పా.)

మఖ వారికి అన్ని విధాల అనుకూలంగానే ఉండును. ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలుగును. కుటుంబ సంసార సౌఖ్యం, భార్యా పుత్రాది సౌఖ్యం బాగుగా నుండును. శుభకార్య ప్రయత్నాలు ఫలించును. ఆరోగ్యం బాగుండును. ధనము అనేక విధముల కలసి వచ్చును. విద్యార్థులకు, వర్తకులకు, కార్మికులకు మంచి అనుకూలమైన కాలము. 20వ తేదీనుండి అధిక వేడిమి కలుగును.

పుబ్బ వారికి యోగము బాగుగానే ఉన్నా, శరీర శ్రమ మాత్రం అధికంగానే ఉండును. సంతానమునకు నలత చేయును. ఉద్యోగ వ్యవహారములన్నీ అనుకూలంగా నుండును. శుభకార్యముల మూలకంగా ధనవ్యయం కలిగినా, సువర్ణ, వస్త్రాభరణ ప్రాప్తి, ధన సంపదల అభివృద్ధి కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు అన్ని విధాల మేలు కలుగును. పనికిమాలిన ఆలోచనలు హెచ్చుగా ఉండును.

ఉత్తర 1 పా. వారికి ఈ నెలంతా అన్ని విధముల బాగుగానే ఉండును. ఆరోగ్య వృద్ధి, కార్య విజయం, ధన లాభం కలుగును. ఉద్యోగులకు ప్రమోషను కలుగును. పదుగురిలో మాట గౌరవం, పలుకుబడి, పేరు ప్రఖ్యాతులు కలుగును. అన్ని రంగములలోని వారికి కార్య విజయం, ధన లాభం, వ్యవసాయ వ్యాపార రంగము లలోనున్న వారికి లాభం కలుగును. మొత్తంమీద అధిక శుభయోగ ఫలం కలుగును.

## కన్య (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2, 3, 4 పా. వారికి మొదటి వారంలో భార్యకు నలత, ధన వ్యయం కలుగును. రెండవవారం నుండి అన్ని విధాల అనుకూలంగా నుండును ధనాదాయం పెరుగును. కుటుంబంలో సుఖసంతోషాలు కలుగును. శుభ కార్యక్రమములలో పాల్గొనుట జరుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, కర్షక, కార్మిక, శ్రామిక వర్గాలకు అనుకూలత, అభివృద్ధి, లాభము మొదలగునవి జరుగును.

హస్త వారికి శుభప్రదంగానే ఉండును. శుభ కార్యములు ఫలించును. నిరుద్యోగులకు ఉద్యోగాభివృద్ధి కలుగును. ధనాదాయం కలుగును. కాని వ్యయం మాత్రం అధికంగా జరుగును. తలపెట్టిన పనులన్నీ సకాలంలో నెరవేరుచుండును. ఆర్థికంగా బాగుగా కలసి వచ్చును. మొత్తంమీద శ్రమను కలిగించినా, బాగుగానే గడచును.

చిత్ర 1, 2 పా వారికి శ్రమ హెచ్చుగా, ఫలితం తక్కువగా నుండును శ్రమ, త్రిప్పటా. ధనవ్యయం తప్పదు, సంతానమునకు నలతచేసి నిమ్మళించును. కుటుంబములో కలత. నలతలు హెచ్చుగా నుండును. ఏ పని తలపెట్టినను సకాలంలో జరుగవు. రాత్రింబగళ్ళు పనికిమాలిన ఆలోచనలు, ఊహలు, గాలిమేడలు కట్టుట జరుగు చుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు సామాన్యముగా నుండును. శ్రమ మాత్రం అధికంగా జరుగుచుండును.

## తుల (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా.)

చిత్ర 3, 4 పా. వారికి 10వ తేదీ వరకు భార్యకు నలతచేసి నిమ్మళించును. సోదరీ సోదర వర్గంతో విరోధము కలుగును. ధన

వ్యయం అధికంగా జరుగును. చేతికందవలసిన ఫలితం చేయిజారి పోవుట, కావలసినవారు నమ్మించి ద్రోహము చేయుట జరుగును. నిందలు, అపవాదులు భరించవలసి వచ్చును. ఏ విషయమందును ఉత్సాహముండదు. పనికిమాలిన ఆలోచనలు హెచ్చుగానుండును.

స్వాతి వారికి 5వ తేదీ వరకు సౌఖ్య భంగం కలుగును. అనుకొన్న పనులు సక్రమంగా నెరవేరుచుండును. కాని విశేష శ్రమ తప్పదు. అవసరములకు తగిన ధనము సమకూడి, గృహనిర్మాణం, వివాహాది శుభకార్యములు నెరవేరుచుండును. కాని కుటుంబంలో అప్పుడప్పుడు అశాంతి కలుగుచుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు అనుకూలమైన కాలము.

విశాఖ 1, 2, 3 పా. వారికి 27వ తేదీ వరకు మనోవైకల్య ముండును. ధన లాభం బాగుండును. కుటుంబంలో సుఖశాంతులు కలుగును. 6-13 తేదీల మధ్య స్వల్పంగా అశాంతి, భార్యకు నలత కలుగును. మానసికంగా కించిత్తు ఆందోళన కలిగించినా, వ్యవహార ములు సక్రమంగా జరిగిపోవును. శుభవ్యయం జరుగును.

## వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4 పా. వారికి భార్యకు స్వల్పంగా అనారోగ్యం, కొంత ధన వ్యయం కూడ కలుగును, సంతానమునకు నలతచేసి నిమ్మళించును. ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, రాజకీయ వాదులకు పూర్తిగా కాకపోయి నను కొంత అసంతృప్తికరముగానే ఫలముండును. మొత్తంమీద శుభాశుభ మిశ్రమ ఫలం కలుగును.

అనూరాధ వారికి శుభప్రదమైన కాలం, కాని శరీర శ్రమ హెచ్చు. ప్రతి విషయంలోను ఉత్సాహం కలుగును. పుణ్య ధర్మ కార్యక్రమములలో పాల్గొనుట జరుగును. అవసరములకు ధనము సమకూడి పనులు నెరవేరిపోవును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు మొత్తంమీద అన్ని రంగముల వారికి నానావిధ సుఖ సంతోషములతో, ధన లాభముతో, అభివృద్ధితో గడచును. శుభ గ్రహానుకూలత కలుగును.

జ్యేష్ఠ వారికి అన్నివిధాల శుభఫలం హెచ్చుగానే ఉండును. అనుకొన్న పనులన్నీ సక్రమంగా నెరవేరును. సంతానమునకు అన్ని విధాల అభివృద్ధి కల్గును. కుటుంబ సంసారసౌఖ్యం బాగుగానుండును. డాక్టర్లు, లాయర్లు, ఉపాధ్యాయులు, వర్తకులు మొదలగు వారందరికి, వారి వారి రంగములలో రాణింపు బాగుగాఉండి, విజయం, ధన లాభం, సంఘంలో మంచి పలుకుబడి, గౌరవం కలుగును. శుభకార్యానుకూలత కలుగును. కాని 19వ తేదీ వరకు శరీరంలో వేడిమి కలిగించును

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పా.)

మూల వారికి శారీరక - మానసిక శ్రమ కలిగించినా, ధన వ్యయం మాత్రం అధికంగా జరుగును. శుభ కార్యాదులకై వ్యయం జరుగును. ఏవో పనికిమాలిన ఆలోచనలు, ఊహలు కలుగుచుండును. ధనము మాత్రం ఏదో రూపంలో వచ్చుచుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, రాజకీయవాదులకు అనుకూలమైనకాలము. దైవభక్తి, సత్కర్మాచరణము, సద్గోష్ఠి జరుగును 20వ తేదీ నుండి ఉష్ణాధిక్యం కలిగించును.

పూర్వాషాఢ వారికి శారీరక - మానసిక శ్రమ హెచ్చుగా నుండును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకము కలుగును. ధన వ్యయం హెచ్చుగా జరుగును. బంధుమిత్రులతో అభిప్రాయ భేద ములు కలుగును. కుటుంబంలో మనస్పర్థలు కలుగును. ప్రతి విష యములోను ఆందోళన, పనికిమాలిన ఆలోచనలు, త్రిప్పట కలుగు చుండును. శ్రమ హెచ్చుగా నుండును. శనికి జపం చేయుట మంచిది.

ఉత్తరాషాఢ 1 పా. వారికి 13వ తేదీ వరకు శ్రమ కలుగును. ధన వ్యయం జరుగును శుభకార్య ప్రయత్నాలు నెరవేరును. కావల సిన వారితోను, భార్యావర్గము వారితోను మాట పట్టింపులు, విరోధము కలుగును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. తనకు సంబంధములేని పనులలో తలదూర్చి బాధపడును. శుభాశుభ మిశ్రమ ఫలం కలుగును. రాజకీయవాదులకు పదవీ గౌరవం కలుగును.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఉత్తరాషాఢ 2, 3, 4 పా వారికి శ్రమ హెచ్చు, బంధు మిత్రాదుల మూలకంగా ధన వ్యయం జరుగును. ప్రయాణములు ఫలించును. శుభకార్య ప్రయత్నములు కలసివచ్చును. సంసార సుఖం కలుగును. ఉద్యోగ వ్యవహారములు సాఫీగా కొనసాగును. ధనాదాయం పెరుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు అన్నివిధాల మేలు కలుగును. మొత్తంమీద నెలంతా బాగుగానేఉండును.

శ్రవణం వారికి శరీర శ్రమ హెచ్చు. పనికిమాలిన ఖర్చులు పెరుగును. అహర్నిశలూ మానసికంగా ప్రతి విషయంలోనూ

అనుమానాలు, ఎదుటి వారిమీద అకారణంగా ద్వేషం పెంచుకొనుట, ఎదుటివారిచే మాటపడి తనలో బాధపడుట జరుగును. వృత్తి ధర్మం చేత త్రిప్పట జరుగును. నూతన వస్తు సంపాదనము, సువర్ణ వస్త్రాభరణ ప్రాప్తి కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, అన్నివిధాల అనుకూలమైన కాలము.

ధనిష్ట 1, 2 పా. వారికి నెలంతా శ్రమ హెచ్చుగానుండును. బంధు విరోధం కలుగును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకము కలుగును. చిరాకు, మూర్ఖత్వం, పట్టుదల హెచ్చుగా నుండును. ధన వ్యయం అధికంగా జరుగును. మనస్సునకు సరియైన స్థిమితంఉండదు. అధైర్యం, పిరికితనం హెచ్చుగా నుండును. పనికిమాలిన ఆలోచనలు హెచ్చుగా నుండును. మొత్తంమీద శుభాశుభ మిశ్రమముగా నుండును.

## కుంభం (ధనిష్ట 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా)

ధనిష్ట 3, 4 పా. వారికి శుభకార్యములు ఫలించి వాయిదా పడును. ధన వ్యయం కలుగును. ప్రతి విషయంలోను అధైర్యం, పిరికితనం హెచ్చుగా నుండును. మనస్సునకు నిరుత్సాహము కలుగు చుండును. అనుకొన్న పనులన్నీ సకాలంలో నెరవేరక,ఎప్పటికప్పుడు వాయిదా పడుచుండును. విద్యార్థులకు, వర్తకులకు కొంత సామాన్యముగా నుండును.

శతభిషం వారికి 13వ తేదీ వరకు శారీరక శ్రమ కలిగించును. ఆరోగ్యం, ధన భాగ్యాది లాభం, సువర్ణ వస్త్రాభరణ ప్రాప్తి కలుగును. అన్ని రంగాలలోను, అన్ని వర్గములవారికి లాభదాయకంగాను, శుభప్రదంగా నుండును. ధనం బాగుగా కలసివచ్చును. సజ్జన సహవాసం కలిగి శాంతి కలిగించును. వృత్తి వ్యాపారాదుల్లో ఆర్థిక లాభం, పదుగురికి ఉపకారంచేసే అవకాశం కలుగును

పూర్వాభాద్ర 1, 2, 3 పా. వారికి 27వ తేదీ వరకు మనశ్చాంచల్యము ముండును. శరీరశ్రమ కలుగును. కుటుంబ సంసార సౌఖ్యం బాగుగా నుండును. ఆరోగ్యం చక్కగా నుండును. అవసరంలేని ఖర్చులు పెరుగును. అట్టి ఖర్చులవల్ల విచారంగాని, బాధగాని కలుగవు. విద్యార్థులకు పరీక్షలో అనుకూలత కలుగును. ఉద్యోగులకు, వర్తకులకు బాగుగా లాభించును.

## మీనం (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4 పా. వారికి 27వ తేదీవరకు శ్రమ హెచ్చుగా నుండును. భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. ధనవ్యయం జరుగును. ఆర్థికంగా తొట్రుపాటు కలుగును. ఆ విద్యార్థులకు, ఉద్యోగులకు మేలు కల్గును. రాజకీయవాదులకు విజయం కలుగును. వర్తకులకు బాగుగా లాభించును. పరమార్థ చింతనం, దైవభక్తి కలుగును.

ఉత్తరాభాద్ర వారికి శుభప్రదమైన కాలము. కుటుంబ సంసార సౌఖ్యం బాగుగానుండును. సంతానమునకు విద్యలలో బాగుగా రాణించుట జరుగును. నూతన వస్తులాభం, సువర్ణాది లాభం, భూ గృహాది సంపాదనం జరుగును. వర్తకులకు, ఉద్యోగులకు మొత్తం సర్వులకు సుఖసంతోషములు, లాభము కలుగును.

రేవతి వారికి 19వ తేదీ వరకు శ్రమ, వేడిమి కలుగును. ఉత్సాహం, ధైర్యం, ధనలాభం, కుటుంబంలో సుఖశాంతులు, మాట పలుకుబడి, గౌరవం బాగుగా నుండును. శుభ కార్యాదుల నిమిత్తము వ్యయం జరుగును. విద్యార్థులకు అనుకూలత కలుగును. డాక్టర్లు, లాయర్లు, రాజకీయవాదులకు హెచ్చుగా సుఖసంతోషాలు కలుగును. ఈ రాశి వారందరికి నెలంతా బాగుగా నుండును.

సిద్ధాంతి: **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**



# కలగూరగంప

## మన్నారు రంగాష్టకం

కందుకూరి రుద్రకవి జనార్దనాష్టకం రచించిన పిమ్మట దాని ప్రభావం చాలామంది కవులపై పడింది. అటువంటివారిలో ఈ కవి ఒకడు. ఆయన ఎవరో తెలిసిరాలేదు. ఇతడు రచించిన రాయపురి మన్నారు రంగాష్టకం నాకు ఒక ప్రాచీన తాళప్రతిలో అసంపూర్ణంగా ఆరు మాత్రం దొరికినవి. ఇవి రాయపుర మన్నారు రంగనిపై ఉన్నవి.

కవిగారివలెనే ఈ రాయపురి గూడ ఏదో తెలియదు. ఈనాడు మహబూబ్‌నగర్ జిల్లాలోని కలువకుర్తి తాలూకాలో బ్రహ్మరాయపురి ఉంది. దాన్నిపుడు బొమ్మరాసిపల్లె అంటున్నారు. అదే తాలూకాలో రాచూరుగూడా ఉంది. దానికి పూర్వపు దస్తరులలో రాయపురి అనే వ్యవహారమట. అక్కడ రంగనాయకాలయం గూడ ఉన్నదంటున్నారు.

అతనిపైన ఉన్న ఈ అష్టకాలు మనోహరంగా ఉన్నవి కాబట్టి పాఠకులెవరైనా ఈ కవిగారి వివరాలు, సంపూర్ణమైన అష్టకాలు ప్రయత్నించి తెలుపుతారని ఆశిస్తూ నాకు లభించినంత వరకు వానిని యిక్కడ యిస్తున్నాను.

.... .... .... .... .... .... .... .... ....

.... .... .... .... .... .... .... .. ....

ములుకుల్ జిల్కు వజీరుదేయ జిలుకల్
మలినుం జేయగనేలె, రాయపురి శ్రీమన్నారు రంగేశుడన్ 1

వగల మాటల కేమిపని నావంటి జవ్వనులెందరో
దగిలియుండగ నీవు నను మది దలతువెట్లే (కలీసిగా)
మిగులనాపై మరులు గల్గిన మీరలిటు గావింతురే
నగరె లోకులు రాయపురి మన్నారు రంగమనోహర! 2

కలనైనన్ నిను బాయజాలనని నేకాకోదరిన్ ముట్టెదన్
జలధిన్ జొచ్చెద నేల ముట్టెదను సంస్పర్శింతు సింగారమున్
వలదిట్లంటను యెంచి చూడగదవే వామాల లామాననున్
మలినుం జేయగనేల రాయపురి శ్రీమన్నారు రంగేశుడన్ 3

.... .... .... .... .... .... .... .... ....

మలికి సేతలు మానసంబున మానజాలవు నెప్పుడున్
కలికి పలుకులు విన్న నెమ్మది గరుగరే మృగలోచనల్
నలినలోచన రాయపురి మన్నారు రంగమనోహరా! 4

(5వ పద్యము అలభ్యము)

(నీకు మాయలు) సహజ గుణములు నిన్ను నమ్మగబోలునే
జోకనక్కరవేళ ముద్దుల సుద్దులాడగ నేరవే
చాకచక్యము నిన్నడుంగ వశంబె నీ బలుమాయలన్
నాకు నేలను రాయపురి మన్నారు రంగమనోహరా 6

తప్పుల్ జేసినవారి నేలుకొనుచే ధర్మజ్ఞులెవ్వందురే
యొప్పుల్ జేసినవారి గాచుకొనగా నుత్కృష్ట మౌనేధరన్
జెప్పంగానిది యేల నీవెరుగవే చిన్నారివే భర్తలన్ ........ 7

**కపిలవాయి లింగమూర్తి**

## "చత్వారివాక్"

వేదానికి నాలుగు అర్థాలున్నాయి ("చత్వారివాక్"), మనిషికి ఒకే అర్థం తెలుసునట! ఇదీ అనుమానమే అనుకోండి. నాలుగు సంఖ్య చాలా పవిత్రమైందీ, చిత్రమైంది కూడ. రెండుకు రెండు కూడితే నాలుగు. రెండును రెంటితో హెచ్చిస్తే కూడా నాలుగు. ఇట్లు సిద్ధించే అంకె మరి లేదు. నాలుగు అంకె వ్యాప్తిని తెలిపే ఉదాహరణాలు వినోద విజ్ఞానదాయకాలు.

- విష్ణువు ఆయుధాలు : సుదర్శనం (చక్రం), కౌమోదకి(గద), నందకం (కత్తి), శార్ఙ్గం (విల్లు). శంఖం ఆయుధంకాదు. యుద్ధంలో పెన్సలు కూడా ఆయుధమని చర్చిల్
- వేదములు : ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం
- పురుషార్థములు : ధర్మ, అర్థ, కామ, మోక్షములు
- ఆశ్రమాలు: బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసములు
- జీవితదశలు : బాల్య, కౌమార, యౌవన, వార్ధకములు
- వర్ణములు : బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, పంచమ వర్ణం లేదు.
- జాతి వర్ణములు : పసుపుపచ్చ (చైనా), గోధుమ(ఇండియా), శ్వేత (యూరోపు), నల్ల (నీగ్రో)

○ యుగములు : కృత, త్రేతా, ద్వాపర, కలి

○ దిక్కులు : తూర్పు, పడమర, దక్షిణ, ఉత్తరం

○ విద్యకు నాల్గు దశలు : 1) గ్రహణం, ధారణం, జ్ఞానం, ప్రయోగం 2) అధీతి, బోధ, ఆచరణ, ప్రచారం

○ ప్రాణులు : జరాయుజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములు

○ కరణులు : సంజీవ, విశల్య, సంధాన, సౌవర్ణకరణులు (ఔషధ విశేషాలు)

○ స్త్రీజాతులు : పద్మిని, హస్తిని, చిత్రిణి, శంఖిని.

○ పురుషజాతులు : భద్రుడు, దత్తుడు, కూచిమారుడు, పాంచాలుడు

○ చేతనావస్థలు : జాగ్రత్, సుషుప్తి, నిద్ర, తురీయం (మరణం లేదా సమాధి)

○ ఆదిశంకరుని శిష్యులు : సురేశ్వర, హస్తామలక, పద్మపాద, తోటక ఆచార్యులు

○ శంకరమఠాలు : శారద (శృంగేరి), గోవర్ధన (పూరి), జ్యోతి (కేదార), సరస్వతి (ద్వారక), కంచిలోని కామకోటి మఠంకూడ ఉన్నదంటారు.

○ సాహిత్యవృత్తులు : కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి.

○ జీవనవృత్తులు : కృషి, పాశుపాల్యం, వాణిజ్యం-పరిశ్రమ, సేవ.

○ వేదవ్యాస శిష్యులు : వైశంపాయన, జైమిని, సుమంత, పైల.

○ దశరథ పుత్రులు : రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు, వీరి భార్యలు : సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి (క్రమంగా)

○ దుష్టచతుష్టయం : దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని

○ యుద్ధములు : నాలుగు మైసూరు యుద్ధములు, నాలుగు మరాటా యుద్ధములు, నాలుగు అఫ్‌ఘన్ యుద్ధములు జరిగినవి. అన్నీ స్వదేశ పాలకులకూ ఇంగ్లీషు తూర్పిండియా సైనికులకూ జరిగినట్టివి.

○ నాలుగు హ్యూమరులు : ప్రాచీన అల్లోపతి వైద్యం ప్రకారం మన దేహంలో నాలుగు ద్రవాలున్నాయి అవి : రక్తం, కఫం, పిత్తం, నిర్వేదం. ఇవి సమపాళంగా ఉంటేనే ఆరోగ్యం. ఏది హెచ్చయినా తక్కువైనా అనారోగ్యం. ఇది ఆయుర్వేదపు త్రిదోష సిద్ధాంతాన్ని పోలుతుంది.

○ సైన్యభాగాలు : రథ, గజ, తురగ, పదాతి : ఇవి చతురంగములు

○ సమబలులు : భీమ, దుర్యోధన, జరాసంధ, కీచకులు.

○ తర్క ప్రమాణాలు : ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద

○ కావ్యరీతులు : వైదర్భి, గౌడి, పాంచాలి, లాటిక

○ కావ్యనాయకులు : ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంత

○ కావ్యవిమర్శకులు : అరోచకుడు (దేన్నీ మెచ్చుకోడు), సతృణాభ్యవహారి (అన్నిటినీ మెచ్చుకొంటాడు), మత్సరి (తప్పులెన్నువాడు), తత్వాభినివేశి (నిష్పక్షపాత సత్యాన్వేషి)

○ కావ్యరసోత్పత్తి : విభావ, అనుభావ, సంచారీభావ, వ్యభిచారీ భావాల వల్ల కావ్యరసం పుట్టుతుంది.

○ ఏసుక్రీస్తు కథ : నలుగురు వ్రాసిరి, వారు మాథ్యూ, మార్క్, లూక్, జాను అనే సంతులు.

○ మనిషికీ జంతువుకూ సమాన లక్షణాలు : ఆహార, నిద్ర, భయ, మైథునములు.

○ యోధుల విభజన : అతిరథ, మహారథ, సమరథ, అర్ధరథులు.

○ చీట్లపేక చిత్రవిధాలు : కళావర్, ఇస్పేటు, ఆటీను, డైమాను.

○ భగవంతుని భజించేవారు:ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని.

○ భౌతిక శక్తులు : భౌతిక ప్రపంచంలో నాల్గు శక్తులున్నాయి. అవి : గురుత్వం ("గ్రావిటీ") బలహీనశక్తులు ("వీక్ ఫోర్సెస్"), బలవచ్ఛక్తులు ("స్ట్రాంగ్‌ఫోర్సెస్") విద్యుదయస్కాంత శక్తులు ("ఎలక్ట్రో మాగ్నెటిక్ ఫోర్సెస్"), ఇప్పుడిపుడే పంచమశక్తి ("ఫిఫ్త్ ఫోర్స్") ఉన్నదని అనుమానిస్తున్నారు. ఇది గురుత్వశక్తికి అదనంగా పని చేస్తుందట.

○ నాలుగు ఎస్టేటులు : ఇంగ్లండులో రాజు, ప్రభుసభ, కామన్సు సభ అనే మూడు "ఎస్టేటు"లున్నాయి నాల్గవ "ఎస్టేటు" పత్రికలు. పత్రికలకు "నాల్గవ ఎస్టేటు" అనే హోదా వచ్చింది.

○ జంతు భేదములు : 1) భూచరములు, జలచరములు, ఉభయ చరములు, ఖేచరములు 2) ప్రాకేవి (పాము), నడచేవి (జంతువులు), ఈదేవి (చేపలు), ఎగిరేవి (పక్షులు)

○ నైతికతా ధోరణులు : నీతి, దుర్నీతి, నీతివ్యతిరేకత, అనీతి

- ఆర్థిక వికాసం : మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం, మానవ సంఘం బానిసత్వం, సామ్రాజ్యవాదం, పెట్టుబడి వ్యవస్థ, సోషలిజం అనే దశలలో పయనిస్తుంది.
- ఆర్థిక సంక్షోభం : 1942లో బెంగాలు కరవులో 40 లక్షల మంది ఆకలితో మరణించారనే విషయం "భూలీనై".
- ఆర్య సత్యములు : బుద్ధుడు నాలుగు సత్యములు చెప్పినాడు వీనిని ఆర్యసత్యములు అని అంటారు, అవి. 1) దుఃఖం అనేది వుంది. 2) దుఃఖానికి కారణాలున్నాయి. 3) దుఃఖాన్ని నివారించవచ్చును. 4) దుఃఖ నివారణ వలన నిర్వాణం కలుగుతుంది.
- పరమప్రాప్తికి సాధనాలు : సత్యం, సమ్యక్ జ్ఞానం, తపస్సు, బ్రహ్మచర్యం.
- గ్రంధనామాలు · "చార్ అధ్యాయ్" (టాగూరు), "ఫోర్ క్వార్టెట్స్" (టి. ఎస్. ఇలియట్) "చార్‌దర్వేష" కథలు, "అలీబాబా 40 దొంగలు".
- నిత్యజీవితంలో నాలుగు : నలుగురితో నారాయణ, నలుగురు నవ్విపోతారు, నాలుగురాళ్లు సంపాదించు, నాలుగు కాలాల పాటు వర్ధిల్లుట, నలుగురిలో తలెత్తుకొని తిరుగుట, నవ్వు నాలుగందాలచేటు, నలుగురు మెచ్చవలె, నలుగురేమను కుంటారో.

నలభై సంవత్సరాల వయస్సు తర్వాత వచ్చే దృష్టి లోపాన్ని "చత్వారం" అంటారు. దీనిని సవరించేందుకు వాడే సులోచనాలకు "చాళీసు" అని పేరు (హిందీలో "చాలీస్" అంటే నలభై) హైదరాబాదులో "చార్‌మీనార్" అనే 4 గోపురాల కట్టడం వుంది. గవర్నరులు అసెంబ్లీలను రాజ్యాంగ చౌకట్టు ("ఫోర్ కార్నర్స్ ఆఫ్ కాన్స్టిట్యూషన్") లోబడి రద్దు చేస్తుంటారు. జీవితం నలభై ఏండ్ల తర్వాత మొదలిడుతుంది అంటారు పాశ్చాత్యులు.

* తోక తునుక : బస్సులో ప్రక్కనే బీడీ త్రాగే ఆయనని "నాల్గు విధాలుగా వుండేదేమన్నా చెప్పప్పా" అని అడిగితిని. ఆయన "దానికేమి స్వామీ, బీడీ, సిగరెట్టు, చుట్ట, గుడు గుడు" అన్నాడు. అరే! ఇంత మంచి పాయింటు నాకు తట్ట లేదే అనుకొన్నాను.

సర్దేశాయి తిరుమలరావు

# షష్ఠే చత్వాం తథా కాలే

"షష్ఠే చత్వాం తథా కాలే ద్రౌపద్యుప గమిష్యతి" (ఆరవ కాలంలో ద్రౌపది నీ దగ్గరకు వస్తుంది.) ఇది మహాభారతంలో ఉద్యోగపర్వంలో కర్ణుణ్ణి కౌరవులనుంచి విడగొట్టి పాండవుల వైపు త్రిప్పడానికి ప్రయత్నిస్తూ కృష్ణుడతనితో అన్న మాటలు. నువ్వు కుంతి కొడుకువి కనుక పాండవులతో చేరుతే మహా వైభవంగా నువ్వే రాజవుతావు, పాండవులంతా నిన్ను సేవిస్తారు అనడమేకాక పై వాక్యం కూడా కృష్ణుడు అన్నాడు. ఈ మాటలలో అనౌచిత్యం స్ఫుటమే. దానిని చర్చించేముందు సరైన అర్థ నిర్ణయం చెయ్యాలి.

ఉపగమిష్యతి అన్న మాటలో ఉప అన్న ఉపసర్గపూర్వక మైన గమ్ అన్న క్రియ ప్రయుక్తమై ఉంది. దానికి సమీపించుట, పొందుట, అంగీకరించుట, మైథునమునకు చేరుట అన్న అర్థాలు సంస్కృత నిఘంటుకారులు సప్రమాణంగా ఇచ్చారు. కనుక పై వాక్యానికి అర్థం ద్రౌపది నిన్ను పర్యాయక్రమంలో ఆరవ భర్తగా స్వీకరిస్తుంది అనే అవుతుంది. అంతేతప్ప నీకు మంగళహారతి ఇవ్వడానికి వస్తుంది మొదలైన అర్థాలు కుదరవు.

అప్పటికి ద్రౌపది వయస్సు అరవై ప్రాంతం కదా, వివాహ ప్రస్తావం ఏమిటి అని సందేహించరాదు. అప్పటికి కొన్ని నెలల క్రితమే ఆమెపై మోహంతో కీచకుడు చచ్చాడు. డెబ్భైఏళ్ళు దాటిన అర్జునుడికి తన కూతురు ఉత్తరని పరిణయార్థం ఇస్తానని విరాటుడు అనగా దానికి సమ్మతించక అర్జునుడు ఆమెను కోడలుగా స్వీకరిస్తానంటాడు. వృద్ధుడు కాక యువకుడు అల్లుడుగా దొరుకుతున్నందుకు విరాటుడు సంతోషించక దానిని నిరాకరణావమానంగా గ్రహించి నేనిస్తానన్న పిల్లని నీవు ఏ కారణంచేత స్వీకరించవు? అని ప్రశ్నిస్తాడు. నేనామెకు గురువుని, కనుక పితృతుల్యుడిని. ప్రకాశంగానూ ఏకాంతం లోనూ నేనామెతో వాసంచేస్తూ కూతురుగా భావించాను, ఆమె నన్ను తండ్రివలె తలచింది. కనుక నేను కోడలుగా ఆమెను గ్రహిస్తానంటాడు అర్జునుడు.

మహాభారతంలో పాత్రల వయస్సులుగాని కొన్నిచోట్ల కాలంగాని సరిగా గణించలేము. ఉదాహరణకి శల్యుడు పడి నప్పటినుంచి గదాయుద్ధంవరకు ఎన్నెన్నో సన్నివేశాలు వర్ణిస్తూ ఇంకా అపరాహ్ణమే నడుస్తోందంటాడు కవి. యుద్ధ సన్నివేశాల మధ్యలో బలరామాగమనం, తీర్థయాత్రలు అదంతా చేర్చడం వలన అక్కడ కాలగణనం అయోమయమయింది. కనుక

అర్జునుడూ ద్రౌపదీ వృద్ధులు, వారికి వివాహ ప్రస్తావాలు వీలు లేవని అనలేం.

అందుచేత కృష్ణుడన్న వాక్యానికి అర్థం పైన చెప్పినదే అని అంగీకరించాలి. ఇక్కడ ముఖ్యంగా పరిశీలించవలసినది అసలా పంక్తి మహాభారతంలో ఉందా లేదా అని. సుప్రసిద్ధమైన గీతా ప్రెస్‌వారి మహాభారత ప్రతిలో ఆ పంక్తి లేదు. సుక్తంకర్ సంపాదకత్వంలో పూనాలో ప్రచురితమైన ప్రామాణిక ప్రతిలో ఆ పంక్తి ఉంది. ప్రామాణిక ప్రతి అంటే అనేక లిఖితప్రతులను పరిశీలించి ఎక్కువ ప్రతులలో ఉన్న శ్లోకాలనూ పాఠాలనూ గ్రహించి చేసినదన్నమాట. అంటే ఈ పంక్తి ఎక్కువ ప్రతులలో ఉందన్నమాట. మరి గీతాప్రెస్‌వారి ప్రతిలో ఎందుకు లేదు? అంటే వారు పరిశీలించిన ప్రతులలో కొన్నిటిలో లేనందువలననో, అర్థం అశ్లీలంగా ఉందనో, రెండు కారణాలవలననో వారు తమ ప్రతిలో చేర్చిఉండకపోవచ్చును. పూనా ప్రతిలో శ్లోకాలిట్లా ఉన్నాయి.

> "హిరణ్మయాంశ్చతే కుంభాన్రాజతాన్ పార్థివాం స్తథా
> ఓషధ్యః సర్వబీజాని సర్వరత్నాని వీరుధః
> రాజన్యా రాజకన్యాశ్చా ప్యానయన్త్వభిషేచనమ్
> షష్ఠే చత్వాం తథా కాలే ద్రౌపద్యుప గమిష్యతి
> అద్యత్వా మభిషించంతు చాతుర్వైద్యా ద్విజాతయః
> పురోహితః పాండవానాం వ్యాఘ్ర చర్మణ్య వస్థితమ్."
>
> (ఉద్యో, **138, 14-16**)

(బంగారు, వెండి, మట్టి కలశములు, ఓషధులు, అనేక ప్రకారములైన బీజములు, సమస్తవిధ రత్నములు, లతలు ఈ అభిషేక సామగ్రిని రాజులూ, రాజపుత్రులూ, రాజకన్యలూ తీసుకొని వచ్చుదురుగాక! ఆరవ కాలంలో ద్రౌపది నీ చెంత చేరుతుంది. చతుర్వేద పారంగతులైన బ్రాహ్మణులూ పాండవ పురోహితుడైన ధౌమ్యుడూ వ్యాఘ్రచర్మంపై కూర్చొనిఉన్న నిన్ను అభిషేకించుదురు గాక!)

ఈ శ్లోకాలలో అటూ ఇటూ అభిషేకం గురించి ఉండగా మధ్యలో షష్ఠకాలంలో ద్రౌపది నీవద్దకు వస్తుంది అనడం సందర్భరహితంగా ఉండటం గమనించవచ్చును. అంతేకాక ఈ అధ్యాయంలో ఇరవైమూడవ శ్లోకంలో మూడు పంక్తులుండడం వలన మొత్తం అధ్యాయంలో శ్లోకపంక్తులు బేసి సంఖ్యలో ఉన్నాయి, అవి సరిసంఖ్యలో ఉండాలి. వీటినిబట్టి ఈ అధ్యాయంలో ఒక పంక్తి చాలాకాలం క్రితమే ప్రక్షిప్తమయి ఉండవచ్చుననీ ఆ పంక్తి షష్ఠే చత్వాం అన్నదే కావచ్చుననీ ఊహించవచ్చును. ప్రతిపంక్తీ ఒక పూర్ణవాక్యంగా ఉంటున్నందువలన ప్రక్షిప్తపంక్తి అధ్యాయంలో ఎక్కడైనా ఉండవచ్చును.

ఈ వాక్యార్థంలోని అశ్లీలం స్ఫుటమే అయినా దానిని ఇంకా ఇట్లా నిరూపించవచ్చును. కృష్ణుడు హస్తినాపురం రాజకీయ కార్యక్రమంతో సంధి చెయ్యడానికి వెళ్ళాడా లేక ద్రౌపదికి ఇంకొక మొగుణ్ణి కుదర్చడానికి వెళ్ళాడా? ఒకవేళ కర్ణుడు ఒప్పుకొంటే ఏ మొహం పెట్టుకొని పాండవసభలో సంధి కుదర్చలేకపోయాను ఇది కుదిర్చాను అని చెబుతాడు?

విరాట నగరంలో అజ్ఞాతవాసం చెయ్యడానికి ద్రౌపదితో సహా పాండవులు చేరినప్పుడు ద్రౌపది సుదేష్ణతో నాకు ఐదుగురు భర్తలు, వారు నన్ను సదా రక్షిస్తూ ఉంటారు అని చెబుతుంది. ఇక్కడ మనకి సందేహం వస్తుంది. ఐదుగురు భర్తలు కలది, దేశంలో ప్రసిద్ధమైనది అప్పటికి ద్రౌపది. పాండవులు రాజ్యం పోగొట్టుకొని అడవులలో తిరుగుతున్నారని కూడా అందరికీ తెలుసును. అట్టి స్థితిలో తమ ఉనికి తెలిసిపోయే ప్రమాదం ఏర్పడేటట్లు నాకు ఐదుగురు భర్తలు అని సైరంధ్రిగా వెళ్ళిన ద్రౌపది ఎందుకు చెప్పాలి? నాకు ఒకడే భర్త అని ఆమె అసత్యం ఎందుకు చెప్పలేదు? దీనికి కారణం ఆమె పాతివ్రత్యమే తప్ప వేరొకటి కాదు. ఏ విధంగా ఒక భర్త కల ఇల్లాలు నాకు ఫలాని అతడు భర్త అని చెబుతుందో, నాకు భర్త లేదని కాని నాకు ఇద్దరు భర్తలనికాని ఎట్లా చెప్పదో; ఐదుగురు భర్తలున్న ద్రౌపది కూడా తనకు ఐదుగురు భర్తలనే అంటుంది తప్ప ఒకడనికాని నలుగురనికాని ఆరుగురనికాని అనదు. ద్రౌపది ఐదుగురిని పెళ్ళి చేసుకోవలసి వచ్చినపుడు ద్రుపదుడు ముందు ఒప్పుకోకపోయినా తర్వాత ఒప్పుకొన్నాడు. భీష్మ ద్రోణ విదురాది వృద్ధులెవరూ ఆక్షేపించలేదు, రాజులెవరూ తిరస్కరించలేదు. ద్రౌపదిని రాణిగా అందరూ అంగీకరించారు. ధర్మరాజు ద్రౌపదితో కూడి చేసిన రాజసూయానికి అందరూ వచ్చారు. కనుక పాండవుల సముదాయ వివాహం ఆ కాలానికి సంఘసమ్మతమైనదనే ఊహించాలి. ఆక్షేపించినవారల్లా దుర్యోధన దుశ్శాసన కర్ణులు మాత్రమే, అదీ ద్యూతసమయంలోనే. కనుక పతివ్రత అయిన ఇల్లాలు ద్రౌపదికి ఐదుగురు భర్తలు నియతమని తేలుతుంది. కనుక కృష్ణుడు కర్ణుణ్ణి ఆమెకు ఆరవభర్తగా సూచించడం అపచారం.

మహాభారతంలో ఎన్నెన్నో ప్రక్షిప్తాలూ మార్పులూ చేర్పులూ చేరిపోయాయి. వాటిని విడదీయలేం. ప్రసిద్ధమైన

భగవద్గీతలు ఏకరచన కావనీ, కొన్ని దశలలో రచింపబడినా యనీ విమర్శకులు అంటారు. కనుక ప్రస్తుతం మహాభారతంలో కనిపిస్తున్న ప్రతి వాక్యం వ్యాసప్రోక్తమని నమ్మడంకాని, దానికి అర్థం మన మతానికి విరుద్ధంగా ఉంటే బలవంతంగా అర్థాంతరాన్ని కల్పించడంకాని యుక్తంకాదు.

పై వాక్యం వ్యాసుడు రచించి ఉండకపోవచ్చును. చాలా కాలం క్రితమే ఎవరో వ్రాసి ప్రక్షిప్తం చేసిఉండవచ్చును.

శ్రీ కాళూరి హనుమంతరావు

# నలభై ఏండ్ల భారతి పాఠకుని అస్తమయం

ఆర్యా!

బ్రాంచి పోస్టుమేస్టరు ఉద్యోగంతోపాటు, పంచాయతీ గుమాస్తాగా ఉంటూ, పేరుకు పార్టుటైం ఉద్యోగమైనా, రోజంతా పనిచేసినా ఎంతోకొంత పని మిగిలిపోతూ ఉండే కరణీకపు వృత్తిలో ఏభైయేండ్లుగా వుంటూ, వూళ్ళోవాళ్ళకీ, చుట్టుపక్కల గ్రామాలవారికీ తలలో నాలుకలా వుంటూ, బహుకుటుంబీకుడై, మరోపక్క నిరంతరం బాధపెడ్తున్న ఉబ్బసవ్యాధితో ఉక్కిరిబిక్కిరవుతూ, అర్థరాత్రయినా, అపరాత్రయినా పనిమీద వచ్చినవారికి 'లేదని' చెప్పే అలవాటుకు అవకాశమీయక, నియమబద్ధంగా వుంటూ, నమ్మినదాన్ని ఆచరిస్తూ, కలుగజేసుకొన్న తీరికను సాహిత్య పఠనానికీ, రచనకూ వినియోగించిన విశిష్ట వ్యక్తిని గూర్చి వ్రాయాలనిపించి వ్రాస్తున్నాను.

నలభై ఏండ్లు క్రమం తప్పకుండా భారతిని చదివిన వ్యక్తి ఆయన. ఒకనెల భారతిని చూడటం ఆలస్యమైతే ఏదో వెలితిగా వున్నట్లు భావించేవారు. ఆ మధ్య భారతి ప్రచురణ కొంతకాలం ఆగినప్పుడు మాకు తరచుగా జాబులు వ్రాసి, భారతి వెలువడిందేమో కనుక్కొని కాపీలు పంపమని వ్రాసేవారు. తిరుపతి వేంకటకవుల రచనలంటే ప్రాణం. వేలూరి, వేటూరి, దివాకర్ల రచనలు ఎప్పుడూ ఆయన నాలుకపై నాట్యమాడుతుండేవి. భారతికి మీరేమైనా వ్రాసి పంపగూడదా? అని మేమంటే "భారతికి వ్రాసేటంత గొప్పవారమా మనం?" అనేవారు. అంతటి వినయ సౌజన్యశీలి.

భారతికి యింతకంటే ఎక్కువ అనుబంధం కలవాళ్ళు వుండివుండవచ్చు. కాని యింతటి కార్యభారం, కుటుంబ, అనారోగ్యభారం వహిస్తూ భారతిలో మమేకం చెందినవారు బహు కొద్దిగా వుంటారేమో. అందుకే ఆయన్ను ఒక విశిష్ట పాఠకునిగా గుర్తించి వ్రాస్తున్నాను. (క్షంతవ్యుడను) వారి 'శుభోదయ'మనే ఖండకావ్యమూ, 'శ్రీ కామాక్షీ మల్లికార్జున మహాత్మ్యము'నే స్థలపురాణమూ, పండితుల ప్రశంసలు చూరగొన్నవి. నాలో సాహిత్యబీజం నాటిన ఆ వ్యక్తి నా పితృదేవులు. వారు మొన్నటి జనవరి 16వ తేదీన నెల్లూరు జిల్లా (కోవూరు తా॥) తురిమెర్ల గ్రామంలో ఉత్తరాయణ పుణ్యఘడియలలో శ్రీ నృసింహైక్యము చెందినారు. కరణీకములోనేకాక-వ్యాకరణములో గూడా పలువురిచే సెబాస్ అనిపించుకొన్న ఆయన చదువు ఆనాటి ఏడవ తరగతి మాత్రమే. అందుకే విశిష్టవ్యక్తి అన్నాను. ఆయనతోబాటే భారతి చందా చెల్లిపోవడం మరో విశేషం. ఆయన 'ఆకాంక్ష'తో నా యీ మాటలు ముగిస్తున్నాను.

భారతమున్ స్వతంత్రముగ
పాలన సేయు సుపుత్రులుండి, పు
ణ్యోరు జలాశయంబులు, మ
హోత్తమ సస్యదయైన భూమి, పెం
పారు కృషీవలుల్ గలిగి
భారత మీ యగచాట్లనుండ, నో
కారుణిక ప్రభావ! హరి!
కందువ మాన్పి సుఖంబు గూర్పవే!!

—ప్రసాదరావ్ జిప్సీ
తురిమెర్ల గ్రామం (నెల్లూరు జిల్లా)
524 317

# గ్రంథ విమర్శలు

## ఎన్నెస్ కథలు

[రచన: ఎన్. యస్. ప్రకాశరావు, ప్రచురణ: సాగర గ్రంథమాల, విశాఖపట్నం, ప్రతులకు: నవోదయ పబ్లిషర్స్, ఏలూరురోడ్డు, విజయవాడ-3, పుటలు 14+216. వెల-రు.12/-]

పేదవాళ్లు మరింత పేదవాళ్లుగాను, ఉన్నవాళ్లు మరింత ఉన్నవాళ్లుగానూ మారిపోతున్న వ్యవస్థలో వచ్చి వాస్తవాల్ని బహిర్గతం చేయకుండా, అందునుగురించి మౌనం వహించే రచయితలకన్నా దేశద్రోహు లుండరన్నది యస్. యస్. ప్రకాశరావు అభిప్రాయం. లోకంలో జరుగుతున్న అన్యాయాలను బట్టబయలు చేయడానికి సాహిత్యం ఒక ఉపకరణం కావాలన్నది ఆయన ఆశయం. పాఠకుల్ని ఊహాలోకాల్లో తేలించే సాహిత్యం బాధపడేవాళ్ళని జోకొడుతుందే తప్పా, బాధపెట్టేవాళ్ళను రచ్చకీడ్వదన్నది ఆయన విశ్లేషణ. కథలద్వారా కన్నీళ్ళు పెట్టిస్తే చాలదు, అన్యాయాన్ని అధర్మాన్ని ఎదుర్కొనే ప్రేరణ యివ్వడం ముఖ్యం అంటాడాయన.

'ఎన్నెస్ కథలు' అనే ఈ సంపుటంలో పధ్నాలుగు కథలున్నాయి. ఇవి తన ఆదర్శాల కనుగుణ్యంగా రచయిత తీర్చిదిద్దిన కథలు. వసరంలా ప్రవర్తించిన ఇద్దరు మనుషుల కథ 'మనిషీ-మహిషీ'. అదిలిస్తే బెదిరిపోయే తెచ్చికోలు పటాటోపాన్ని తూర్పారబట్టిన కథ 'పేపర్ టైగర్'. డబ్బిచ్చి తల్లిని యాత్రకు పంపలేని, లంచమిచ్చి తమ్ముడికి ఉద్యోగం సంపాదించిపెట్టలేని, కట్నమిచ్చి చెల్లెలికి పెళ్ళి జరిపించలేని, ఫీజులిచ్చి భార్యకు వైద్యం చేయించలేని ఒక నిస్సహాయుడి ఆక్రోశం 'రగులుతున్న రాక్షసిబొగ్గు'. నిర్ధనుల్ని పంచభూతాలు గూడా పీక్కుతింటాయన్నది 'పగ'లోని సారాంశం. 'ప్రపంచానికి సంబంధించినంతవరకూ అంతా బాగానేవుంది' అనుకునేవాళ్లు వచ్చినిజాలను విని నిభాయించుకోలేరు. ఈ నిజానికి కథారూపం 'దరమపెబువులు'. దేవుడిపేరిట వేరూనుకపోయిన నమ్మకాలను, వాదాలను పూర్వపక్షం చేసిన కథానికలు (1) దేవుడు చేసిన మేలు (2) దేవుడి నిజాయితీ. మంచిని పెంచాలనుకున్న అమాయకుడు వట్టిమాటలతో ఆ పని సాధ్యంగాక, అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయి, జనంలో తిరుగుబాటు లేవదీసినట్టుగా చిత్రించిన జానపదకథ 'మంచి'. రాగింగ్‌లోని అమానుషత్వాన్ని వివరించిన 'సోల్‌మెండర్', దాంపత్య సాంప్రదాయాల్లో మార్పు రావాలని సూచించిన 'మొదటిరాత్రి', విశ్వవిద్యాలయాలలోని విశిష్ట వ్యక్తులని నేలబారు ప్రవర్తనకు దర్పణంలాంటి 'ఫ్రెండ్స్' మొదలైనవి ఈ సంపుటికి వైవిధ్యం చేకూర్చిన కథలు.

భర్తపట్ల పిసరంత గౌరవం లేకపోయినా మాటిమాటికీ మంగళసూత్రాన్ని కళ్ళకద్దుకునే భార్యామణులు, అమెరికామీద ఆశలు పెంచుకుని 'వెధవ ఇండియన్స్‌కు మేనర్స్ తెలియ'దని ఈసడించుకునే సుపుత్రులు, అవతలివాడి అంతస్తునుబట్టి ముఖంలో రంగులు మార్చుకునే వేషధారులు, ఏరు దాటిన తర్వాత తెప్పను తగలేసే స్వార్థపరులు, సుష్టుగా ఆరగించి వస్తున్నవాడికి ఓదార్పు మాటలు చెప్పే పెద్దమనుషులు, ఎలాంటి అప్రాచ్యపు పనికైనా తడవుకోకుండా సమర్థన చెప్పుకోగల లౌకికజ్ఞాన నిష్ణాతులు, ఎన్నెస్ కథల్లో పుష్కలంగా కనిపిస్తారు. కృతకమైన, కుటిలమైన వారి జీవనశైలిని ఆవిష్కరించడంలో, అపహాస్యం చేయడంలో ఈ రచయిత కలం ఎన్నెన్నో కొత్త పోకడలు పోయింది.

వస్తుస్వీకరణలో వైవిధ్యంతోబాటు, శిల్పంలో పరిణితిని గూడా సాధించినవి ప్రకాశరావు కథలు. ఈయన కథను ఏకాంకికలా నడిపించగలడు. జలపాతంలా దూకించగలడు. సన్నివేశాలను కళ్ళకు గట్టినట్టుగా చూపించగలడు. నవ్విస్తూ కవ్విస్తూ సెలయేటి ఉరవడిలా సాగిపోయే కథాకథనం, చివరి

దాకా ఒక్క ఊపుతో చదివించే లక్షణం ఈ కథలకు సహజాలంకారాలుగా అమరిన హంగులు.

'మన బ్రతుకులు సమర్థులైన రచయితలు రాసిన నవలల్లా లేవు. బుర్రా బుద్ధీ లేనివాడు, న్యాయం ధర్మం తెలియనివాడు, దయాదాక్షిణ్యాలు లేనివాడు రాసినట్టుగా వున్నాయి'. ఇందుకు కారణమేమిటని ప్రశ్నిస్తాడు ప్రకాశరావు. అందుకు కారణమేమిటో ఆలోచించమంటాడు.

ఇరవై ఆరుకే నూరేళ్ళు నిండి కనుమరుగై పోయిన ప్రకాశరావు కథలతోబాటు, అతడి వ్యాసాలు, అసంపూర్తి కథలు గూడా ఈ సంపుటంలో చోటు చేసుకున్నాయి. పురాణం సుబ్రహ్మణ్య శర్మగారి పీఠికతోబాటు రావిశాస్త్రిగారి ఎలిజీ, శ్రీశ్రీ విషాదలేఖ యిందులో పొందుపరచబడ్డాయి. 'ఎన్నెస్ చిరంజీవి. అతని మరో జీవితం మరో రూపంలో ఈ సంకలనంతో ప్రారంభమయిందని నా విశ్వాసం' అన్న పీఠికా రచయిత అభిప్రాయంతో సహృదయులందరూ ఏకీభవిస్తారు.

—మధురాంతకం రాజారాం

## ఒకానొక గాడిద ఆత్మకథ

రచన: కిషన్‌చందర్, ప్రచురణ. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైద్రాబాద్. పేజీలు 307, వెల: పదహారు రూపాయలు [ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైద్రాబాద్-500 001]

ఇందులో మూడు భాగాలున్నాయి. మొదటిది : ఒకానొక గాడిద ఆత్మకథ; రెండవది : తిరిగివచ్చిన గాడిద; మూడవది : నేఫాలో గాడిద. మొదటిభాగం అట్లూరి పిచ్చేశ్వరరావు అనువదించగా మిగిలిన రెండు భాగాలు నీరుకొండ హనుమంతరావు అనువదించేరు. గతంలో ఈ మూడింటిని విడివిడిగా ప్రచురించటం జరిగిందని ప్రకాశకులు చెప్పారు. గాడిద తన ఆత్మకథను పొడిగిస్తూ పోయింది కొబట్టి ఈ మూడు భాగాలను ఒకే పుస్తకంలో అందివ్వటమే సబబుగా ఉన్నది.

ఇకపోతే, ఈ పుస్తకంలోని విషయం - మనిషిలా ఆలోచించి అనుభవించి అష్టకష్టాలూ పడ్డ ఒక గాడిద ఆత్మకథ. కానీ ఇది కేవలం గాడిదల్లా బ్రతుకుతున్న మనుషుల ఆత్మకథలు అనుకున్నా తప్పులేదు. అదీ ఈ పుస్తకంలోని వ్యంగ్యం.

ఈ గాడిదకు రాజకీయాలు తెల్సు. సంఘంలో గొప్పగా చెలామణి అవుతున్నవారితో పరిచయాలున్నాయి. సినిమారంగం నుంచి శృంగార విషయాలవరకు క్షుణ్ణంగా తెలుసు. ఈ గాడిదకు చాలా విషయాలు తెలుసు కాబట్టే కాయకష్టం చేసి బ్రతికే గాడిదల సావాసం వదిలేసి గాడిదల్లా బ్రతికే మనుషుల పంచన చేరి రాజభోగాలు, అప్పుడప్పుడూ అవమానాలు పొందుతూ జీవితం గడుపుతూ వుంటుంది.

ఈ పుస్తకంలో సంఘటనలు, విషయాలు పూర్తి వ్యంగ్యంతో కూడుకున్నవి. వ్యంగ్యం చదివి ఆనందించగ వారికి, 'సామాజిక స్పృహ' ఏమాత్రం వున్నవారికైనా కూ ఇది గొప్ప పుస్తకం. అన్ని పేజీలకు ఈ ధర చాలా తక్కువ. ఇది మరో ప్లస్ పాయింట్.

—బాబు

## గ్రంథ స్వీకారాలు

### శ్రీ తెలుగువారి ఆదిచరిత్రము

వెల: రూ. 32/-లు. పోస్టేజి అదనము. ముందుగా రూ 25/-లు మనీఆర్డరు చేయువారికి, మిగతా పోస్టుఖర్చులు రచయితయే భరించి రిజిష్టర్డు పోస్టులో ఒక ప్రతి పంపగలరు.

రచయిత చిరునామా : తేకుమళ్ళ రామచంద్రరావు ఎం.ఏ.,బి.యల్. 20-117-2/1 కొత్తగ్రహారం, విశాఖపట్నం-530 001

Printed & Published for Nageswara Rao Estates Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247